


"పురుషోత్తముడు" కావ్యానికి కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు స్వీకరిస్తున్న
శ్రీచిటిప్రోలు కృష్ణమూర్తిగారు, న్యూఢిల్లీ, 17-2-2009
ప్రదాత - సాహిత్య అడాడెమీ అధ్యక్షులు శ్రీసునీల్ గంగోపాధ్యాయగారు




2008 కేంద్ర సాహిత్య అకాడెమి అవార్డుల సమర్పణోత్సవం, కమానీ ఆడికోరియం,
న్యూఢిల్లీ, 17-2-2009, ప్రదాత-సాహిత్య అడాడెమీ ఉపాధ్యక్షులు
శ్రీసుతీందర్‌సింగ్‌నూర్‌గారు, గ్రహీత -శ్రీచిటిప్రోలు కృష్ణమూర్తిగారు ( ఈ
పురుషోత్త ముడు"కావ్యం ఆచార్య తంగిరాల సుబ్బారావుగారికి అంకితం చేయబడినది.)

# చైతన్య కవిత
# 47 & 48

**సర్వధారి వసంతం – సర్వధారి శరత్తు**
**April 2008 - October 2008**

సంపాదకుడు
**తంగిరాల వెంకట సుబ్బారావు**

సహాయకులు
**దివాకర్ల రాజేశ్వరి – అంబికా అనంత్**
**గుత్తి (జోళదరాశి) చంద్రశేఖరరెడ్డి**


## చైతన్య కవితా వేదిక
#1708, "సీతావధానం", 11వ క్రాస్
1వ "జి" మెయిన్, కెంగేరి ఉపనగరం
బెంగుళూరు – 560 060

*CHAITANYA KAVITA, a journal devoted to Modern Telugu Poetry and edited and published by Prof. T.V. Subba Rao (Retd.), # 1708, "Sitavadhanam", 11th Cross, 1st "G" Main, Kengeri Satellite Town, Bangalore - 560 060: From April 2008 to October 2008.*

'చైతన్యకవిత' మహారాజ పోషకులు: 'దాన చింతామణి' శ్రీ డి.కె. ఆదికేశవులుగారు, పార్లమెంటు సభ్యులు, చిత్తూరు, ఆంధ్రప్రదేశ్.

**Pp.** : **200**

**Price** : **Rs. 100/-**

**Permanent Membership: Rs. 1000/- ($ 100/- U.S.A)**

ముఖచిత్రం : ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారు, ప్రసిద్ధకవి, పరిశోధకుడు, కథారచయిత, నవలా రచయిత, విమర్శకుడు, విద్యావేత్త, హైదరాబాద్

అట్టవెనుక : ప్రముఖ విమర్శకుడు, కవి, పండితుడు, విద్యావేత్త
కీ.శే. ఆర్. ఎస్. సుదర్శనంగారు, (1927-2001)

అక్షరాలంకరణ : ఆచార్య పి.సి. నరసింహారెడ్డి, హైదరాబాద్.
'కళాప్రపూర్ణ' శ్రీ బాపు, చెన్నై.

**For Copies** : **(1) M/s. Visalaandra Book House,**
Hyderabad and all its Branches

**(2) Prof. T.V. Subba Rao (Retd.)**
# 1708, "Sitavadhanam", 11th Cross
1st 'G' Main, Kengeri Satellite Town
BANGALORE - 560 060
Phone No. 080-65322742; Cell: 92434 22742

గమనిక : శాశ్వతచందా ఎం.ఓ. రూపంలో కాని, డి.డి. రూపంలో కాని "ప్రొ॥ టి. వి. సుబ్బారావు" పేరుతో మాత్రమే పంపాలి. చెక్కులు అంగీకరించబడవు. (బెంగుళూరు నగరంలో ఉన్నవారు మాత్రం చెక్కులు ఇవ్వవచ్చును.)

**DTP** : **Sri Lakshmi Graphics**
Bangalore-560 079, Phone: 080-23100603

**Printed by** : **Sree Laxmi Lasergraphics**
Bangalore - 560 040, Phone: 080-23300093

# అంకితం - 1

## (సర్వధారి వసంతసంచిక)

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచేత తిరుమల తిరుపతి దేవస్థానముల
పాలకమండలికి రెండవపర్యాయం అధ్యక్షులుగా నియమింపబడిన
ప్రముఖ పారిశ్రామికవేత్త, "దాన చింతామణి" బిరుదాంకితులు,
చిత్తూరు పార్లమెంటు సభ్యులు అయిన

## శ్రీ డి.కె. ఆదికేశవులు గారికి ...

* * * * *

కర్ణాటక రాష్ట్రంలోను తమిళనాడులోను తెలుగు పాఠశాలలకు,
తెలుగువారికి, తెలుగు భాషకు అమోఘమైన సేవలు అందిస్తున్న
"అక్షయపాత్ర", "కలియుగ దానకర్ణుడు"
పరుచూరి గ్లోబల్ ఫౌండేషన్ (బెంగుళూరు) అధినేత అయిన

## శ్రీ పరుచూరి సురేంద్రకుమార్ గారికి ...

* * * * *

బెంగుళూరులోని తెలుగు విజ్ఞానసమితికి నూతన అధ్యక్షులుగా
ఎన్నిక అయిన ప్రసిద్ధ పారిశ్రామికవేత్త,
ఆల్ ఇండియా కాంట్రాక్టరు అయిన

## శ్రీ జె. ఎస్. రెడ్డి గారికి ...

ఆయురారోగ్యసంపత్పరంపరాభివృద్ధిని ఆకాంక్షిస్తూ ...

– తంగిరాల వెంకట సుబ్బారావు

# అంకితం - 2

## (సర్వధారి శరత్సంచిక)

**15-12-2009** నాటికి **88** శరత్తులు పూర్తి చేసుకున్న
కవి, పండితుడు, పరిశోధకుడు, ఉత్తమ ఉపాధ్యాయుడు,
శాంతి స్వరూపుడు, సౌజన్యధన్యుడు, ప్రియమిత్రుడు
అజాతశత్రువు అయిన -

ఆచార్య

## రత్నాకరం శంకరనారాయణరాజుగారికి...

మా **40** సంవత్సరాల స్నేహానికి చిన్ని గుర్తుగా ...

- తంగిరాల వెంకట సుబ్బారావు

# వసంత కోకిలలు - శరత్తారలు

## సంపాదకీయం–1:

# పాతాళానికి చేరిన ప్రమాణభాష

గ్రాంథిక భాషను వర్జించి, వ్యావహారిక భాషను వివిధ రచనలలో ఉపయోగించడానికి పండితులతో పోట్లాడి నానా అవస్థలూ పడ్డారు – గిడుగు రామమూర్తి పంతులుగారు. అయితే గిడుగువారు ఉద్దేశించిన 'వ్యావహారిక భాష' అంటే ఏమిటి? "శిష్ట వ్యావహారిక భాష". శిష్టులంటే ఎవరు? విద్యావంతులు. పూర్వం బ్రాహ్మణులు విద్యావంతులుగా ఉండేవారు. వేదాలు, సంస్కృతం చదువుకునేవారు. ఆంగ్లేయులు వచ్చాక ఆంగ్లభాషను కూడా క్షుణ్ణంగా నేర్చుకున్నారు. జాతీయోద్యమకాలంలో ప్రజలకు నాయకత్వాన్ని వహించారు. అందువల్ల వారి భాష "శిష్ట వ్యావహారికం" అయింది. శ్రామికులు, కర్షకులు, విద్యావిహీనులు, బ్రాహ్మణేతరులు అయినవారి భాష "శిష్టేతర భాష" (జానపద భాష)గా ఉండేది.

క్రమక్రమంగా బ్రాహ్మణులు ఆర్థికంగా చితికిపోయారు. వేదాధ్యయనం, సంస్కృత కావ్యాలు చదవడం మానేశారు. రాజకీయ నాయకత్వం పోయింది. దళితులకన్నా వెనుకబడిపోయారు. బ్రాహ్మణేతరులు ఆర్థికంగా పుంజుకున్నారు. బ్రాహ్మణుల ఈనాము భూములన్నీ కొనేసుకున్నారు. (పూర్వం రాజులు, జమీందారులు వేదపండితులకు భూములు దానం చేశారు. వాటికి "ఈనాము భూములు" అని పేరు.) రాజకీయాధికారం చేజిక్కించుకున్నారు. విద్యారంగంలోనూ ముందంజ వేశారు. కాబట్టి ఇప్పుడు "విద్యావంతులు" అనే పదానికి పూర్వంలోలాగా "బ్రాహ్మణులు మాత్రమే" అనే అర్థం పోయింది. "చదువుకున్న అన్ని కులాలవారూ" అనే అర్థం ఏర్పడింది. ఈ విద్యావంతులైన అన్ని కులాలవారు ఇరవై ముప్పైఏళ్ళ క్రితం వరకూ చక్కని శిష్టవ్యావహారికం మాటలాడేవారు. తరువాత, అది క్రమక్రమంగా జానపద భాషగా మారిపోవడం ప్రారంభమయింది.

ఆంధ్రప్రదేశ్‌లో అనేక మండలాలు ఉన్నాయి. ప్రతి జిల్లా ఒక మండలమే. ఒక్కొక్క జిల్లాలో ఒక్కొక్క రకమైన తెలుగుభాష ఉంది. అవే మాండలికాలు. గురువర్యులు ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు ఆంధ్రప్రదేశ్‌లో నాలుగు ప్రధాన మండలాలను గుర్తించారు. (1) పూర్వ మండలం (కళింగ) (2) దక్షిణ మండలం (రాయలసీమ) (3) ఉత్తర మండలం (తెలంగాణా) (4) మధ్య మండలం (ఇతర

కోస్తాలు). ఇవి స్థలమాండలికాలు. ప్రతి మండలంలోను అనేక కులాలు ఉన్నాయి. ఒక్కొక్క కులానికి ఒక్కొక్క భాష ఉంది. ఇవి కులమాండలికాలు.

ఈ కులమాండలికాల మీద కూడా స్థలమాండలికాల ప్రభావం ఉంటుంది. అందరూ విద్యావంతులైనా, బ్రాహ్మణులే అయినా, శ్రీకాకుళం, విజయవాడ, అనంతపురం, కరీంనగర్‌లలో ఉండే బ్రాహ్మణుల భాష ఒకే రకంగా ఉండదు. ప్రతి ప్రాంతానికీ మారిపోతుంది. (అలాగే ఆయా పట్టణాలలో ఉండే దళితులు కూడా ఒకే విధమైన భాషను మాటలాడరు.) అనేక సాంఘిక రాజకీయ కారణాలవల్ల కృష్ణాజిల్లాలోని విజయవాడ చుట్టుప్రక్కల ఉన్న విద్యావంతులైన బ్రాహ్మణుల భాష "ప్రమాణ భాష" (Standard Dialect) గా మారింది. 1947 నుండి పత్రికలు, రేడియో, సినిమాలు, ఈ భాషనే అనుసరిస్తున్నాయి. అయితే ఇటీవల ఈ ప్రమాణభాష భ్రష్టుపట్టి శిష్టేతరభాషగా మారిపోయింది. శిష్టభాషకు - శిష్టేతర భాషకు (జానపద భాషకు) ఉండే భేదాలను భాషాశాస్త్రవేత్తలు (ప్రొ॥ భద్రిరాజు కృష్ణమూర్తిగారు) ఈ క్రింది విధంగా గుర్తించారు:-

| శిష్టోచ్చారణలో | జానపదోచ్చారణలో |
|---|---|
| 1. (a) ఒత్తులు నిలుస్తాయి:<br>భాగవతం, అధర్మం | 1. (a) ఒత్తులు పోతాయి:<br>బాగవతం, అదర్మం |
| (b) హకారం నిలుస్తుంది:<br>హరివిల్లు, రోహిణి | (b) హకారం పోతుంది:<br>అరిల్లు, రోయిణి |
| 2. అద్విరుక్త "చ" కారం అంతటా నిలుస్తుంది.<br>చవుడు, చుక్క, పలచన | 2. "చ" కారం సకారంగా మారుతుంది<br>సవుడు, సుక్క, పలసన |
| 3. పదాది "వ" కారం నిలుస్తుంది: (ఇ,ఈ, ఎ, ఏ ల ముందు)<br>విల్లు, వీథి, వెండి, వేడి | 3. "వ" కారం పోతుంది:<br>యిల్లు, యీది, యెండి, యేడి |
| 4. సంయుక్త హల్లులు నిలుస్తాయి:<br>భక్తి, చేస్తాడు, కలెక్టర్ | 4. (a) హల్లులు సమీకరణం పొందుతాయి:<br>బత్తి, సేత్తాడు<br>(b) స్వరభక్తి రావచ్చు: కలకటేరు |



తెలుగు విజ్ఞాన సమితి అధ్యక్షులు శ్రీజె. ఎస్. రెడ్డిగారి నుండి శ్రీకృష్ణదేవరాయ పురస్కారాన్ని స్వీకరిస్తున్న
"దానచింతామణి" శ్రీడి. కె. ఆదికేశవులుగారు, బెంగుళూరు, 30-11-2008



“కలియుగ దానకర్ణుడు” శ్రీపరుచూరి సురేంద్ర కుమార్
పరుచూరి గ్లోబల్ ఫౌండేషన్ అధినేత, బెంగుళూరు



శ్రీజె. ఎస్. రెడ్డిగార్నిని సత్కరిస్తున్న ప్రముఖ కవి శ్రీపతాభిగారు,
బెంగుళూరు, 14-1-2006 సంక్రాంతి




ఆచార్య రత్నాకరం శంకర నారాయణరాజుగారికి శ్రీరస సత్కారం
బెంగుళూరు, 15-11-2008 (89వ జన్మదినం)



శ్రీఉత్పల సత్యనారాయణాచార్యులవారికి తిలక్ సాహిత్య పురస్కారం (2006)
ఇస్తున్న నన్నయ పీఠం అధ్యక్షులు డా॥ జీయస్వీ ప్రసాద్‌గారు, హైదరాబాద్



శ్రీదుగ్గిరాల రామారావుగారికి తిలక్ సాహిత్య పురస్కారం (2007)
ఇస్తున్న నన్నయ పీఠం కార్యదర్శి శ్రీసుశర్మగారు, హైదరాబాద్



ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥ వై. యస్. రాజశేఖరరెడ్డిగారిచే ఆచార్య
తంగిరాల సుబ్బారావుగారికి ఉగాది పురస్కారం, బెంగుళూరు, 3-4-2006



ఆంధ్రప్రదేశ్ అధికారా భాషా సంఘం అధ్యక్షులు శ్రీఎ. బి. కె. ప్రసాద్‌గారిచే
ఆచార్య తంగిరాల సుబ్బారావుగారికి సన్మానం, బెంగుళూరు, 4-11-2007



**NIMHANS**

*Presents*



Sahasra Avadhani

**Dr. Garikipati Narasimha Rao**

**M.A., Ph.D**

అవధాన మహిమ – మెదడుమీద పరిశోధన (చూ. పుటలు 93-99)

పరిశోధకులు ఆచార్య తంబిశెట్టి రామకృష్ణగారు, బెంగుళూరు



పరిశోధకులు ఆచార్య రామకృష్ణగారు –

సహస్రావధాని డా॥ గరికిపాటి నరసింహారావుగారు



పెద్దిభొట్ల బ్రహ్మయ్య స్మారక రసధుని సాహితీ పురస్కారం (2007) స్వీకరిస్తున్న
ఆచార్యతంగిరాల సుబ్బారావుగారు, పాలకొల్లు, ప. గో. జిల్లా. 29-2-2008



ప్రముఖ కథా రచయిత శ్రీమునిపల్లె రాజుగారికి తిలక్ సాహిత్య పురస్కారం
(2008) ఇస్తున్న శ్రీనన్నయ భట్టారక పీఠం, తణుకు



డా॥ పింగళి వెంకటకృష్ణారావుగారికి శ్రీతంగిరాల వేంకటకృష్ణ సోమయాజులుగారి పద్యకావ్య పురస్కారం (2008) ఇస్తున్న శ్రీనన్నయ పీఠం, తణుకు



డా॥ జీయస్వీ ప్రసాద్‌గారు
శ్రీనన్నయ్య పీఠం అధ్యక్షులు



శ్రీకృష్ణదేవరాయల పాత్రలో
డా॥ జీయస్వీ ప్రసాద్‌గారు

| శిష్టోచ్చారణలో | జానపదోచ్చారణలో |
|---|---|
| 5. శ,ష,స ల భేదం ఉంటుంది:<br>శాస్త్రి, భాష, కాసు | 5. శ,ష లు సకారంగా మారుతాయి:<br>సేత్రి, బాస, కాసు |
| 6. మూర్ధన్య దంతమూలీయ భేదం నిలుస్తుంది:<br>పల్లం: పళ్ళెం; దాన్ని: వాణ్ణి | 6. మూర్ధన్యాలు దంతమూలీయా లవుతాయి:<br>పల్లం: పల్లెం; దాన్ని: వాన్ని |
| 7. 'f', 'ప' వేరుగా ఉంటాయి:<br>ఆఫీసు, కాఫీ, తోఫు | 7. 'f', 'ప'గా మారుతుంది:<br>ఆపీసు, కాపీ, తోపు |
| 8. పదాది 'గ' కారం దేశ్య శబ్దాల్లో నిలుస్తుంది:<br>గట్టు, గడ్డి, గండి | 8. 'గ' – 'గె' గా మారుతుంది.<br>గెట్టు, గెడ్డ, గెండి. |

**శిష్టోచ్చారణ – జానపదోచ్చారణల మధ్య నేను గమనించిన మరికొన్ని భేదాలు:**

| | |
|---|---|
| 1. బావమరది | 1. బామ్మర్ది |
| 2. పచ్చిమిరపకాయ | 2. పచ్చిమిరగాయ్ |
| 3. (అది బాగా వుండదు)<br>> అది బాగుండదు<br>> అది బావుండదు > | 3. అది బాగోదు |
| 4.1. – మ – > –వఁ –<br>(వ్రాతలో) ఏమిటి?<br>(ఉచ్చారణలో) ఏవిఁటి? | 4.1. – మ – > – ం – – ϕ –<br>> ఏంటి? , ఏటి? |
| 4.2. (వ్రాతలో) జామకాయ<br>(ఉచ్చారణలో) జావఁకాయ | 4.2 జాంకాయ |
| 4.3. (వ్రాతలో) మామగారు<br>(ఉచ్చారణలో) మావఁగారు | 4.2 మాంగారు |
| 5. – అఁట<br>(వ్రాతలో) చేశాడట, చూశాడట | 5. – అంట<br>చేశాడంట, చూశాడంట |

| | శిష్టోచ్చారణలో | | జానపదోచ్చారణలో |
|---|---|---|---|
| | (ఉచ్చారణలో) చేశాట్ట, చూశాట్ట | | (నిజానికి ఈ ఉచ్చారణ తప్పుకాదు. కాని శిష్టులు దీనిని తప్పుగా భావిస్తారు. "అఁట, ఇఁక, చుఁడు" శబ్దాలలోని ఖండబిందువు పూర్ణబిందువు కావడం బాలవ్యాకరణ సమ్మతమే. |
| 6.1 | "వరి వెన్ను", "వరి ఎన్ను" రెండూ సాధు శబ్దాలే. కాని శిష్టులు "వరి ఎన్ను"ను అసాధువుగా భావిస్తారు. ఇది సరి కాదు. | | "ఒరి ఎన్ను": "వరి" > "ఒరి" అని ఉచ్చరించడం జానపదం. 'వెన్ను"ను "ఎన్ను"గా ఉచ్చరించడం మాత్రం తప్పుకాదు. |
| 6.2 | విస్తిరి (పెట్టె)<br>ఈ పదంలో పదాదిని వకారం ఉచ్చరించడం తప్పు. ఇది "కృతక ప్రామాణికం" (Hyper Standardisation) | 6.2 | ఇస్తిరి (పెట్టె)<br>ఇది ఒప్పు. "ఇస్తిరి" హిందీపదం |
| 7. | గేదె (=బఱ్ఱె)<br>(–ఎ) (గ్+ఏ+ద్+ఎ) | 7. | గేద<br>(–అ) (గ్+æ:+ద్+అ) |
| 8. | వెళ్ళిపోతుంది (Future tense)<br>అయిపోతుంది (Future tense)<br>(–ప్+ఓ–)<br>వచ్చేస్తుంది (Future tense)<br>వెళుతోంది (Present Continuous tense)<br>వెళుతుంది (Future tense) | 8. | ఎలిప్రోద్ది<br>అయిప్రోద్ది<br>(ప్+'ఓ' కి 'ఊ'కి మధ్య ధ్వని)<br>ఒచ్చేద్ది ('ఏ–ఆ'లకు మధ్య ధ్వని:æ:)<br>ఎల్తాంది<br>ఎల్తాది |

9.1 పదాది 'వ' కారమే కాదు, పదమధ్య వకారం కూడా జానపదుల్లో లోపిస్తుంది. (రెండు పదాలు దగ్గరగా ఉచ్చరించినప్పుడు)

| | |
|---|---|
| అవే కళ్ళు | అయే కల్లు (–వ– > – φ–) |
| ఒక వేళ | ఒకేల (–ళ > – ల) |

| శిష్టోచ్చారణలో | జానపదోచ్చారణలో |
|---|---|
| 9.2 ఒక్కొక్కప్పుడు శిష్టులలో కూడా (సమాసాలలో) పదమధ్య వకారం లోపిస్తుంది: | |
| –వా –>–ఆ– | –ఆ–>–ఓ– |
| చిన్నవాడు > చిన్నాడు | చిన్నోడు > సిన్నోడు |
| పెద్దవాడు > పెద్దాడు | పెద్దోడు |
| పిచ్చివాడు > పిచ్చాడు | పిచ్చోడు |
| మంచివాడు > మంచాడు | మంచోడు |
| 10. – ఉ – | – అ – |
| ఉంటుంది | ఉంటంది |
| చూస్తున్నాను | చూస్తన్నాను |
| చేస్తున్నాను | చేస్తన్నాను |
| వస్తున్నాను | వస్తన్నాను |
| ఒప్పుకుంటున్నాను | ఒప్పుకుంటన్నాను |
| ఇచ్చుకుంటుంది | ఇచ్చుకుంటది |
| 11. – ఓ – | – ఆ – |
| దొరుకుతోంది | దొరకతా ఉంది |
| చేస్తోంది | చేస్తా ఉంది > చేత్తా ఉంది |
| చూస్తోంది | చూస్తా ఉంది > సూత్తా ఉంది |
| ఆకలేస్తోంది | ఆకలేస్తా ఉంది |
| 12.1 "ఉంది" (< ఉన్నది) మొదలైన క్రియాపదాల్లో చివర ఉన్న "ఇ"ని స్పష్టంగా ఉచ్చరిస్తారు. | "ఇ"కి "అ"కి మధ్యలో ఉచ్చరిస్తారు. |
| 12.2 – ఆ > – æ: ('బ్యాంకు' లోని 'యా') | "–ఆ" గానే ఉంటుంది. |
| ఇది మనదా? > ఇది మందా? | ఇది మందా? |
| 12.3 – ఇ | –φ |
| ఉపయోగపడతాయి | ఉపయోగపడతయ్ ('తా'లోని దీర్ఘాచ్చు హ్రస్వాచ్చుగా కూడా మారింది) |

కొన్ని పత్రికలు మధ్య మధ్య వ్రాతలో "ఏమిటి" (ఉచ్చారణలో "ఏవిఁటి") అనే పదాన్ని "ఏంటి" అని శిష్టేతరంగా వ్రాస్తున్నాయి. ఇదొక్కటే బాధగా ఉంది. తక్కిన విషయాలలో పత్రికలు ఈనాటికీ శిష్ట వ్యావహారికాన్ని చాలా వరకూ కాపాడుకుంటూ వస్తున్నాయి.

సినిమాలు సమాజం మీద ఎక్కువ ప్రభావాన్ని చూపుతాయి. ఈ సినిమాలలో మూడు తరాలపాటు చక్కటి ప్రమాణ భాషను పాటించారు. మొదటి తరంలో చిత్తూరు నాగయ్య, సి.హెచ్. నారాయణరావు; రెండవ తరంలో అక్కినేని నాగేశ్వర రావు, ఎన్.టి. రామారావు, కాంతారావు, యస్వీ రంగారావు; మూడవ తరంలో కృష్ణ, శోభన్‌బాబు – చక్కటి ప్రమాణ భాషను మాటలాడుతూ వాచకాభినయాన్ని ప్రదర్శించారు. ఎన్.టి.ఆర్. "జ్ఞ"ను "గ్న"గా ఉచ్చరించేవాడు. ఆయన కృష్ణాజిల్లాలోని రైతు కుటుంబానికి చెందినవాడు కాబట్టి అలా ఉచ్చరించేవాడని అనుకోడానికి వీలులేదు. అక్కడ విద్యావంతులైన బ్రాహ్మణులు కూడా అలాగే ఉచ్చరిస్తారు. ఉదా॥ మా గురువుగారైన పింగళి లక్ష్మీకాంతంగారు అలాగే ఉచ్చరించేవారు. పైగా "జ్ఞ" కి "గ్న" కి యతి మైత్రి కూడా ఉంది. అయినా ఇది ప్రమాణభాషలో చేరలేదు. నాల్గవతరమైన చిరంజీవి, నాగార్జున, వెంకటేష్, బాలకృష్ణ, శ్రీకాంత్, జగపతిబాబు మొదలైన వారినుండి ప్రమాణ భాష పతనమై, శిష్టేతరం (జానపదం) విజృంభించింది. "ఆడు, ఈడు, ఒత్తాడు, ఎల్తాడు, ఎలిపోద్ది, ఒచ్చేద్ది, కూకో, లెగు, ఎల్లు, ఏంటి?, వస్తన్నాడు, చూస్తన్నాడు, చేస్తన్నాడు" ఇత్యాది భాషను ఈ నాల్గవ తరం హీరోలు "ఇదే ప్రమాణ భాష, మీరంతా దీనినే మాటలాడండి" అనే రీతిలో ప్రజలలోకి పంపిస్తున్నారు. ఈనాడు విద్యావంతులైన బ్రాహ్మణులతో సహా ఈ "శిష్టేతర ప్రమాణభాష"నే అనుసరిస్తున్నారు. గిడుగువారు పోరాడి సాధించిన వ్యావహారిక భాష, విద్యావంతులైన బ్రాహ్మణుల "ప్రమాణ భాష"గా (శిష్టుల ప్రమాణభాషగా) మారి, క్రమక్రమంగా బ్రాహ్మణేతరులు ఆర్థికంగా రాజకీయంగా బలపడడంతో, ప్రసార మాధ్యమాలు – ముఖ్యంగా పత్రికలు, సినిమాలు, టి.వి.లు పూర్తిగా వారి అధీనంలోకి పోవడంతో, శిష్టేతర భాష (జానపద భాష) నేడు "ప్రమాణ భాష"గా మారిపోయింది. ఈ శిష్టేతర ప్రమాణ భాషనే బ్రాహ్మణులతో సహా అందరూ అనుసరించడం, ఆశ్చర్యకరంగానూ, నాలాంటి వారికి మిక్కిలి బాధాకరంగానూ ఉంది. పూర్వం బ్రాహ్మణుల పిల్లలు "ఆడు–ఈడు" అని ఉచ్చరిస్తుంటే ఇంట్లో తల్లిదండ్రులు 'వాడు – వీడు' అని సంస్కరించేవారు. ఇప్పుడు క్షణం తీరిక లేకుండా ఉండే ఉద్యోగస్థులైన తల్లిదండ్రులకు పిల్లల భాషా సంస్కారానికి వ్యవధి ఎక్కడ ఉన్నది?

సినిమా నటులకన్న, రంగస్థల నాటక నటులు భాషోచ్చారణ విషయంలో చాలా గొప్పవారు. వారు సమాస భూయిష్ఠమైన గ్రాంథిక భాషను మాటలాడటం వల్లా, క్లిష్టమైన పద్యాలను అలవోకగా పాడటం వల్లా, వారి నాలుకలు పదునెక్కి, చక్కటి ఉచ్చారణ వారికి వశమయింది. సినిమాలలో ఈ అవకాశం ఇప్పుడు లేదు. పూర్వం కొంతవరకు ఉండేది.

విద్యావంతులైన బ్రాహ్మణులందరూ స్వచ్ఛమైన భాష మాటలాడుతారనీ, బ్రాహ్మణేతరులు విద్యావంతులైనా సరే జానపద భాష మాటలాడుతారనీ నా ఉద్దేశం కాదు. సంస్కృత భాష, తెలుగుభాష, ఆయా సాహిత్యాలు అధ్యయనం చేసినవారు, వారు బ్రాహ్మణులైనా, బ్రాహ్మణేతురులైనా స్వచ్ఛమైన భాష మాటలాడటానికి అవకాశం ఉంది. నా జీవితంలో తటస్థపడిన కొందరు బ్రాహ్మణేతర మిత్రులు ఎంతో స్వచ్ఛమైన తెలుగు భాషను మాటలాడటం విని ఎంతగానో ఆనందించాను. ఉదాహరణ: డా॥ సి. నారాయణరెడ్డిగారు (రెడ్డి) ప్రొ॥ అడపా రామకృష్ణారావుగారు (కాపు); ప్రొ॥ తుమ్మపూడి కోటీశ్వరరావు; (కాపు) ప్రొ॥ రవ్వా శ్రీహరిగారు (పద్మశాలి); డా॥ కడియాల రామమోహనరాయ్‌గారు (కమ్మ); ప్రొ॥ చేకూరి రామారావుగారు (కమ్మ); ప్రొ॥ తంబిశెట్టి రామకృష్ణగారు (బలిజ); డా॥ వి.వి.ఎల్. నరసింహారావుగారు (విశ్వబ్రాహ్మణ); శ్రీ కోట పున్నయ్యగారు (మాదిగ); శ్రీ జువ్వాడి గౌతమరావుగారు (వెలమ) మొదలైనవారు బ్రాహ్మణులకన్నా స్వచ్ఛంగా మాటలాడుతారు.

భాషోచ్చారణ విషయంలో పూర్వం బ్రాహ్మణులు ఎంత పట్టుదలగా ఉండేవారో తెలియజేయడానికి ఒక సజీవమైన ఉదాహరణం (living example) తెలియజేస్తాను. ఇది బెంగుళూరు విశ్వవిద్యాలయంలో నాతో కలిసి పనిచేసిన గొప్ప పండితుడు కీ.శే. విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారు చెప్పిన సంఘటన. శాస్త్రిగారిది కృష్ణాజిల్లాలోని "శాయిపురం" అగ్రహారం. అక్కడ ఆయన మిత్రుడు తన కూతురు వివాహసంబంధం మాటలాడటం కోసం శాస్త్రిగారిని తోడుగా తీసికొని ఒక ఊరు వెళ్ళాడు. పెళ్ళికొడుకు ఇంట్లోనే ఉన్నాడు. అతని తండ్రి లేడు. ఆ పెళ్ళికొడుకును శాస్త్రిగారు ఇలా ప్రశ్నించారు: "ఒరేయ్ అబ్బాయ్! మీ నాన్న ఎక్కడ ఉన్నాడు?". దానికి ఆ పెళ్ళికొడుకు "పొలం <u>కాడ</u> ఉన్నాడు" అని సమాధానం చెప్పాడు. వెంటనే శాస్త్రిగారి మిత్రుడు: "శాస్త్రిగారూ! ఇక రండి వెళ్ళిపోదాం!" అని శాస్త్రిగారిని తీసికొని, వచ్చిన దారినే వెళ్ళిపోయాడు. "పొలం <u>దగ్గర</u> ఉన్నాడు" అని శిష్ట భాషలో చెప్పవలసిన బ్రాహ్మణ యువకుడు, "పొలం <u>కాడ</u> ఉన్నాడు" అని జానపదోచ్చారణలో చెప్పేసరికి,

ఆ పెళ్ళి సంబంధాన్ని వదులుకున్నాడు శాస్త్రిగారి మిత్రుడు. భాషా విషయంలో ఇంత పట్టుదలగా, శిష్టోచ్చారణను కాపాడుకొనేవారు పూర్వం బ్రాహ్మణులు. ఇప్పుడు పరమ దుర్భరంగా జానపద భాష మాటలాడుతున్నారు. పోనీ, చదువు ఎక్కువగా లేకుండా, పొలంలో వ్యవసాయం చేసుకొనే బ్రాహ్మణయువకులు జానపదభాష మాటలాడితే సహించవచ్చు. విద్యావంతులైన బ్రాహ్మణ యువతీయువకులు జానపదభాష మాటలాడటం పరమ దుర్భరంగా ఉంది. దీనికి కారణం అన్ని రంగాలలోను బ్రాహ్మణులు పతనం కావడమే. వేదాధ్యయనం వదిలేశారు. సంస్కృత సాహిత్యం చదవడం మానేశారు. కనీసం తెలుగు సాహిత్యం కూడా చదవడం లేదు. (ఈ మూడు పనులూ చేస్తే ఎవరి నాలుక అయినాసరే స్వచ్ఛమైన భాష మాటలాడగలుగుతుంది). పూర్వం వేదాధ్యయనం కోసం రాజులు జమిందారులు ఇచ్చిన అగ్రహారాలు, ఈనాము భూములు అన్నీ పోగొట్టుకున్నారు. ఆర్థికంగా చితికిపోయారు. రాజకీయ ప్రాధాన్యం పోయింది. సాంస్కృతికంగా కూడా పతనమయ్యారు. ఆహార విహారాల్లో బ్రాహ్మణేతరుల్ని అనుకరిస్తున్నారు. ఈనాడు మద్యమాంసాలు ముట్టని బ్రాహ్మణ యువకులు 5% కూడా ఉన్నారో లేరో! భూమి, బంగారం, రాజకీయమైన అధికారం, ప్రసార మాధ్యమాలు (పత్రికలు, సినిమాలు, టి.వి.లు) ఎవరి చేతుల్లో ఉంటాయో వాడే నేటి రాజు, రారాజు. వాడి భాషనే అందరూ అనుకరిస్తారు. పూర్వం ఇవి బ్రాహ్మణుల చేతుల్లో ఉండేవి. ఇప్పుడు బ్రాహ్మణేతరుల చేతుల్లో ఉన్నాయి – ముఖ్యంగా కమ్మ, రెడ్డి కులాల్లో ఉన్నాయి. కాపులు, వెలమలు, ఇతర వెనుకబడిన కులాలవారు, దళితులు – అందరూ కలిసి, కమ్మ–రెడ్డి కులాలవారి అధికారాన్ని లాక్కోవాలని భగీరథప్రయత్నాలు చేస్తున్నారు. తమతోపాటు ఈనాడు వెనుకబడిన బ్రాహ్మణులనుకూడా కలుపుకోవాలని చూస్తున్నారు. రాజ్యాధికారం కోసం జరుగుతున్న ఈ కుల పోరాటాలు ఎలా పరిణమిస్తాయో తెలియదు. దీనికి తోడు, మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్టుగా, తెలంగాణా ఉద్యమం ఒకటి! తెలంగాణా వస్తే, రాయలసీమ, కోస్తాలు కూడా విడిపోతాయి. కోస్తాలో "ఉత్తర కోస్తా" కూడా విడిపోతానంటోంది. అప్పుడు తెలుగువాడి పతనం సర్వం సంపూర్ణమై గంగానదిలాగ "ఆకాశంబున నుండి శంభుని శిరంబు..." అన్నట్టుగా పాతాళానికి చేరడం తథ్యం! అమరజీవి పొట్టి శ్రీరాములుగారు ప్రాణత్యాగం చేసింది ఈ పతనం కోసమా? పూర్వం నిరుద్యోగులైన రాజకీయవేత్తలు ప్రత్యేక ఉద్యమాలు నడిపేవారు. ఇప్పుడు వాళ్ళతోపాటు బుద్ధిహీనులైన విద్యావేత్తలు, విద్యార్థులు, కవులు, రచయితలు కూడా చేతులు కలపడం దురదృష్టకరం. సామాన్య ప్రజలకు కూడు, గుడ్డ, నీడ ముఖ్యంకాని ప్రత్యేక ఉద్యమాలు కావు.

ఇంతకీ నా సంపాదకీయ సారాంశం ఏమిటంటే - దేశసంపద, రాజ్యాధికారం ఎవరి చేతుల్లో ఉంటే వాడే రాజాధిరాజు. వాడి భాషనే ప్రజలందరూ అనుకరిస్తారు. ఈనాడు ఇవి బ్రాహ్మణేతరుల చేతుల్లో ఉన్నాయి. కాబట్టి వారిభాషే (జానపదభాషే) ప్రమాణ భాషగా చెలామణీ అవుతోంది. నిజమైన విద్య, సంస్కారము గలవారికి ఈ భాష మిక్కిలి దుర్భరంగా ఉంది. బ్రాహ్మణులైనా లేక ఏ కులంవారైనా విద్యా సంస్కారంతోపాటు భాషాసంస్కారాన్ని కూడా సంపాదించుకోవాలి. శిష్టమైన ఉచ్చారణతో ప్రమాణభాషను కాపాడుకోవాలి. భవతు!

9-10-2008 - తంగిరాల

సర్వధారి విజయదశమి

**ముఖ్యగమనిక:** ప్రియమిత్రులు, ప్రముఖ భాషాశాస్త్రవేత్త అయిన ప్రొ॥ చేకూరి రామారావు గారు - "ఒక భాషలో అన్ని మాండలికాలూ (కుల మాండలికాలు, స్థల మాండలికాలు అన్నీ) గొప్పవే. అన్నీ ఆదరించదగినవే. శిష్టవ్యావహారికం, జానపద భాష, గ్రాంథిక భాష అన్నీ గొప్పవే. అన్నీ పరిరక్షించుకోవలసినవే. వీటిలో ఒకటి తక్కువ, ఒకటి ఎక్కువ అని నిర్ణయించలేము"-అని ఇదివరలో నాతో అన్నారు. నేను బ్రాహ్మణ దురహంకారంతో పై విధంగా వ్రాశానేమో నాకు తెలియదు. పైగా నేను జానపద విజ్ఞానవేత్తను కూడా! ఇలా వ్రాయడాన్ని చూచి కొందరు ఆశ్చర్యపోతున్నారు. అయితే నాకొక అనుమానం - పూర్వం అందరికీ అనుసంధాన భాషగా "గ్రాంథిక భాష" ఉండేది. దానిని వ్యావహారిక భాషవైపు మరల్చారు గిడుగువారు. మనకు వివిధ మాండలిక భాషలనుండి ఒక "ప్రమాణ భాష" అనుసంధాన భాషగా ఏర్పడింది. దానిని మనం రక్షించుకోవాలి కదా! ఎవరి మాండలికంలో వారు వ్రాసుకుంటూ పోతే 15 కోట్ల మంది తెలుగు వాళ్ళకి అర్థం కావడం ఎలాగ? అందరికీ అర్థంకావడం కోసం ఒక ప్రమాణభాష అవసరం. ప్రపంచ దేశాలకు అనుసంధాన భాషగా ఇంగ్లీషు భాష ఎలా అవసరమో, తెలుగు వాళ్ళందరికీ ఒక అనుసంధాన భాషగా ఒక ప్రమాణ భాష అవసరం. అది దెబ్బతింటోంది. - ఇదే నా బాధ! కాళోజీ మాటల్లో చెప్పాలంటే - ఇదే "నా గొడవ"!!



## సంపాదకీయం-2:

# మతాంతర వివాహాలు - హిందూమత క్షీణత

దేశమంతటా వ్యాపిస్తున్న ప్రపంచీకరణ (Globalisation) ప్రభావంతో ఇటీవల హిందూమతానికి చెందిన యువతీయువకులు, ఇతర మతాలలోని - ముఖ్యంగా ముస్లిం, క్రైస్తవ మతాలలోని యువకుల్ని యువతుల్ని ప్రేమించి పెళ్ళి చేసుకుంటున్నారు. అన్యమతాల యువకులు, యువతులు మన మతంలో చేరిపోతే ఫరవాలేదు. కాని అలా జరగడం లేదు. మనవాళ్ళే ముస్లిం క్రైస్తవ మతాలలో చేరి పోతున్నారు. అందువల్ల ఈ మతాంతర వివాహాలు హిందూమతానికి గొడ్డలిపెట్టుగా సిద్ధమవుతున్నాయి.

పెండ్లికి ముందే హిందూ యువతీయువకుల్ని ఆయా మతాల్లోకి (ముస్లిం మతంలోకి, క్రైస్తవ మతంలోకి) మార్చివేసి, తరువాత పెండ్లి చేస్తున్నారు. మన హిందూ ప్రేమికులకు ముందు ఈ నిబంధన (condition) పెడతారు. ఈ కండిషన్‌కి ఒప్పుకుంటేనే పెండ్లి జరుగుతుంది; లేకపోతే జరగదు. మనవాళ్ళ పేర్లుకూడా మార్చివేస్తారు. ఇక వారికి పుట్టే సంతానం హిందువులుగా కాకుండా, ముస్లింలుగానూ లేదా క్రైస్తవులుగానూ చెలామణీ అవుతున్నారు. నా డెబ్బది ఏళ్ళ జీవితంలో ఎందరో నా మిత్రులు, బంధువులు ఇలా అన్యమతాలలోనికి మారిపోవడం నేను కళ్ళారా చూచాను. దీనికి సజీవమైన ఉదాహరణలెన్నో ఉన్నాయి.

"రామామృతం" అనే నా మిత్రుడు (ఇంగ్లీషు ప్రొఫెసర్) ఒక ముస్లిం అమ్మాయిని ప్రేమించి పెండ్లి చేసికొని "హసన్ మన్సూర్"గా మారిపోయాడు. "లక్ష్మి" అనే మా దగ్గరి బంధువుల అమ్మాయి ముస్లిం యువకుణ్ణి ప్రేమించి పెండ్లి చేసికొని "హసీనా"గా మారిపోయింది. (ఈ బ్రాహ్మణ యువతిచేత ఆ ముస్లింలు మాంసాహారం వండిస్తున్నారు, ఉర్దూ మాట్లాడిస్తున్నారు). "శ్రీరామమూర్తి" అనే మా అబ్బాయి ఒక క్రైస్తవ యువతిని ప్రేమించి పెండ్లి చేసికొని" అలెగ్జాండర్ ఫ్లెమింగ్"గా మారిపోయాడు. వాడి సంతానం క్రైస్తవులుగానే పెరుగుతున్నారు. ఇటీవల నా శిష్యుని కొడుకు కూడా ఇటువంటి "ఘనకార్యమే" చేశాడు. కొద్దినెలల క్రిందట "సీతాదేవి" (పేరుమార్చాను) అనే నా మిత్రుని ఒకే ఒక్క కూతురు, ఒక క్రైస్తవ యువకుణ్ణి ప్రేమించి పెండ్లి చేసికొని "మేరీ గ్రేస్"గా మారిపోయింది. ఇలా ఎన్ని ఉదాహరణలైనా ఇవ్వగలను.

ఈ మతాంతర వివాహాలలో హిందూ యువతీయువకులు ముస్లింలుగాను, క్రైస్తవులుగాను మారిపోవడం 99% జరుగుతోంది; అన్యమతస్తులు హిందువులుగా మారడం 1% మాత్రమే జరుగుతోంది. ఇది ఇలాగే కొనసాగితే, రాబోయే కాలంలో హిందువులు మైనారిటీలుగా మారిపోవడం ఖాయం. పైగా కుటుంబ నియంత్రణం హిందువులు మాత్రమే పాటించడం వల్లా, ముస్లింలు క్రైస్తవులు పాటించకపోవడం వల్లా, అందరికీ కలిపి Common Civil Code లేకపోవడంవల్లా, హిందువుల జనాభా తరిగిపోతోందనీ, ముస్లింల జనాభా పెరుగుతోందనీ, గణాంక శాస్త్రవేత్తలు ఈ మధ్య హెచ్చరించారు. ఈ హెచ్చరికను బట్టి కొందరు పండితులు (డా॥ ఎం. చిదానందమూర్తిగారి వంటి కన్నడ విద్వాంసులు) రాబోయే 200 సంవత్సరాలలో హిందువులు మైనారిటీలుగా అయిపోతారని సప్రమాణంగా నిరూపించారు. మన రాజకీయవేత్తలు మాత్రం ఓటుబ్యాంకు రాజకీయాలతో మెజారిటీ హిందువులను మోసగిస్తూనే ఉన్నారు.

అఖండ భారతదేశానికి వాయువ్యదిశలో ఉన్న సింధు, బెలూచిస్థాన్, పంజాబ్, రాజస్థాన్, కాశ్మీర్ రాష్ట్రాలలోను, ఈశాన్యదిశలో ఉన్న అఖండ వంగరాష్ట్రంలోను హిందువులను బలవంతంగా ముస్లింలుగా మార్చివేయడం వల్లనే 1947లో "పాకిస్థాన్" ఏర్పడింది. 1971లో పాకిస్థాన్ నుండి "బంగ్లాదేశ్" విడిపోవడానికి భారతదేశం (ఇందిరాగాంధి) సహాయం చేసింది. ఇప్పుడు ఆ యిద్దరూ కలిసి ఉగ్రవాదుల్ని తయారుచేసి, మనమీదికి ఉసిగొల్పుతున్నారు. వాళ్ళ దేశాలలో ఉగ్రవాదుల శిక్షణ శిబిరాలు నిర్వహిస్తున్నారు. ఇటీవల ముంబైలో తాజ్‌హోటల్ మీద, ఇతర ప్రదేశాలమీద ఒక యుద్ధం తరహాలో దాడి చేశారు పాకిస్థాన్ ప్రేరేపిత ఉగ్రవాదులు. భారతదేశం ఏమీ చేయలేకపోయింది. పాకిస్థాన్‌లో ఉన్న ఉగ్రవాద శిక్షణ శిబిరాలను నాశనం చేయలేకపోయింది. పైగా ఆ పనిచేస్తున్న ఇజ్రాయిల్‌ను విమర్శిస్తోంది మనదేశం. ("గాజా"లో ఉన్న "హమస్" అనే ఉగ్రవాద శిక్షణ శిబిరాలను ఇజ్రాయిల్ ధ్వంసం చేసి వేసింది. సుమారు 800 మందిని చంపి వేసింది. ఇటువంటి పని మనం చేస్తేనే కాని, పాకిస్థాన్ ఉగ్రవాదుల చేతుల్లో హిందువులు చనిపోడానికి అడ్డుకట్టపడదు). అయితే, అమెరికా ఇజ్రాయిల్‌ను సమర్థిస్తున్నట్లుగా భారతదేశాన్ని సమర్థించడం లేదు. పాకిస్థాన్‌కే వత్తాసు పలుకుతోంది. చైనా ఎప్పుడూ పాకిస్థాన్ పక్షమే. మన దేశం ఏకాకిగా మిగిలిపోయింది.

మతాంతర వివాహాలు, ముస్లిం ఉగ్రవాద సంస్థలు, పాకిస్థాన్, బంగ్లాదేశ్, క్రైస్తవ మిషనరీల మతమార్పిడులు హిందువుల సర్వనాశనానికి కృతనిశ్చయంతో కృషి

చేస్తున్నాయి. కాబట్టి హిందువులారా! బహుపరాక్! కులభేదాలు పాటించకుండా, మీరందరూ సంఘటితమై, మీ మతాన్ని సంరక్షించుకోవలసిన సమయం ఆసన్నమయింది. మన ఉదాశీనత వల్లే ముస్లింలు ఐదు శతాబ్దాలూ (క్రీ.శ. 1200 నుండి క్రీ.శ. 1700 వరకు); క్రైస్తవులు (ఇంగ్లీషువారు) రెండున్నర శతాబ్దాలూ (క్రీ.శ. 1700 నుండి క్రీ.శ. 1947 వరకు) మనలను అణగద్రొక్కి, బానిసలను చేసి పాలించారన్న సంగతి మరిచిపోకూడదు!

బెంగుళూరు

31-12-2008 - తంగిరాల



# ప్రగాఢ సంతాపం

(2008 జనవరి నుండి డిసెంబరు వరకు కొందరు కవులు, కవయిత్రులు, రచయితలు, రచయిత్రులు, శ్రీరస సభ్యులు, వేదాంతులు, సాహిత్య పోషకులు - స్వర్గస్థులయ్యారు. వారి కుటుంబసభ్యులకు మా ప్రగాఢ సంతాపాన్ని తెలియ జేస్తున్నాము ... సంపాదకుడు).

1. డా॥ వి. వై. వి. సోమయాజి (60), 23-1-2007, తణుకు (కవి, పండితుడు, పరిశోధకుడు, తంగిరాలవారి ప్రియశిష్యుడు).

2. డా॥ భార్గవి పి. రావు (64), 23-5-2008, హైదరాబాద్ (ప్రముఖ రచయిత్రి, కవయిత్రి, అనువాదకురాలు, ఆంగ్లాచార్యులు).

3. డా॥ నాగభైరవ కోటేశ్వరరావు (78), 14-6-2008, హైదరాబాద్ (ప్రసిద్ధ కవి, సినీరచయిత, తెలుగు ఉపన్యాసకుడు).

4. శ్రీ తాడిమేటి రాధాకృష్ణ (80), 13-8-2008, బెంగుళూరు (శ్రీరస సభ్యులు, ప్రముఖ పారిశ్రామికవేత్త, సాహిత్యపోషకులు).

5. పూజ్యశ్రీ గురూజీ విశ్వనాథ్ (58), 11-8-2008, బెంగుళూరు (ప్రసిద్ధ తత్వవేత్త, యోగిపుంగవుడు).

6. డా॥ గుండవరపు లక్ష్మీనారాయణ (68), గుంటూరు, (ప్రముఖ కవి, పరిశోధకుడు, తెలుగు ఆచార్యుడు)

7. శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి (71), 21-9-2008, మానస సరోవర యాత్రలో (ప్రముఖ రచయిత, సినీ రచయిత).

8. ఆచార్య పేర్వారం జగన్నాథం (74), 29-9-2008, వరంగల్లు (కవి, పరిశోధకుడు, తెలుగు ఆచార్యుడు, మాజీ ఉపకులపతి).

9. శ్రీమతి ఆదూరి సత్యవతీదేవి (60), 16-10-2008, విశాఖపట్టణం, (రచయిత్రి, కవయిత్రి).

10. శ్రీ కల్లూరు రాధాకృష్ణయ్య (90), 17-10-2008, కల్లూరు, అనంతపురం జిల్లా, (స్వాతంత్ర్య సమరయోధుడు, పారిశ్రామికవేత్త, సాహిత్యపోషకుడు).

11. "స్మైల్" (ఇస్మాయిల్) (65), 5-12-2008, రాజమండ్రి (ప్రసిద్ధ రచయిత)

12. "జ్వాలాముఖి" (ఆకారం వీరవల్లి రాఘవాచార్య), (71), 14-12-2008, హైదరాబాద్, (ప్రముఖ దిగంబరకవి, విప్లవకవి, ఫైర్‌బ్రాండ్ వక్త).

13. డా॥ ఎం.ఎల్. గురప్పచౌదరి (82), 26-12-2008, హోసూరు (తమిళనాడు), (సాహిత్యవేత్త, తమిళనాడులో తెలుగు భాషా సంస్కృతుల కోసం పోరాడిన యోధుడు).

14. శ్రీమతి గుత్తి సునీత (58), 28-12-2008, హైదరాబాద్, (సాహిత్యవేత్త, కవి అయిన శ్రీ గుత్తి జోళదరాశి చంద్రశేఖరరెడ్డిగారి ధర్మపత్ని).



# ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారి పరిచయం

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఉపాధ్యక్షులుగా 2001లో పదవీ విరమణ చేసిన కొలకలూరి ఇనాక్ 42 ఏళ్ళ పఠన పాఠన పరిశోధన పరిపాలనానుభవం పొందారు. 1939లో జన్మించిన డా॥ ఇనాక్ 1959లో లెక్చరరుగా ఉద్యోగ జీవితం ప్రారంభించి 1999 దాకా ప్రాచార్యులుగా ఉన్నారు.

గుంటూరు తాలుకా వేజండ్ల గ్రామంలో శ్రీమతి విశ్రాంతమ్మ, శ్రీ రామయ్య దంపతులకు జన్మించిన డా॥ ఇనాక్ వేజండ్ల ఎ.బి.యం. స్కూలులో, గుంటూరు

యు.యల్.సి.యం. తిరుపతి హైస్కూలులో, ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో చదివిన తరువాత, వాల్తేరు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి.ఏ. (ఆనర్స్), శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పిహెచ్.డి. చేశారు.

135 పరిశోధన పత్రాలు ప్రచురించిన వీరు 175 జాతీయ అంతర్జాతీయ సదస్సుల్లో పాల్గొని పత్రసమర్పణ చేశారు. ఎకడమిక్ స్టాఫ్ కళాశాలల్లో 108 ఉపన్యాసాలిచ్చారు. వీరి పర్యవేక్షణలో 24 పిహెచ్.డి. డిగ్రీలు, 18 యం.ఫిల్. డిగ్రీలు వచ్చాయి.

ఆశాజ్యోతి, షరామామూలే, కులం-ధనం, Voice of Silence, చెప్పులు, త్రిద్రవ పతాకం, కలల కార్ఖానా - కవితా సంపుటాలు; గులాబి నవ్వింది, భవాని, ఇదా జీవితం, ఊరబావి, సూర్యుడు తలెత్తాడు, అస్పృశ్య గంగ, సర్కారు గడ్డి, కొలుపులు, కట్టడి - కథాసంపుటాలు; సమత, అనాథ, సౌందర్యవతి, సౌభాగ్యవతి, ఇరులలో విరులు, ఎక్కడుంది ప్రశాంతి?, రెండు కళ్ళు-మూడు కాళ్ళు - నవలలు; మునివాహనుడు, కీ, జైహింద్, సాక్షి - నాటకాలు; దృష్టి, జ్యోతి, అభ్యుదయం, అమ్మ; నాటికల సంపుటాలు ప్రచురించారు.

ఊరబావి, మునివాహనుడు, ఆధునిక సాహిత్య విమర్శ సూత్రం-ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ - తెలుగు విశ్వవిద్యాలయం బహుమతులు పొందాయి. జైహింద్ (ఆంధ్రప్రదేశ్), దృష్టి (కేంద్ర), అనాథ (ఆంధ్రప్రభ) బహుమతులు పొందాయి. ఉత్తమ అధ్యాపకడుగా, జాతీయకవిగా రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాల గౌరవాలు పొందిన డా॥ ఇనాక్ అనేక సాహిత్య సంఘాల అవార్డులు అందుకొన్నారు. ఐదు విశ్వవిద్యాలయాలలో సిండికేట్‌ల, పదకొండు విశ్వవిద్యాలయాలలో తెలుగుబోర్డుల, ఆరు విశ్వవిద్యాలయాలలో ఎకడమిక్ సెనేటుల సభ్యులుగా పనిచేశారు. అనేక రచనలు పత్రికలలో ప్రచురించారు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు సలహాసంఘ సభ్యులుగా ఉన్నారు.

వీరు రాష్ట్ర సాహిత్య అకాడమీ సలహాసంఘ సభ్యులుగా, సాధారణ సంఘ సభ్యులుగా, కార్యవర్గ సభ్యులుగా కృషి చేశారు. పదిహేనేళ్ళు కేంద్ర సాహిత్య అకాడమీ సలహాసంఘం సభ్యులుగా, సాధారణ సంఘ సభ్యులుగా ఉన్నారు. యన్.బి.టి., యస్.బి.టి., సి.ఐ.ఐ.యల్. సభ్యులుగా సాహిత్యకృషి చేశారు. వీరు అంబేద్కరు విజ్ఞానపీఠం శాశ్వత అధ్యక్షులు. వీరి కథలు, కవితలు, మునివాహనుడు ఆంగ్ల, కన్నడ, తమిళ, హిందీ భాషలలోనికి అనువాదమయ్యాయి.

ఆచార్య కొలకలూరి ఇనాక్ సాహిత్యంమీద ఎనిమిది యం.ఫిల్., ఐదు పిహెచ్.డి డిగ్రీల కోసం – మానవతా, అభ్యుదయ, విప్లవ, దళిత, స్త్రీవాద సాహిత్య దృష్టితో పరిశోధనలు జరిగాయి.

వీరి శ్రీమతి భాగీరథి. వీరికిద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. డా. ఆశాజ్యోతి (బెంగుళూరు విశ్వవిద్యాలయం), డా. మధుజ్యోతి (తిరుపతి మహిళా విశ్వవిద్యాలయం),తెలుగులో రీడర్లు. వివాహితులైన నలుగురి భార్యాభర్తలూ ఉద్యోగులే! వీరికి నలుగురు మనవళ్ళు, నలుగురు మనుమరాళ్ళు. ఇప్పటికింత భాగ్యం!

* * *

# ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారి కవితలు

## 1. చెప్పులు

కొత్తలో తప్ప
అరవ్వు కరవ్వు.

అరిస్తే, నీళ్ళు పోస్తే
నోరు బంద్!

కరిస్తే, గూటంతో వేస్తే
కుక్కిన పేన్లు

మెదిలితే మొత్తు
కదిలితే ఒట్టు

అవి గుళ్ళోకి రావు
బళ్ళోకి పోవు

వాటికి, కూడు లేదు
గూడు లేదు

అవి, వాకిట్లో కుక్కలు
వీథిలో కాకులు

ఎండ కారం తిని
వాన గంజి తాగి
కాళ్ళకింద సదా చెప్పులు.

అవి తమను తన్నాయని
కసిగా పీకి పెడుతున్నాయి
ఊరకుక్కలు.

చరిత్ర, చెప్పులతో
చెంపలు వాయిస్తే
బిత్తర పోయి
నిద్దరపోయింది జాతి.

ఉన్నచోట ఉండనివీ
ఉన్నకాణ్ణుంచి కదలనివీ
చెప్పులు
దేవుళ్ళ తప్పులు! *(1966)*

## 2. రాత

నేలను నమ్ముకొని తలొంచుకు పోయే
దళితుడి కళ్ళలోకి చూచే అదృష్టం లేక
ఆకాశం, నిరాశాదగ్ధమవుతుంది.

ఇల్లు వాకిలీ లేని దళితుణ్ణి
ఎండవానల నుంచి గొడుగై కాపాడలేక
ఆకాశం, ఆత్మహత్యకు సిద్ధమవుతుంది.

వీడి అనాచ్ఛాదిత శిరశ్శరీర పాదాలకు
దుమ్మూధూళీ, రొచ్చూ రోతా, రాళ్ళూ ముళ్ళూ ఇస్తూ
భూమి, పిచ్చెక్కినట్లు కంపిస్తుంది.

ఇతడి పాదస్పర్శతో గింజ
పంటై ఇంటికి వచ్చినా
ఆకలిని వీడినుదట రాసిన భూమి
కృతజ్ఞత లేని, గుండెలేని బండవుతుంది.

ఏటా ఇతడి కొంపను, రోజూ శరీరాన్ని,
ప్రతిక్షణమూ కడుపును, కాలుస్తున్న అగ్ని
ఆరని మంటై అలముటిస్తుంది.

ఇతడి పొలానికి అందక, ఇంటికి లేక
కడుపుకు దొరక్క, పారిపోయే నీరు
పాతాళంలో ఇంకుతూ కుములుతుంది.

ఇతడి ఆశాంకురాలను పురుటి పాదులోనుంచి
కష్టాల కడలిని కళ్ళకు కట్టి పరారయ్యే
నీరు, ఎడారి ఎండమావై ఏడుస్తుంది.

ఊపిరి పోయాక ఉసురు పోసుకొనే
దిక్కు తెలియక పిచ్చెక్కి తిరిగే
గాలి, ఆశాపాశ శూన్యమై అల్లాడుతుంది.

ఇతడి త్యాగం చిట్టా కెక్కించక
అస్పృశ్యుణ్ణి చేసి అనాదరించే స్వర్గం
అమృతం పోగొట్టుకున్న అంధకారమవుతుంది.

పుడమిగా సృష్టించే, సౌందర్యంగా పరిమళించే
చైతన్యంగా తరంగించే, దళితుడికి
పుట్టేయోగం, బ్రతికే భాగ్యం, చచ్చే సౌఖ్యం రద్దుచేసే
త్రిమూర్తుల నుదుటి రాతకు తిక్కపుడుతుంది.

భూమి పుత్రుడై పుట్టి, నింగి మిత్రుడై నిలచి,
పాతాళగంగకు అపర భగీరథుడై వెలిగి,
నిప్పును అగ్గిపెట్టెలో, గాలిని గుండె గూటిలో
దాచిపెట్టిన దళితుడి ముఖ సౌందర్యం చూడలేక
బ్రహ్మ, ఘంటం మంటల్లోకి విసురుతాడు.

*(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కవి సమ్మేళనం 1992)*

* * *

## 3. చెరువుగట్టూ – రావిచెట్టూ

గాలి రావిచెట్టు ఆకులతో
ఊసులు చెబుతుంటే
చెరువు అలల తలలు ఆడిస్తూ
ఆలకిస్తూ ఉంటుంది.

రావి ఆకు పడవ
చీమయాత్రికుణ్ణి
ఆవలితీరం చేరుస్తుంది.

రావిచెట్టు తన అందాలు
చెరువు అద్దంలో చూచుకొని
ఆకుపచ్చ పొదరు
ముఖానికి అద్దుకొంటుంది.

తొంగిచూచే చంద్రుడి మీదికి
చెరువు, అలల
టార్చిలైట్లు వేస్తుంది.

రావిచెట్టు గాలి, నీళ్ళలో ఈది
దిసెమొలతో ఊళ్ళోకి పరుగెత్తుతుంది.

చెరువు నీళ్ళదోసిళ్ళతో
చెట్టు కాళ్ళనూ వేళ్ళను కడుగుతుంటుంది.
పరవశంలో చెట్టు ఆకులురాల్చి
చెరువును దీవిస్తూ ఉంటుంది. *(2007)*

* * *

## 4. అనంత ఆకాశం

పల్లె, పొట్ట చేతపట్టుకొని పట్టణంలో
మానం వేలంపాటలో పెట్టింది

పల్లెలో ఆ యిల్లు మూడేళ్ళనుంచి
తలస్నానం చేయలేదు

పొలంలో గడ్డిపరక కూడా మొలవక
ఆకాశం నేలకు దిగివచ్చింది

బేంకువాళ్ళు ఎడ్లూ బండీ తోలుకుపోయి
రోడ్డుమీద వ్యవసాయం మొదలుపెట్టారు

వడ్డీవ్యాపారి ఖాళీచేయించిన ఇల్లు
సాలెగూళ్ళకు అద్దెకిచ్చాడు

పెళ్ళికాని ఈడేరిన పైటకు పడ్డ మాసికలు
చెట్టును ఖైదీని చేశాయి.

భార్య నెత్తిమీద కడవల కన్నీలు
కళ్ళలో మొలిచి మొగ్గ తొడుగుతున్నాయి

మంచమెక్కిన ముసలితల్లి
గాలికి ఉపిరి దానం చేసింది

భూమి ఎడారిలా ఇసుక పంటలో
ఒయాసిస్సుల్ని నూర్పిడి చేస్తూ ఉంది

విషం కొనటానికి ప్రాణం ఆయకం పెట్టినా
అప్పిచ్చే కుబేరుడు పత్తాలేడు.

ఏడ్చిన రైతు కళ్ళు
నీరింకిన బోరుల్లా
రాళ్ళెండిన బావుల్లా
కలలు బీటవారిన భూముల్లా,
కాలి బూడిదైన మబ్బుల్లా
ఎడారైన ఆకాశంలా
అనంతపురంలో రాని వానల్లా .... *(2004)*

* * *

## 5. కలల కార్ఖానా

కదలితి భావ వీచికల కాంచన కాంతుల పుష్ప వాటిలో
ముదముదయింప నవ్వు నవ మోహన కోమల ముగ్ధమూర్తి నె
మ్మది యువజీవికాశల ప్రమాంజలి మెల్లగ పూలుచేర, నా
హృదయము మండిపోయి నుసియే మిగిలెన్ భయభీతి వీథిలోన్.

నడచితి పూలమాలికల నవ్వులు నూగెడు కొమ్మకొమ్మకున్
విడువని దీక్షతోడ కనుపించితి తుమ్మెదవోలె నంతలో
గడగడలాడిపోతి సుడిగాడ్పుల గర్జన సాగివచ్చి పై
బడు వడగాలి మంటలు విపత్తులు మాడ్చె వనమ్ము నంతటిన్.

కడలి గొంతుకలోన ముడిబడ్డ భావాలు
తీరాల దరి చూప కోరి కోరి
సెలయేటి రొదలలో చెరజెందు గీతాలు
ఇసుకపత్రిక నిల్ప కొసరి కొసరి
తొలిసంజ వెలుగులో మెలిబడ్డ సత్యాలు
పొలిమేల ప్రకటింప వలచి వలచి
నిశిపైట చెరగులో నెలపైన దివిటీలు
తారదివ్వెల చేర్ప తలచి తలచి

క్రొత్త భావిలో క్రొంగొత్త కూర్పనెంచి
వేగ మేఘాల మార్గాల సాగి సాగి
నడతు మునుముందు వెనువెంట నడచి నడచి
ఆగితిని ఏడ్పుతో కాళ్ళు సాగలేదు.

నేడు మహోదయమ్ము, నవనీత నవాశ నవోదయమ్ము, ఈ
నాడు మదీయ భావి నవనాడుల నాట్య విలోల గీతికల్
పాడె, విపంచికారవళి పర్వె, వినూతన విశ్వవీథిలో
వేడెద తెల్లతెల్ల తొలివేకువ జాగృతి వెల్గు వెల్లువల్.

తొలగె తమస్సమూహములు, తొట్రిలు తొందర నాట్యభంగిమల్
కిలకిల నవ్వె, మాధురుల కీర్తి సముజ్జ్వల దేవలోకముల్
తలుపులు తీసిపైచినది తన్మయ మంజులచిత్త, దేవి న
వ్వుల వెలుగొందె భావ పరిపూర్ణ మనీషి మనస్సుమాంజలుల్

వెలుగుల రాజు నవ్వు నులివెచ్చని వేడి వెలార్పులోన వియ
త్తుల ధునిలో శుభోదయ సుదర్శన వీచులు పొంగె, నేడు మే
ల్కొలుపు జిగీష మానస విలోకనలోచన లోల నిష్కకున్
లలిత విలాస భావముల లాస్య సుపర్వ సుఖాల శోభలన్. *(1961)*



# కీ.శే. ఆర్. యస్. సుదర్శనంగారు

## జీవితము - సాహిత్యము (1927 - 2001)

**జననం** : 13-12-1927 మదనపల్లిలో (శ్రీ జిడ్డుకృష్ణమూర్తిగారు జన్మించిన స్థలానికి ఫర్లాంగ్ దూరంలో)

**విద్యాభ్యాసం:** మదనపల్లి జిల్లాపరిషత్ హైస్కూలు, మదనపల్లె దివ్యజ్ఞాన కళాశాల, మద్రాస్ క్రైస్తవ కళాశాల.

**1947** : మద్రాస్ క్రైస్తవ కళాశాలలో ఇంగ్లీష్ ట్యూటర్.

**1947-48** : మచిలీపట్నం హిందూకాలేజిలో ఇంగ్లీషు లెక్చరర్.

**1948-49** : మదనపల్లె బెసెంట్ థియోసాఫికల్ కాలేజిలో లెక్చరర్.

**1949-66** : ఇంగ్లీషు లెక్చరర్, హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్‌గా అనంతపురం, వరంగల్, నల్గొండ, చిత్తూరు గవర్నమెంట్ డిగ్రీ కాలేజీలలో

**1967-71** : నెల్లూరుజిల్లా విడవలూరులో డిగ్రీ కాలేజి ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారికి జ్ఞానపీఠ్ అవార్డ్ వచ్చిన సందర్భంగా వారిని విడవలూరికి ఆహ్వానించి, వారి చిత్రపటం బహూకరించారు. ఆరుద్ర, పిలకా గణపతిశాస్త్రి, మహీధర రామ మోహన్‌రావు వంటి ప్రముఖ సాహిత్యకారులను అక్కడి కాలేజికి రప్పించి, ఆ వూరిలో ఒక సాంస్కృతిక వాతావరణం నెలకొల్పారు. "ఇది మా వూరికి స్వర్ణయుగం" అని ఆ ఊరి పెద్దలు అభివర్ణించడం జరిగింది.

**1971-73** : చిత్తూరులో గవర్నమెంట్ కాలేజి ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. అప్పుడు శ్రీ కొడవంటిగంటి కుటుంబరావుగారి వంటి ప్రముఖ వ్యక్తులు అక్కడి కాలేజికి విచ్చేశారు.

**1974-77** : అనంతపురం డిగ్రీకాలేజికి ప్రిన్సిపాల్‌గా ఉన్నారు. గుంటూరు శేషేంద్రశర్మ, ఆరుద్ర, పిలకా గణపతిశాస్త్రి, మహీధర రామ్మోహన రావు, గజ్జెల మల్లారెడ్డి వంటి ప్రముఖులను, కాలేజి పూర్వవిద్యార్థి శ్రీ నీలం సంజీవరెడ్డిగారిని, కాలేజి విద్యార్థుల మీటింగ్స్‌కి ఆహ్వానించారు.

**1978-85 :** రాజమండ్రి ఆర్ట్స్ కాలేజి ప్రిన్సిపాల్‌గాను, రీజనల్ జాయింట్ డైరెక్టర్ ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్ గాను పనిచేసి రిటైర్ అయ్యారు. రాజకీయేతర విలువలను విద్యార్థుల జీవితాల్లోకి పొందుపరచి, వారి వ్యక్తిత్వ వికాసమునకు దోహదం చెయ్యాలన్న లక్ష్యంతో వ్యవహరించారు. 1986లో ఇది "నా తుది మజిలీ" అని స్వయంగా చెప్పుకుని, సొంతవూరైన మదనపల్లెలో, వందేళ్ళనాటి స్వగృహంలో శేషజీవితం గడిపి, 2001 డిసెంబర్ 14న కన్నుమూశారు.

**రచనల వివరాలు:**

| | | |
|---|---|---|
| 1. | అనుబంధాలు (నవల) | 1958 (ఆదర్శ గ్రంథమండలి ప్రచురణ) |
| 2. | మళ్ళీ వసంతం (నవల) | 1960 అక్టోబర్, పునర్ముద్రణ ఆగస్ట్ 86లో |
| 3. | కాలం తెచ్చిన మార్పు (కథలు) | 1963 (ఎమెస్కో ప్రచురణ) |
| 4. | అసుర సంధ్య (నవల) | 1966 మే (ఆదర్శ గ్రంథమండలి) |
| 5. | సాహిత్యంలో దృక్పథాలు | 1968, పరిష్కృతం, పునర్ముద్రణ 1982 (సాహిత్య విమర్శ) |
| 6. | నిశాంతం (కవితలు) | 1970 (శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారిచే ప్రచురితం); 1975 (శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారిచే ప్రచురితం); 1994 (పునర్ముద్రణ). |
| 7. | సమాజము-సాహిత్యము(వ్యాసములు) | 1972 అక్టోబర్ (చిత్తూరు జిల్లా రచయితల సంఘం) |
| 8. | సంసార వృక్షం (నవల) | 1976 (ఎమెస్కో) |
| 9. | మధుర మీనాక్షి (కథలు) | 1981 |
| 10. | సాహిత్య నేపథ్యం (వ్యాసావళి) | 1983 జనవరి, రివైజ్డ్ రీప్రింట్ 1989 |
| 11. | నూరు సమీక్షలు(పుస్తక సమీక్షలు) | 1987 జనవరి |
| 12. | గుడిపాటి వెంకటచలం(మోనోగ్రాఫ్) | 2000 (కేంద్ర సాహిత్య అకాడమీ) (NBT వారి MIL సిరీస్) |

13. సంసార వృక్షం నవల కొన్ని కథలు "The Tree of Life and Short Stories" గా ఇంగ్లీషులో వచ్చింది. 2002 (Atlantic Publishers and Distributors).

14. కవి హృదయం (వ్యాసాలు) 1988 (షష్టిపూర్తి ప్రచురణ)

**సంసారవృక్షం : నవల ఇతర భాషల్లో**

హిందీలో : "మన్ కె బంధన్"– అప్పలరాజుగారు (ఆంధ్రా యూనివర్సిటీ)

గుజరాతీలో : "వంశవృక్ష" – నవనీత్ మద్రాసీ

ఇంగ్లీషులో : "The Tree of Life" – రచయిత

**అనువాదాలు:**

నేషనల్ బుక్ ట్రస్ట్, సాహిత్య అకాడమీల కోసం గోపబంధుదాస్, లక్ష్మీకాంత బెజ్జిరోవాల Monographs తెలుగులోకి, చలం మోనోగ్రాఫ్ ఇంగ్లీషులోకి చేశారు. సి.ఆర్.రెడ్డి సెంటీనరీ కొరకు వారి పీఠికలు, ఉపన్యాసాలు ఇంగ్లీషులోకి చేసి యిచ్చారు.

కేంద్ర సాహిత్య అకాడమీ, నేషనల్ బుక్‌ట్రస్ట్ ఇండియా, తెలుగు విశ్వవిద్యాలయం వారల సలహాసంఘాల్లో సభ్యులుగా పనిచేశారు. నేషనల్ రైటర్స్ క్యాంప్ – న్యూఢిల్లీలో 1972, నేషనల్ సాహిత్య సెమినార్ – కొచ్చిన్ 1994 లోను మరెన్నో సెమినార్లలో పాల్గొన్నారు.

సుదర్శనం గారు 1960ల నుండీ 90ల వరకు భారతి, ఆంధ్రప్రభ వీక్లీ వంటి వివిధ పత్రికలకు వ్రాసిన పుస్తక సమీక్షలు సాహిత్య లోకంలో ఉన్నత స్థాయికి చెందినట్లుగా గుర్తింపు పొందాయి. ఎందరో రచయితల పుస్తకాలకు ముందుమాటలు, పీఠికలు వ్రాశారు. కొందరికవితలు, కథలు ఇంగ్లీషులోకి తర్జుమా చేసి యిచ్చారు. సి.ఆర్.రెడ్డిగారి సెంటినరీ సందర్భంగా వచ్చిన పుస్తకాల కొరకు వారి పీఠికలు, వ్యాసాలు కొన్ని ఇంగ్లీషులోకి తర్జుమా చేసి యిచ్చారు. "ఆయన తెలుగు సాహిత్య పరిశీలనకు ఒక తాత్విక భూమికను ఏర్పరచినందువలననే ఈనాడు మన రచయితలు, మన కవులూ మనకి మరింతగా అర్థం కాగలుగుతున్నారు" – అన్న చినవీరభద్రుడి అభిప్రాయం సాహితీలోకం గుర్తించిన విషయమే.

పత్రికలు, రేడియో కేంద్రాలు, సాహితీపరుల Questionnaires లలో వారి అభిప్రాయాలు పలు సందర్భాల్లో విశదీకరించబడ్డాయి. విజయవాడ శారదా కళాశాల దశాబ్ది సంచికలోనూ, మే 1991 శ్రీవాణి పత్రికలోనూ ప్రచురించిన వేమన - అద్వైతం అన్న వ్యాసం విజ్ఞుల మెప్పుపొందినది. "Concept of Freedom in Telugu Romantic Poetry" అన్న వ్యాసం తెలుగు యూనివర్సిటీ 1989 ఎండోమెంట్ లెక్చర్ విలువైనదిగా గుర్తింపబడినది. “మీ ఆలోచనల పరిపక్వత కన్పిస్తున్నది” అని శ్రీ మహీధరవారు; “భావకవిత్వం గురించి ఇంత విశ్లేషణాత్మకమైన వ్యాసం ఇంతవరకూ నేను చదవలేదు” అని శ్రీ ఇస్మాయిల్ గారూ (Private Letters in December 1989) అన్నారు. The Hindu 14-4-1998 పత్రికలో వచ్చిన Knowledge, Tradition and Experience పలువురి ఆలోచనలను ఉత్తేజపరచినట్టి వ్యాసం. ఆంధ్ర సచిత్ర వారపత్రిక వజ్రోత్సవ సంచికకు వ్రాసిన “చలం స్మృతి” (16-9-1983) చక్కని జ్ఞాపిక.

వారి చిన్ననాటి మిత్రుడు కె.జి. సోమసుందరం, హైదరాబాద్ వారి లేఖ ప్రకారం, సుదర్శనంగారి తాత్త్విక జిజ్ఞాస, స్కూల్లో చదువుతున్న నాటి నుండే ప్రస్ఫుటంగా వున్నట్లు తెలుస్తున్నది. అది జీవితాంతం వరకూ కొనసాగింది. శ్రీ తల్లావఝుల పతంజలిశాస్త్రి గారన్నట్లు వారి జీవితాన్ని, సాహిత్యాన్ని ఒకటిగానే చూడవచ్చు.

**అవార్డులు:**

| | | |
|---|---|---|
| రోటరీ క్లబ్, అనంతపురం | - | 1975 |
| రోటరీ క్లబ్, రాజమండ్రి | - | 1977 |
| Best Teacher Award for College Teachers | - | 1980 |
| A.P. సాహిత్య అకాడమి వార్షిక బహూకృతులు సమాజము - సాహిత్యము (సాహిత్య విమర్శకు) | - | 1975 |
| సంసారవృక్షం నవలకు | - | 1977 |
| నూతలపాటి గంగాధరం సంస్కృతి బహూకృతి సంసారవృక్షం నవలకు | - | 1977 |

మధుర మీనాక్షి కథలకు - 1984

హితకారిణీ సమాజము సత్కారము, రాజమండ్రి - 1984

సుదర్శనంగారి జీవితగమనానికి యిది రేఖాచిత్రణ మాత్రమే. ఆఖరున శ్రీ వాకాటి పాండురంగారావు గారి "Our Tomorrow Preface" నుండి "The tallest of writer intellectuals in A.P. today is R.S. Sudarshanam. Castaneda, Ramana Maharshi, Dadaji, Lawrence Leshan were all his gifts to me.. To me he is a philosopher and a guide".



# డా॥ మల్లెల గురవయ్య కవితలు

## 1. ఓ సర్వధారి వత్సరమా!

1. ఓ సర్వధారి వత్సరమా! సాదరమ్మైన స్వాగతాంజలియిదె మ
మ్మా సోముఁడేలుఁగావుత నీ సౌమ్యగుణమ్ము మమ్ము నెయ్యమ్ముఁగనన్॥

2. అహో! సర్వధారీ! మహోపర్వకారీ!
నిహారమ్ముఁ గల్గించు స్నిగ్ధుండు రాజై
వహించెఁ బ్రభుత్వమ్ము వర్తిల్లు మేలై
నిహారమ్ములో హ్రాదినీ ధార వాదో!॥

3. సర్వధారలు కల్గు వర్షమ్ము నేడు
కేవలము వర్షధారల తావలమ్ము
కాదు కాదు సేనాగ్రభాగమ్మొ, అశ్వ
గతియొ, కత్తి పదునొ, ఋణగ్రస్త గతియొ॥

4. అంతయు క్రంతలైనయది ఆపయి నప్పులో అన్నిధార లా
వంతయు జీవనమ్ము గడవంగల తీరిక తోఁచదాయె దు
ర్ధాంతము దీని యంతమున రాఁగల వర్షమదే విరోధి దృ
ష్టాంతము నాందిరూపమిచటఁ గననయ్యెను సర్వధారిగఁ॥

---

*నిహారము=మంచు; హ్రాదిని=వజ్రాయుధము; దుర్ధాంతము=అణవబడనిది*

5. వచ్చిరాక మునుపె వాతూలముల్ రేగి, పిచ్చియెత్తినట్లు పిడుగుల వడ
గండ్ల కడగండ్లు కురిపించి కష్టములకు నాంది పల్కిన సర్వధారిం దలంతు ॥

6. పేరును బట్టి తీరనుచు పెద్దలు పల్కెడి మాటలో సమా
చారము మంచి చెడ్డల ప్రచారము సారము నిండియుండు సం
సారము సాగు వర్షములు; జన్మలు నిట్టులె వచ్చిపోవు; సం
స్కారమె మూలమన్నిటికి; సాధన ముఖ్యము సర్వ ముక్తికిన్ ॥

7. ఎన్నిమార్లీవు వచ్చి పోయితివొ యెఱుగ
మిపుడు సోమాధిపతివిగా నేగుదెంచి
తెంత శైత్యమో పాలనం; బెక్కువైన
అగ్నిసంస్కారమే తుది హద్దు సుమ్మి!॥

8. ఓ సర్వధారి వత్సరమా! సాదరలీల స్వాగతాంజలి కొనుమా!
ఈ సోముడు రాజై బహుధా సుఖముల నేలునట్టి దారి నడపుమా!

* * *

## 2. దుగ్గిరాల కవిత

1. హృద్యపద్యవిద్య కెవ్వరు నీ సాటి
రారు దుగ్గిరాల రామరావు!
దుగ్గి యొసగె రాలు తులలేని పద్యర
త్నాలు వాసికెక్క త్వత్కులమ్ము॥

2. ప్రతిపద్యం బతిహృద్యం
బతులిత మాహైత్మ్యవేద్య మనితర సాధ్య
ప్రతిపాద్య మట్టి మీకుఁ
ప్రతిలేరిల దుగ్గిరాల రామారావూ! ॥

3. అన్న తన కృతి ముత్యాలహారమందు
వారి లోకానుభవముతోపాటు ధర్మ

పత్నియగు కృష్ణవేణిపై పాదుకొన్న
ప్రీతి, ఆమె ఆదుకొనిన రీతి చాటె॥

4. ప్రతి శీర్షిక ముకురమునఁ
బ్రతిబింబ ప్రాయమట్లు ప్రకటితమై సం
ఘ తిరోగమనమ్మునకుఁ
బ్రతీయమానమ్ము లగుచుఁ బ్రతిభ వెలార్చెన్ ॥

5. భావము లద్వితీయములు భాషయు వానికి దీటుకల్గి శో
భావహమై మరందములు బంధుర లీల స్రవించి మాధురీ
శ్రీవిభవమ్ము చాటు నిది శేముషియో! కృషియో! ఋషిత్వమో!
ఈవిల పద్యవిద్య వెలయింపగ వచ్చితి, నిక్కమెక్కటిన్! ॥



## వందనమో సర్వధారి!

– అత్తిలి వేంకటరమణ

స్వస్తిశ్రీ చాంద్రమాన సర్వధారి చైత్రశుద్ధ
ప్రతిప దిందువాసరాన, బందరు పురమందిరాన
వత్సరాది మధువేళన్ వచ్చిన ఓ విజ్ఞులార!
సుకవితా రసజ్ఞులార!
సురభిళహృచ్చందనములు శుభాకాంక్ష లందికొనుడు,
అభివాదము లందికొనుడు, అభినందన లందికొనుడు! 1

సర్వనామ రూప సచ్చిదానందుడు,
సూత్ర వేత్ర పాత్ర గాత్ర ధరుడు,
సర్వధారి యొకడె షష్టి వత్సర మూర్తి
అణువులందు అణువు, ఘనుల ఘనుడు! 2

సాక్షి, దైవము, పరమాత్మ, సత్యజయుడు,
బ్రహ్మమున్, భగవంతుడు, ప్రభువు, విభుడు,

కాలకాలుండునున్, మహాకాలమూర్తి,
సకల దేశ కాలాత్మక శాశ్వతుండు. 3

తెలుగు వారికి నూత్న వత్సరముగాగ
వచ్చె శ్రీ సర్వధారి, కృపాభరితుడు,
సర్వధారియౌ వ్యక్తియే సర్వధారి
యైన శక్తిని దనియించి హర్షమందు. 4

రాజట రాజు, మంత్రి గ్రహరాజట, మేలును గీడు గూర్చుచున్
రాజిలు సర్వధారి యవురా తెలుగిండ్ల పదంబువెట్టె, ఉ
ద్వేజిత చిత్తవృత్తులయి, ప్రీత మనస్కులు, స్వాగతోక్తులన్
పూజలొనర్చి మ్రొక్కెదరు పూర్ణహృదంబుజులైన యాంధ్రులున్. 5

వెలుగు నీడల విడదీయ వలను పడదు
వెలుగులన్ నీడ లెల్లప్పు వెంబడించు,
వేవెలుగు నడిమింటిలో వెలిగెనేని
పాదవు గోల్పోయి నీడ లోపడును గాదె! 6

షడ్రుచుల వేపపచ్చడి సౌమ్యమగుచు
సుఖము, దుఃఖము బ్రదుకులో చొప్పడుగద,
ఇంద్రధనువు హొరంగులే యింపు, సొంపు
నవరసాన్వితమౌ జీవనము పసందు! 7

బ్రతుక వచ్చును బలుసాకు మెతుకు మెసవి
బ్రతికి యుండిన శుభముల బడయవచ్చు
బ్రతుకు దైవకటాక్షము, పొరులెల్ల
క్షాంతి వహియింప బ్రోవుమా సర్వధారి! 8

ఇందిరమ్మ గృహంబు లెనుబది లక్షలు,
రేషను కార్డులు రెండు కోట్లు,
శ్యామల సస్యద జలయజ్ఞ సంరంభ
చకితాక్షులైన బంజరుబయళ్ళు,

పావాల వడ్డికి బ్యాంక్ ఋణాల్ పొంది
తుష్టిని గాంచు రైతులు, మహిళలు
వృద్ధ లనాథుల పింఛను లరువది
లక్షలై, మలి సంజ రమ్యత గొన

బ్రతుకు నిలబెట్టు సంక్షేమ పథకములకు
బ్రతుకు నిర్మించు అభివృద్ధి పద్ధతులకు
సముచితంబౌ ప్రణాళిక సంఘటించి
వర్ధి (ర్ధి)లగ జేయు ప్రభుతయే ప్రభుతయనగ. 9

కీచులాటలును దోబూచి దొంగాటలు,
అవినీతిభూత మహోట్టహాస
కహకహ ధ్వనులును కనరాని, వినరాని
జనవాక్య కర్తవ్య ఘనత మెఱయు
సుపరిపాలన వంక సూటిగా గమియింప
శక్తి నొసంగుమా సర్వధారి!
స్వార్థమ్ము విడి, పరమార్థమ్ము గొను తెల్వి
జాల్వార జేయుమా సర్వధారి!
ఎల్ల లోకంబు నొక్కటే యిల్లు జేసె
సరభసంబున శాస్త్ర విజ్ఞానగరిమ
ఇంత తెలిసియు నరుడు తన్నెఱుగలేడు
ఖర్వమగుత మాగర్వము సర్వధారి! 10

ప్రాచీన భాషగా వాసిగాంచిన తెల్గు
బహుఖండముల వినబడునుగాక!
అన్నదమ్ముల నెలకొన్న యపోహలు
విడిపోయి కూరిమి పెంపుగనుత!
బాటతప్పిన దగాపడిన కుఱ్ఱలు మంచి
త్రోవలో మేలు పొందుదురు గాక!
వివిధ రంగంబులన్ విశ్వవిఖ్యాతులై
తెలుగు బిడ్డల కీర్తి తేజరిలుత!

స్వస్తి ప్రజలకు, న్యాయ్యసత్ పథమునందు
పాలన మొనర్చి రక్షించు ప్రభువులకును,
జనులలో సాధుభావ ముజ్జ్వలత గొనుత!
సకల లోకమ్ములకు సుఖశాంతులగుత! 11

వందనము, సర్వధారీ
వందనమో సర్వధారి! వందనమయ్యా!
కుందేందు ధవళ సుందర
మందార మనోజ్ఞ కీర్తి! మన్నింపుమయా! 12

సర్వస్థిత! సర్వాతిగ!
సర్వాత్మక! సర్వధారి! సర్వాధారా!
నిర్వేల కృపాశరధీ!
సర్వులలో ధర్మదీక్ష సంధింపుమయా! 13

*(తెలుగు ఉగాదికి మచిలీ పట్టణములో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార శాఖ*
*కృష్ణాజిల్లా సాంస్కృతిక మండలి ఆధ్వర్యమున జరిగిన*
*కవి సమ్మేళనములో చదివిన పద్యములు 7-4-2008.)*



# స్వాగతము సర్వధారికి!

– డా॥ కాసల నాగభూషణం

ఓ సర్వజిత్తు గారూ!
వేసము తొలగించి మీరు వేంచేయుడికన్
మా సర్వధారి ఇదిగో
ఆశలు చివురింప మదిని అరుదెంచు నిటన్ 1

గడచిన వత్సరమ్మున ఉగాదిని నీవిటు వచ్చువేళ ఈ
పుడమి వసంతయోగమున పొల్పు వహించుచు ఆకుపచ్చలన్

తొడవుల దాల్చి లేజివురు తోరణ వీథుల గండుకోయిలల్
తొడగు కుహూ కుహూ రవముతో వినిపించెను స్వాగతోక్తులన్ 2

జిత్తను మాట జూచి జగజెట్టివటంచును, దుష్టచిత్తులన్
చిత్తుగ మొత్తుచున్ సుగుణ చిత్తుల బ్రోతువటంచు నెంచి మే
మత్తరి సంతసించితిమి, ఐనను ఎత్తులకెత్తులెత్తుచున్
జిత్తులమారివై ఇటుల జేతువటంచు తలంప సుంతయున్ 3

చెలిమి చెలిమి యంచు చిలుక పల్కులు పల్కి
చివరికి ద్రోహమ్ము చేయుటయును
తలపున నొకటి చేష్టలలోన నొకటిగా
ద్వివిధ ప్రవృత్తి వర్తిల్లుటయును
లోలోన దురిత దుర్లోభమ్ములను దాచి
మంచిగా పైకి నటించుటయును
తెలిసిన దేమిటో తెలుపకే ఎదుటికి
ఏమి రాదని వెక్కిరించుటయును

అస్మదీయులె అన్నింటి కర్హులనుచు
గుట్టుగా పదవుల నంటగట్టుటయును
మన సమాజమ్ము సర్వమ్ము మాయ యనుచు
కుటిల వేదాంత మొకటి వాక్రుచ్చుటయును 4

కనుగొన నిట్టి దుర్గుణ నికాయములన్నియు మానవాళి చిం
తనమున వచ్చు మార్పునకుదాహృతులాయెను; రోజువారి జీ
వనమును రాజకీయ పరివర్తితమాయెను; సత్య ధర్మ వ
ర్తనమది మృగ్యమయ్యె నవురా! ఇది యంతయు నీ ప్రభావమే! 5

అని ఒక క్షణమున నేదో
అనిపించుట నిజము గాని ఆ మరుక్షణమే
తన లోపమేమి లేదని
'మనమే కారణ'మటంచు మదిలో తోచున్ 6

సర్వజిత్తన అది శుద్ధ సంస్కృతమ్ము
తెనుగు జిత్తుగ నిన్ను మార్చినది మేము
మధుర రసభావ రమణీయ మానవీయ
కృతికి - ప్రకృతికి కూడ - వికృతుల మేము! 7

పాపము పుణ్యముల్ నరక స్వర్గములన్నవి లేవుగాన నే
నే పనినైన చేయ నిదియేమని ఎవ్వరనంగలేరటం
చీ పలుగాకి చర్యలకు నింతగ పాల్పడు మానవుండు తా
నే పరిణామ హేతువని యెంచిన - మారిన - మారు కాలమున్! 8

అపుడీ వచ్చు ఉగాదులన్నియును వర్షారంభ రాగోల్లస
ద్విపులారామ సుఖోపవిష్ట పరభృద్గీతీ విశేషాదులై
తపనీయోరుతరాధ్య కానన హరిద్రావర్ణ చిత్రాదులై
నెపమున్ మాటకు తావులేక ప్రజకందించున్ ప్రమోదమ్ములన్! 9

కావున సర్వధారి! మరి కాలము మార్చిన క్రొత్త పేరుతో
నీవిటు రాగదే! ముదము నిండిన హృత్పుటమందు షడ్రుచుల్
జీవితమున్ ధ్వనించుగతి జేరిచి ఈగదె! నీదు యోధులై
మావిడి వేప చింతలును మాకిట చల్లని కాపు కాయగన్! 10

స్వాగతమ్మోయి! రావోయి! సర్వధారి!
సర్వ సర్వంసహా శ్వేత ఛత్రధారి!
నవనవోన్మేష కావ్య నందన విహారి!
రమ్ము మాతోడ నీడగా బ్రతుకు దారి! 11

మంగళాశాసనమ్:

ఆది మధ్యాంత మంగళాహ్లాది యైన
కావ్యమును తలపించు ఉగాది పేర
తెలుగు తోటల కవి కోకిలలను పిలచి
గౌరవించిన తెలుగు వికాస సమితి
చల్లగా తల్లివలెను వర్ధిల్లుగాక! 12



# నా ముద్దబంతి పువ్వు

– తంగిరాల

*(గత సంచిక తరువాయి)*

## 7

మన శాస్త్రాలు సంప్రదాయాలు
స్త్రీల జీవితాలకు నిలువునా వేశాయి శిలువలు –
ఊపిరి సలుపకుండా ఒళ్ళంతా చుట్టుకున్నాయి
పలు నియమాల కొండచిలువలు:
"అతివలు అణిగిమణిగి ఉండాలి
పతి సేవలో పవిత్రులు కావాలి
సీతా సావిత్రులే ఆదర్శంగా బ్రతకాలి
సర్వకాల సర్వావస్థలలోనూ
మొగుణ్ణి గుండెల నిండుగా ధ్యానిస్తూ ఉండాలి
శ్రీవారి పాదాలకు భక్తితో ప్రణమిల్లాలి యిల్లాలు.
భర్త మాత్రం –
భార్యకు ఎప్పుడూ నమస్కరించకూడదు
భార్య శవానికి కూడా నమస్కరించకూడదు
భార్య చితికి నమస్కరించకూడదు
(అసలు శ్మశానానికే పోకూడదు)"

ఈ ప్రాచీన శాసనాన్ని ధిక్కరించాను నేను
అతి భక్తితో నమస్కరించాను
ఇంట్లో నీ శవానికీ –
శ్మశానంలో నీ చితికీ –
హాల్లో పూలదండ వేసిన నీ ఫొటోకీ –
ఎందుకు ...?
నీవు నాకన్నా అన్ని విధాలా ఉన్నతురాలవు
అహర్నిశలూ నా సంక్షేమం కోసం పరితపించినదానవు
పాతివ్రత్యమే జీవితధ్యేయంగా బ్రతికినదానవు

ఇన్ని మాటలెందుకు?
గిరీశంలా ఒక్క ముక్కలో చెప్పాలంటే -
"నీవు pure diamond
నేను damn scoundrel"
నేనే కాదు -
ఈ దేశంలో నూటికి 99 మంది భర్తలు
భార్యా నమస్కారానికి అనర్హులు!
భార్యకే నమస్కరించడానికి
అన్ని విధాలా అర్హులు!!

## 8

ఆంధ్ర గోదావరీ తీరంలో పుట్టి
కర్ణాట కావేరీ తీరంలో గిట్టిన
నీ భస్మాస్థికలకు -
భారతీయుల పవిత్ర తరంగిణులు
కృష్ణా - గోదావరీ - కావేరీ -
గంగా - యమునా - సరస్వతులలో
కన్నకొడుకుల చేతిమీదుగా నిమజ్జనం!
శ్రద్ధాసక్తులతో పిల్లలు జరిపిన కర్మకాండను
మెచ్చుకున్నారు విద్వజ్జనం!
ధన్యమైన నీ జన్మ పుణ్యమంతా
ఈ జీవనదుల్లో ప్రవహిస్తుంది
నీకు ఉత్తమ గతులు ప్రసాదిస్తుంది
నీ పవిత్రాత్మకు శాంతిని చేకూరుస్తుంది!

## 9

మన మనుమడికి - నాలుగేళ్ళ 'స్కంద్'కి
నీ అర్ధంతర అంతర్ధానం ఏమీ అర్థం కాలేదు
నువ్వింకా ఆసుపత్రిలోనే ఉన్నావనీ

ఎప్పటికైనా యింటికి వస్తావనీ
భ్రమలో ఉన్నాడు పసివాడు
భగవంతునితో సమానుడు!
మేం నీ శవం చుట్టూ కూర్చుని ఏడుస్తూంటే -
"ఆకలేస్తోంది ... బిస్కట్లు పెట్టండి!"
అని అడిగిన అమాయకుడు వాడు.
నెలరోజుల తరువాత -
B.T.M. Layout కి వెళ్ళిన వాడిని ఫోనులో పలుకరించి -
"ఈ రోజు నాయనమ్మ మాసికం.
భోజనం వేళకి నువ్వు తప్పక రావాలి!" అంటే -
"నాయనమ్మకి ఫోను ఇవ్వండి. నేను మాట్లాడాలి!" అన్నాడు వాడు.
ఈ "స్కంద్"కి నీ శాశ్వత నిష్క్రమణం ఎప్పటికి అర్థమవుతుందో ఏమో...!

# 10

ఎప్పటికీ తెగని, ఈ బ్రతుకు చిక్కు లెక్కలో,
నన్ను శేషంగా మిగిల్చి, నువ్వెళ్ళిపోయావు ...
ఇక, నన్ను చుట్టుముట్టిన, చిమ్మచీకట్లో
కొడుకులు - కోడళ్ళు, కూతుళ్ళు - అల్లుళ్ళు
మనుమలు - మనుమరాండ్రు
దారి దీపాలు కాగా
నీ తలపులలో మునకలు వేస్తూ
తడుముకుంటూ నా నడక!
నీ శ్వాస ఆగిపోయిన డబుల్ కాట్ బెడ్ మీద
ఒంటరిగా బిక్కుబిక్కుమంటూ నా పడక!
అప్పుడు, నీకు తోడుగా ఉండిన 'రాముడే'
ఇప్పుడు, నాకు కూడా తోడు!
కర్మతో గ్రహచారంతో
విధితో మృత్యువుతో
చెప్పుకుంటున్నాను గోడు!

## 11

ఇంతకీ -
జీవితమంటే ఏమిటి?
మృత్యువంటే ఏమిటి?
పుట్టడం - పెరగడం
చదవడం - ఉద్యోగం చేయడం
పెళ్ళి చేసుకోవడం - పిల్లల్ని కనడం
డబ్బు సంపాదించడం - వాళ్ళకివ్వడం
ఇల్లు కట్టుకోవటం - కాపురం ఉండటం - పిల్లల పెళ్ళీ పేరంటం
తల్లిదండ్రులు చనిపోతుంటే దగ్గరుండి సాగనంపటం
మనమూ అదే దారి పట్టటం .... ఇంతేనా? ఇంకేమైనా ఉందా?
ఈ యక్షప్రశ్నలకు జవాబులు చెప్పే ధర్మజుడు లేడు
నిస్సార సంసార విస్తార సరోవరంలో
టక్కరి కొక్కెర రూపంలో ఉన్న యక్షుడే
ధర్మరాజు తండ్రి యమధర్మరాజు
సరిగా చూడు!

పూలు వాడిపోతాయి ఒక్కరోజులో
బంతులూ చేమంతులూ కూడా ... రెండు మూడు రోజుల్లో
కాలచక్ర భ్రమణంలో చిన్న ఇన్నర్ వీల్ ఋతుషట్కం
తరతరానికీ తప్పక వస్తుంది ఒక శిశిరం
చటుక్కున చావుగాలి బలంగా వీస్తుంది ...
వంశవృక్షం నుండి పండుటాకులు టపటపా రాలిపడతాయి
వెంటనే వచ్చే వసంతంలో చిగురుటాకుల కెంపులు పాటమరిస్తాయి
కొమ్మలకూ రెమ్మలకూ జవసత్త్వాలు చేకూరుస్తాయి...
"పునరపి జననం... పునరపి మరణం..."
"పునరపి జననం... పునరపి మరణం..."

## 12

ఎందరో బంధుమిత్రుల మీద
ఎలిజీలు వ్రాశాడు వీడు

ఈ పిడుగుపాటుతో
ఎంత గొప్ప ఎలిజీ వ్రాస్తాడో -
అనుకున్నారు కొందరు అమాయకులు
నీ ప్రాణహంసతోపాటే
నా కవితాశక్తి కూడా ఎగిరిపోయిందని
పాపం తెలియదు వారికి!
చిన్న దెబ్బ తగిలితే ప్రాణం జిల్లార్చుకుపోతుంది
పెద్ద దెబ్బ తగిలితే అది మొద్దుబారిపోతుంది!

ఇప్పుడు -
బంధుమిత్రులు ఎదురుపడితే
వేసే మొట్టమొదటి ప్రశ్న:
"భోజనం ఎలాగ (చేస్తున్నావు)?"
అంటే -
తల్లిలేని పిల్లవాడికి భోజనం దొరకదు
పెళ్ళాంలేని పెద్దవాడికీ భోజనం దొరకదు!
భోజనమంటే కన్నతల్లి
భోజనమంటే కట్టుకున్న పెళ్ళాం
తల్లి చనిపోతే ఆ స్థానాన్ని పెళ్ళాం భర్తీ చేస్తుంది
మరి పెళ్ళాం చనిపోతే ....?
(బహుశః కూతురు భర్తీ చేస్తుంది!)
పెళ్ళామంటే మరో రూపంలో ఉన్న కన్నతల్లే!
తల్లిలేని పిల్లాడు అనాథ!
పెళ్ళాం లేని మొగుడూ అనాథే!!

## 13

తింటున్నాను
తిరుగుతున్నాను
ఊపిరి పీలుస్తున్నాను
ఉసూరుమంటూ బ్రతుకుబండి ఈడుస్తున్నాను ...
"ఇదేమిటి? ఇలా జరిగిందేమిటి?" - అని

పదే పదే ఆలోచిస్తున్నాను ...
విధి వైపరీత్యానికి విస్తుపోతున్నాను ....

మాటల్లో నిన్నటి వాడిలేదు వేడిలేదు
చేతల్లో నిన్నటి చైతన్యం లేదు
మొత్తం దేహంలో నిన్నటి జవం లేదు జీవం లేదు
తుదా మొదలూ తెలియని
చిక్కులుపడ్డ దారపు ఉండ
ఉండి ఉండి
నా మానస శ్మశానంలో
పగిలిన ఊహల కొత్తకుండ!

నువ్వు లేని నేను -
ఇంచుమించు మంచం పట్టిన రోగిని
దేనిమీదా ఆసక్తి లేని యోగిని!

చిట్టీ!
ఈ కాలప్రవాహంలో
నీ కర్మకాండ
పదమూడు దినాల వెలుతురు ముక్కలు!
నా కవితా హృదయం కూడా పదమూడు చెక్కలు!
ఇవి -
నీ జ్ఞాపకాల మూకుడులో మొలకెత్తిన
నవధాన్యాల లేత మొక్కలు!
ఇది దైవనిర్ణయం!
శిరసావహించడం తప్ప
ఇంకేం చేయగలం?
నా పయనంలో కాలం రేపిన కలకలం నీ మరణం
దీనిని ఎవరాపగలం?
"విధి బలీయం! మానవుడు నిమిత్తమాత్రుడు!" *(సంపూర్ణం)*

*(31-8-2006 గురువారం రాత్రి 1.30 గంటలకు బెంగుళూరులో సంభవించిన మా ఆవిడ 'చిట్టి' అనబడే శకుంతలాదేవి మరణానికి దిగ్భ్రాంతి చెంది ...)*
*(రచనాకాలం: 25-9-2006 నుండి 26-11-2006 వరకు)*

అభినందన మందార హారము (ధారావాహిక):

# మా సుబ్బన్న బావ

– దుగ్గిరాల రామారావు

*(41 + 42 సంయుక్త సంచిక తరువాయి)*

ఆనాఁటి తెలుగు వీరుల
నీ నాఁటి ప్రపంచమెల్ల నెఱుఁగుట కొఱకై
"రేనాటి సూర్యచంద్రులు"
నా, నేఁటికిఁ గూర్చె, నొక ఘనంబైన కృతిన్. 35

రాయలసీమలో మును పరాక్రమవంతులు-ధైర్యసాహస
శ్రీయుతు-లాత్మగౌరవ విశిష్ట గుణోన్నత వీరమూర్తు, లాం
గ్లేయ నిరంకుశత్వ మణఁగించి స్వదేశము నుద్ధరింపఁగా,
సాయుధులై యెదిర్చిన మహాత్ముల సచ్చరితల్ నుతించుచున్. 36

వారునువారుఁ బాడుకొను పాటలలోఁగల వీరగాథ లా
ధారముగా నొనర్చుకొని, తాఁ బరిశోధనలో మఱెన్ని యా
ధారములన్ గ్రహించి, బహుధా వ్యయమున్ శ్రమనోర్చి, కూర్చె సాం
పారఁగ "సూర్యచంద్రుల" బృహత్కృతి నందనిమ్రాని పండుగన్. 37

లోకము వాకొనినది తన
వాకొనినది పుటలు నాఱువందల పైఁగా,
నాకృతి యందును వెలయం
దా కృతి రూపొందె నొక మహాభారతమ్మై. 38

దాని మూల్యమ్ము నాల్గువందలకుఁ బైన,
కొనుట యన నాకు పరువు తక్కువ, యతండొ!
యుచితముగ నీఁడు, కరపత్ర నిచయ లిఖిత
సంగతులు తప్పఁ గృతి నేను చదువలేదు. 39

సౌమ్యుఁడు, విమర్శకుండును, సత్కవియును,
పండితుండు, ప్రవక్తయు, భావుకుండు,

సోమయాజు లితని జ్యేష్ఠ సోదరుండు
విజయునకు ద్వాపరమున ధర్మజుఁడు వోలె. 40

ఛాత్రుఁడు, సోమయాజి కనుజన్ముఁడు గూడను నౌటఁ, దత్సుచా
రిత్రుని యందు గౌరవముఁ బ్రేమయు సుబ్బన్న కగ్గలమ్ము, లో
కత్రయ రాజ్య మబ్బినను కాదనఁ డన్నను, భ్రాతృభక్తి సౌ
మిత్రిని సవ్యసాచిని సమీరకుమారునిఁ ద్రోసి రాజనున్. 41

కరమనురక్తి సంకలిత కాటమరాజ కథావితానం సం
భరితకృతిన్ సమంచిత విమర్శనమున్ రచియించి యగ్ర సో
దరునకు నంకిత మ్మిడెను; తత్సమయమ్మున నేమి వ్రాసెనో
యరసినఁ దెల్లమౌ నతని కన్నపయిన్ గల భక్తి భావముల్. 42

ఒకసారి యాంగ్లభాషోద్యానవన కృతి
        ప్రసవగుచ్ఛభ్రమ ద్భృమర మగును,
ఒకసారి సరస గేయకవిత్వ మంథాన
        గోత్రోద్ధరణ చేయు కూర్మ మగును,
ఒకసారి సంప్రదాయ కవిత్వ మాకంద
        కుజశాఖపై గండుకోయి లగును,
ఒకసారి యత్యాధునిక సాహితీ నభో
        మండలమ్మునఁ జందమామ యగును,

ఒక్కతటి పరిశోధన ద్యోధునీ త
రంగరాజీ విరాజన్మరాళ మగును,
అన్నిటను సమర్థుండు సుబ్బన్నబావ;
ఆతఁ డెత్తని యవతార మవని లేదు! 43

జానపదవాణి యొకవంక - సంప్రదాయ
సాహితీసతి యొక్క పార్శ్వమునఁ జెవులు
పట్టి యాడింప, నతఁ డాడినట్టిదెల్ల
నాటయ్యె పాడినట్టిది పాటయయ్యె! 44

కమ్మని పద్యమున్ విని ఫకాలున సుబ్బన నవ్వెనేని కుం
దమ్ములు విచ్చినట్టులు, సుధారస మొల్కినయట్లు, చంద్రబిం

బమ్మిది చెక్కలైనటులు, పాలసముద్రము పొంగినట్లు, ము
త్యమ్ములు ముక్కలై చెదరినట్టుల తోఁచును చూచువారికిన్. 45

అరువది యేండ్లు దాఁటెను వయస్సను మాటయెకాని, లేశమున్
దఱుగని దేహదార్ఢ్యము, సతమ్మును వాఙ్మయసేవ యన్నచోఁ
గరఁగని కౌతుకమ్ము, నధికమ్ముగ సుబ్బనకున్నవంచుఁ ద
త్పరిచయమున్నవాఁడెఱుఁగుఁ, బ్రాయముతోఁ బనిలేదు వానికిన్. 46

పలుకులదేవి సేవలను పండిన శీర్షము, దబ్బపండుతోఁ
గలఁబడు మేను, కాశసువికాసము వాసము మీసకట్టు, మ
ల్లెలు విరఁబూయు లేనగవురేకలు, సుబ్బనబావ పండు వె
న్నెల దిగజాఱు మేరు ధరణీధర శృంగము భంగిఁ గన్పడున్. 47

తనకృతు లచ్చువేయ నొక దాత సహాయమొనర్చెనేని యా
తనికిఁగలట్టి కీర్తిదురదన్ వదలించఁగ నూరుకానియూ
రున సభలంచుఁ జేతిచమురున్ వదలించుకొనున్ ఘనమ్ముగన్;
వినుతి యొనర్ప సుబ్బన వివేకము నే కవికైన శక్యమే? 48

చూచును మిత్రకోటిఁ దన సోదరులట్టులు, శిష్యసంతతిన్
జూచును పుత్రులన్‌బలెఁ, దెనుంగున గన్నడమందుఁ గీరితిన్
మోచెను, లేరు వాని సరిపోలెడువారని యందు రందఱున్,
మా చినబావగా రొక యమాయికుఁడే యెవరెన్ని చెప్పినన్! 49

అభ్యుదయ కవులం దధికుండు బాలగం
గాధర తిలకు సంగాతకాఁడు,
అభినవ పెద్దన్న యనఁదగు గుంటూరు
శేషేంద్రశర్మ మెచ్చిన బుధుండు,
బుల్లా కులాబ్ధి జాబిల్లి సుబ్బారావు
ప్రాణమ్ము ప్రాణమ్మైనట్టి సఖుఁడు,
దళవాయి పారిజాతమ్ము కృష్ణస్వామి
ఆదికేశవుల వీరాభిమాని,

దొరకవివరుండు మల్లెల గురవయకవి
విమల కృతికన్యఁ జేకొన్న పెండ్లికొడుకు,
ధన్యజీవి, మా ఆచార్య తంగిరాల
వర్ధిలును గాత! నూరు సంవత్సరాలు!! 50

*(బెంగుళూరు విశ్వవిద్యాలయం ఆంధ్రశాఖ పూర్వాధ్యక్షులు
ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు బావగారి గురించి - 1999)*

*(సమాప్తం)*

---

*గమనిక:* 'మా సుబ్బన్న బావ'' అనే 50 పద్యాలూ, 2005 జూన్ నెలలో వెలువడిన ''సుమనోభిరామము'' అనే తన కావ్యంలో ముద్రించి, దానిలో స్వహస్తాలతో ఈ క్రింది విధంగా వ్రాసి, నాకు ఒక కాపీ పంపించారు: (-తంగిరాల)

*ప్రముఖ సాహితీవేత్త -*

*సీ. 'చైతన్యకవిత' కు సంపాదకుండు, స
ద్గ్రంథ సంతతికి ముద్రాపకుండు,
అనుకూలురగు బిడ్డలనుగన్న జనకుండు
ఖ్యాతిగన్నట్టి అధ్యాపకుండు,
వలచి చేకొను శకుంతలకు దుష్యంతుండు
పరిణతిఁగన్నట్టి పండితుండు''*

శ్రీ ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు చినబావగారికి - శుభాకాంక్షలతో...

- దుగ్గిరాల రామారావు

ఈ అసంపూర్ణ పద్యాన్ని పూర్తిచేయవలసిందిగా కోరుతూ 5-1-2009 నాడు నేను వారికొక లేఖ వ్రాయగా 10-1-2009నాడు ఈ క్రింది విధంగా పూర్తిచేసి నాకు పంపారు:- (- తంగిరాల)

''సోమయాజులుకుఁ గూర్పు సహోఖరుణీడు, తంగి
రాలాబ్ధి తరుణ సారంగధరుఁడు

తే. భావ బంధుర మధుర సంభాషణుండు,
ఖుచ్చటంగొల్పు వినయ విభూషణుండు,
జానపద సాహితీ విశేషముల తావు,
సుగుణముల ప్రోవు, వేంకట సుబ్బారావు''

- దుగ్గిరాల రామారావు

# నీరామని

- పాతమత్తిగిరి సుబ్రహ్మణ్యం

అదొక పూలతోట
అక్కడ సాహిత్య సుమాలు మాత్రమే
పూచి పరిమళిస్తుంటాయ్
ఆ పూలచెట్లకు పాదులు కట్టి
ఎరువువేసి, నీరుపోసి పెంచేందుకు
ఆ సాహిత్య పుష్పవాటికకో తోటమాలి
ఏడు పదులు దాటినా
మంచి సాము కండెం
శరీర స్థేమం కల నిత్యయౌవనుడు
అతడు సాహిత్యపు మంచెమీద నిలబడి
మా క్షుబ్ధచిత్తాలలోకి
కవిత్వపు తునుకల్ని వడిసెలలో
రాయిలా విసురుతూ మమ్మల్ని
నిత్యం పొయటిక్ ఎరీనాలోకి
ఈడ్చుకు వెళ్ళే సాహిత్య మాంత్రికుడు
సుప్త కవితా చేతన అతడు.
అతడు కవిత్వం యొక్క మౌలిక
లక్షణం తెలిసిన కౌశికుడు
అతడు తన గుండెల్లో
కవిత్వ భావచిత్రాల ప్రతీకల
గనులున్న మనిషి
అనేకమంది కవుల కావ్యాలను
అంకితం పుచ్చుకోవడంలో
అనేకమంది కవుల కావ్యాలను
తన శ్రీరస తెలుగు సాహిత్య సంస్థద్వారా
వెలుగుకు తీసుకు రావడంలో
అతడొక సాహిత్య సర్దారు
కవిత్వపు వెండి నకీబు చేతబట్టిన నవాబు

తన 'చైతన్యకవిత' షాణ్మాసిక పత్రికద్వారా
కొన్ని వందలమంది కొత్త కవులను
తెలుగు సాహిత్యలోకానికి పరిచయం చేసినవాడు
మాలో సాదు గుప్తాలై నిద్రాణమై వుండే
కవితా భావావేశాలను
మా నరాల్లో విస్ఫోటింపజేసి
తన పాలమీగడలాంటి చేతివ్రేళ్ళతో
చల్లగా నిమిరి మమ్మల్ని
కవిత్వపు తనువు గాలిలోకి
తీసుకొని వెళ్ళిన వైతాళికుడు
తెలుగు కవితా సింహాసనానికి
మమ్మల్ని సాలభంజికలుగా చేసినవాడు
సదా మమ్మల్ని కవిత్వ మంత్రనగరి సరిహద్దుల్లోకి
తీసుకెళ్ళే మాంత్రికుడు
అతడు నిత్య సాహిత్య కృషీవలుడు
అమూల్యమైన సాహిత్య గ్రంథాలెన్నో రాసినా
కొన్ని వందల కొత్తకలాలను సాహిత్య లోకానికి
పరిచయం చేసినా
అతడు ప్రచారాలకు చిక్కనివాడు
ప్రలోభాలకు లొంగనివాడు
స్వాతిశయం ఎరుగని మనిషి
నిరాడంబరత గలిగిన నిగర్వి
అతడు తెలంగాణా, కోనసీమ, రాయలసీమ, మాండలికాల సొంపును
జానపద సాహిత్యపు సొబగులను
తెలుగు సాహిత్య రసపిపాసువులకు రుచిచూపినవాడు
సదా తన శిష్యులకు కవిత్వంలో
లిట్మస్ టెస్టులు పెడుతూ
తెలుగు సాహిత్యపు చెట్టుమీద
మమ్మల్ని బదనికల్లా మొలకెత్తింప జేసినవాడు
'నెల నెలా వెన్నెల' పేరుతో
నెలకో కవుల గోష్ఠి జరిపి

కవులను సన్మానిస్తూ
'శ్రీరస' పరంగా ఉగాది సాహిత్య వసంతాలు జరుపుతూ
సాహిత్య సేవలో నిత్యం తీరికలేని మనిషి
ఏ అవార్డులనూ ఆశించకుండా
ఏ రివార్డులకూ కక్కుర్తి పడకుండా
పేరు ప్రతిష్ఠలకూ, కీర్తి కండూతికీ
ప్రలోభపడని నిస్వార్థజీవి
అతడికి తెలుగు పద్యమంటే గౌరవం
వచన కవిత రాయడంపై మోజు అదొక రివాజు
అతడే మాగురువు తంగిరాల వెంకటసుబ్బారావు
అతడు మధుర సాహిత్య సుధారస విసారుడు
కవిత్వ రసావలోకన ప్రసారుడు
తెలుగు సాహిత్య వినీలాకాశంలో
అతడొక విహంగ బింబం
అతడు కవిత్వపు నీరామనిలో
అనుక్షణం తడిసిపోయే
ఒక గొప్ప తెలుగు పోయెం!

*("జీవన వేదం" కవితా సంపుటి నుండి)*



1. "కథకుడి కవనం కరుణా సముద్రం"- డా॥ సుమనశ్రీ
2. "అక్షరం పలికితే ఆలయం
   అక్షరం పగిలితే ఆయుధం" – రాజు (కూకట్‌పల్లి)
3. "ఆద్యంతమూ తిమిరావృతం
   అయినా నడవక తప్పదు" – చినవీరభద్రుడు
4. "The foundations of man are not in matter but in spirit" *(ప్రాథమిక భారతీయ సంప్రదాయం)*
   – మునిపల్లె రాజు

# "అక్షయ పాత్ర"కు అక్షరాభినందనం

**- ఆచార్య ఆర్వీయస్. సుందరం**

మహాభారతం ద్వారా మనకు అక్షయపాత్ర పరిచయం కలిగింది. అక్షయపాత్ర అంటే మామూలు అర్థంలో క్షయం లేని పాత్ర. అంటే ఎంత వాడుకున్నా తరుగు లేకుండా మనం కోరింది ఇచ్చేపాత్ర అన్నమాట. అయితే సందర్భాన్ని బట్టి చూస్తే అక్షయపాత్ర కష్టంలో ఉన్నప్పుడు ఆదుకుంటుందని చెప్పవచ్చు.

ఇప్పుడు కష్టాల్లో ఉన్నదెవరంటే మరో ఆలోచన లేకుండా 'తెలుగు' అని చెప్పవచ్చు. 'దిక్కున్నచోట చెప్పుకోండి' అని తెలుగువాళ్ళను తెలుగువాళ్ళే తిరస్కరిస్తున్న గడ్డురోజులివి. ఇంగ్లీషు నేర్చుకుంటేకాని 'ప్రపంచగ్రామం'లోని ప్రజలకు భవిష్యత్తు లేదని చెప్పినా అర్థం చేసుకోవచ్చు. ఇంగ్లీషు నేర్చుకోవటం వేరు, ఇంగ్లీషుకు దాసోహమనటం వేరు. భాష పేరుతో రాష్ట్రాలను ఏర్పరచాలని పోరాటాలు జరిపి దేశానికే ఆదర్శమైన రాష్ట్రంలో, ఆ రాష్ట్రంలో అధిక సంఖ్యాకులైన వారు మాట్లాడే భాషకు పుట్టగతులు లేకుండా చేస్తున్నవారిని భాషాభిమానంగల ప్రతి ఒక్కరూ నిరసించాలి. ప్రపంచంలో ఎన్నో దేశాలు తమ దేశంలోని భాషకే ప్రాధాన్యమిచ్చి పురోగతి సాధిస్తుంటే, మన పాలకులు మాత్రం తెలుగును మన రాష్ట్రంలోనే కించ పరుస్తున్నారు. బ్రిటిష్ పరిపాలన కాలంలో అధికారులు తెలుగును నేర్చుకుంటే కాని తెలుగువారిని పరిపాలించటం కుదరదని భావించేవారు. కాని మన ప్రజాస్వామ్య పరిపాలకులు తెలుగు దేనికీ పనికిరాదని భావిస్తున్నారు.

తెలుగుమీద అభిమానాన్ని అక్షయంగా ఇవ్వగలిగిన పాత్ర మనకిప్పుడు అవసరం. అలాంటి అక్షయపాత్ర ఆంధ్రదేశంలో కాకుండా పరరాష్ట్రంలో కార్యదీక్ష పూనిన విషయాన్ని ప్రస్తావించడానికే ఈ రెండు మాటలు.

బెంగుళూరులో పరుచూరి గ్లోబల్ ఫౌండేషన్ అనే సంస్థ ఉంది. దాని అధినేత పరుచూరి సురేంద్రకుమార్‌గారు. వీరు ప్రపంచవ్యాప్తంగా వ్యాపారాలు నిర్వహించడం కోసం గుంటూరుజిల్లా రేపల్లె నుండి బెంగుళూరు వచ్చారు. సరిగ్గా ఏడాది క్రితం 2007 ఆగస్టు 9న 'పరుచూరి గ్లోబల్ ఫౌండేషన్' అనే ట్రస్టును స్థాపించారు. ఆ ట్రస్టు ఆశయాలు చాలా ఉన్నతమైనవి.

(అ) అపాయంలో ఉన్న జంతువుల్ని కాపాడడం, అపురూపమైన జంతు జాతులు నశించకుండా రక్షించే చర్యలు చేపట్టడం.

(ఆ) కళాశాలలు, పాఠశాలలు, గ్రంథాలయాలు, ఆస్పత్రులు, అనాథాశ్రమాలు, వితంతు గృహాలు, వృద్ధాశ్రమాలు స్థాపించడం, వాటిని నడపడానికి సహాయం చేయడం.

(ఇ) సాహిత్యం, కళలు, వైద్యం, విజ్ఞానం, చరిత్ర, సాంకేతిక విజ్ఞానం అభివృద్ధి పరిచేలా విద్యాసంస్థ స్థాపించడం.

(ఈ) పేద విద్యార్థులకు, వికలాంగులకు, అర్హులైన ఇతరులకు ఉపకార వేతనాలు ఇవ్వడం, ఫీజులు కట్టడం, పుస్తకాలు కొనిపెట్టడం.

(ఉ) అవసరమైన వారికి వైద్య సహాయం అందించడం, అనాథలకు, వితంతువులకు, పేదవారికి చదువుకోవడానికి సహాయం చేయడం, జీవనోపాధి కల్పించడం.

(ఊ) ప్రసిద్ధ కళాకారులను, శాస్త్రజ్ఞులను, సాహిత్య వేత్తలను సామాజిక కార్యకర్తలను గౌరవించడం, సన్మానించడం.

(ఎ) విద్యకోసం తపిస్తున్న విద్యార్థుల్ని ఆదుకోవడం, విద్యార్జనలో ఔన్నత్యాన్ని సాధించిన వారిని సత్కరించడం.

(ఏ) జాతీయత, మతం, కులం, వర్గం, స్త్రీ పురుష భేదాలు చూడకుండా సహాయపడడం.

పైన పేర్కొన్న ఆశయాలతో కార్యదీక్ష పూనిన సంస్థలు ఇంకా ఉన్నాయి. సమాజంలో ఇలాంటి సంస్థలు ఇంకా ఇంకా రూపుదాల్చడం అవసరం. అయితే పరుచూరివారిలో వ్యక్తిగతంగా నన్ను ఆకర్షించిన విషయం వారి భాషాభిమానం, సంస్కృతి మీద ఉన్న గౌరవం, అవకాశ వంచితులైన పేదవారి పట్ల ఉండే అపారమైన కారుణ్యభావం. వారు చేస్తున్న సేవా కార్యక్రమాలు ముఖ్యంగా విద్యాసంస్థలకు, తెలుగు చదువుతున్న విద్యార్థులకు మాతృభాషమీద గౌరవంఉన్న పిల్లలకు సంబంధించినవి కావడం విశేషం. అందువల్లనే పరుచూరి గ్లోబల్ ఫౌండేషన్ గురించి ఈ నాలుగు మాటలు వ్రాయడం.

ఒక్క ఏడాదిలో పరుచూరి సంస్థ చేసిన పనులు చూస్తే, భాషాభిమానం, పేద విద్యార్థులపట్ల ఉన్న ఆదరణ, విద్యాసంస్థల అభివృద్ధిని గురించిన ఆకాంక్ష సువ్యక్తమవుతున్నాయి. ఎవరికి ఎంత ఇచ్చారన్నది ముఖ్యం కాదు; ఏ ఆశయంతో ఇచ్చారన్నది ముఖ్యం. వయోవృద్ధులైన పౌరులకు టెన్నిస్ పోటీలు పెట్టడం, పాఠశాలలకు పాత్రలు, పుస్తకాలు, తరగతి గదులు, బోధన సామగ్రి సమకూర్చడం

గత ఏడాది కార్యక్రమాలలో ఉన్నాయి. అవకాశం లేక విద్యను కొనసాగించలేక పోయిన వారిని ఆదుకోవడం ఈ సంస్థ చేసిన ముఖ్యమైన పనుల్లో ఒకటి. పాఠశాల విద్యార్థులకు వందల సంఖ్యలో వార్తాపత్రికల్ని పంచిపెట్టడం కూడా ఈ సంస్థ చేపట్టిన కార్యక్రమం.

పరుచూరి సంస్థ ఆశయాలలో ముఖ్యమైంది – మాతృభాషలో విద్యాబోధనకు ప్రోత్సాహం ఇవ్వడం. దీనికిగాను సురేంద్రకుమార్ గారు కొన్ని లక్షల్ని కేటాయించడం ఆశ్చర్యం కలిగిస్తోంది. తమిళనాడులో ప్రభుత్వ పాఠశాలల్లో తెలుగు, తమిళ మాధ్యమాల్లో చదివి ఎస్.ఎల్.సి.లో అత్యున్నత స్థానం పొందిన వారికి లక్షరూపాయల చొప్పున, రెండవ స్థానం పొందిన వారికి యాభైవేల చొప్పున బహుమతిని అంద జేస్తున్నది పరుచూరి సంస్థ. అలాగే కర్నాటక రాష్ట్రంలో తెలుగు, కన్నడ మాధ్యమాల్లో చదివిన వారికి కూడా బహుమతులు ఇవ్వాలని సంస్థ నిర్ణయించింది. ఇలాంటి ప్రోత్సాహక బహుమతులు ఇవ్వడంవల్ల మాతృభాషలో చదవాలనే ఆసక్తి పెరుగుతుందని సంస్థ ఆశయం.

ఈ ఆసక్తిని పెంచాలని పరుచూరి సంస్థ మరో ఆలోచన కూడా చేసింది. తమిళనాడు ప్రభుత్వ పాఠశాలల్లో తెలుగు మాధ్యమంలో బోధిస్తున్న అత్యుత్తమ ఉపాధ్యాయుడికి కీ.శే. కె. ఎస్. కోదండరామయ్యగారి పేరిట లక్షరూపాయల పురస్కారాన్ని, అలాగే కర్నాటకలో అత్యుత్తమ ఉపాధ్యాయుడికి మరో లక్ష రూపాయల పురస్కారాన్ని ఇవ్వాలని నిశ్చయించింది. మాతృభాషలో చదివే వారికి ఈ పురస్కారాలు స్ఫూర్తిదాయకమవుతాయని పరుచూరి సంస్థ భావించడం ముదావహం.

హోసూరు తాలూకాలోని ప్రభుత్వ పాఠశాలల్లో తెలుగు మాధ్యమంలో బోధించే ఉపాధ్యాయుల కొరత ఎక్కువగా ఉంది. దీనిని గుర్తించిన పరుచూరి సంస్థ అనేక పాఠశాలల్లో ఉపాధ్యాయులను నియమించి, వారికి నెలనెలా లక్షలాది రూపాయలను జీతాలుగా ఇస్తోంది. తెలుగు వారికోసం హోసూరులో ఒక కళాశాలను స్థాపించాలని, ఒక వేదపాఠశాలను ప్రారంభించాలని యోచిస్తోంది.

మరో విషయం, త్వరలోనే పరుచూరి గ్లోబల్ ఫౌండేషన్ "పరుచూరి విజ్ఞాన వేదిక"ను ప్రారంభించబోతుంది. ఇప్పటికే తెలుగు మాధ్యమాల్లో చదివే విద్యార్థుల కోసం "పరుచురి జ్ఞానదీపిక" అనే వారపత్రికను ప్రారంభించిన పరుచూరి సంస్థ, సాహిత్యం, సంస్కృతి, విజ్ఞానం, వినోదం, వికాసం ధ్యేయాలుగా "పరుచూరి భారతి"

అనే మాస పత్రికను ప్రారంభించబోతోంది. పెద్ద బాలశిక్షను ఇప్పటి అవసరాలకు అనుగుణంగా ప్రచురించబోతోంది. తెలుగు చదివే విద్యార్థులకు కరదీపికలను అందించబోతోంది. సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా, భాషాప్రచార కార్యక్రమాల ద్వారా తెలుగు భాషమీద అభిమానం పెంచే కార్యక్రమాలను చేపట్టబోతోంది. ఆంధ్రదేశంలో అట్టడుగుకు నెట్టివేయబడిన తెలుగు భాషా సంస్కృతులు, ఇతర రాష్ట్రాలలో అయినా తలెత్తుకునే పరిస్థితులు ఏర్పడడం మనందరికీ ముదావహమే కదా!



# ప్రతీక

– లంకా వెంకటేశ్వర్లు

*(గత సంచిక తరువాయి)*

ప్రతీకతత్వం తెలిసిన ప్రతిభాశాలి శేషేంద్రశర్మ. సారం నిగూఢపరచి భావాన్ని అనుభూతికి తేవడం శేషేంద్రుని అపూర్వ ప్రజ్ఞ. ప్రతీకను ఎన్ని విధాలుగా వ్యక్తం చేయవచ్చో తెలిసిన నేర్పరి. ఒక్క మాటలో, శేషేంద్రుని ప్రతీక రసానంద పతాక. అప్పటికి తన మొత్తం రచనల్ని కలిపి ఆధునిక మహాభారతం అనే కావ్యేతిహాసం ప్రకటించటంతో 'కావ్యేతిహాసం' ఒక ప్రక్రియగా తెలుగు కవితా లోకానికి పరిచయమైంది. ఇతిహాసంలో ఉండే ఇతివృత్తంగానీ, వర్ణనలతో కూడిన కథనం గానీ, అసలు వాచ్యత అనేది మచ్చుకైనా ఈ కావ్యేతిహాసంలో కనిపించదు. మనిషి, సర్వసమగ్ర చైతన్యరూపంగా విప్లవించాలనే సందేశం ప్రతీ వాక్యంలోను తొణకిసలాడుతుంది. శేషేంద్రుని దృక్పథానికి తగినట్లుగానే ప్రతీకలు, భావచిత్రాలు, అలంకారాలు దొంతరలుగా పరుచుకొని వుంటాయి. వస్తువు కనిపించకుండా, గాఢమైన అభివ్యక్తి శిల్పమే అసలు వస్తువుగా మనం భ్రమించేలా కవితా నిర్మాణముంటుంది. వస్తువుని పునః సృష్టించటమే కవిత్వం కనుక ఆ బాధ్యతను అభివ్యక్తిరీతి తీసుకుంటుంది. శేషేంద్రుని ప్రతీక గురించి విస్తృతంగానే వ్యాఖ్యానాలు వచ్చాయి. వాటిలో కవి అభివ్యక్తి విరాడ్రూపంగా ఆవిష్కృతమైంది.

సినిమా కోసం రాసిన ఒకే ఒక్క పాటసైతం ప్రతీకాత్మక రచన కావటం, ప్రతీక పట్ల శేషేంద్రుని మక్కువను తెలియజేస్తోంది.

"నిదురించే తోటలోకి పాట ఒకటి వచ్చింది
కన్నుల్లో నీరు తుడిచి కమ్మటి కల ఇచ్చింది
రమ్యంగా కుటీరాన రంగవల్లులల్లింది
దీనురాలి గూటిలోన దీపంగా వెలిగింది
శూన్యమైన వేణువులో ఒక స్వరం కలిపి నిలిపింది
ఆకురాలు అడవికి ఒక ఆమని దయచేసింది
విఫలమైన నా కోర్కెలు వ్రేలాడే గుమ్మంలో
ఆశల అడుగులు వినబడి అంతలో పోయాయి
కొమ్మల్లో పక్షుల్లారా
గగనంలో మబ్బుల్లారా
నది తోసుకుపోతున్న నావను ఆపండి
రేవు బావురుమంటోందని నావకు చెప్పండి" (గుంటూరు శేషేంద్రశర్మ – ఆధునిక మహాభారతం – పుట – 287).

ఈ పాటలోని ప్రతిపదం అంతరానుభూతిని ఇముడ్చుకుని రసార్ద్రమైంది.

ప్రశాంతంగా ఉన్న తోటలోకి పాటలాంటి ఆనందం (తుమ్మెద) వచ్చింది. పువ్వుపై వ్రాలి, కన్నీటిని తుడిచి, ఆమెకు 'కమ్మటి కల'ను ప్రదానం చేసింది. 'కమ్మటి కల' అనటంతోనే ఇది నిజం కాబోదనీ ధ్వనిస్తోంది. ఈ కలవల్ల ఆకురాలు అడవివంటి తన జీవితానికి ఆమని వచ్చినట్లైంది.

తర్వాతి చరణంలో అంతలోనే జీవితం చెదరిన కల కావటం, ఆశలు అడుగంటటం, కోర్కెలు విఫలం కావటంతో, పరిస్థితులు అనే నది తోసుకుపోతున్న (భర్త) జీవితం అనే నావను కాపాడమని, ప్రకృతిని ప్రార్థిస్తోంది. నావ ఉండవలసిన రేవుగా తనను తాను ధ్వనిచేసుకున్న ఓ దీనురాలి ఆవేదనకు అక్షరాకృతి ఈ పాట. అనుభూతిని వ్యక్తం చేయటానికి ప్రతీకను మించిన నిర్మాణాంశం మరొకటి లేదని చెప్పదగిన ఉదాహరణగా ఈ పాటను కూడా చెప్పవచ్చు.

పదాలకున్న వస్తుసంకేత శక్తి అంటే ఆరోపిత – ఆరోపక వస్తువుల మధ్యనున్న అంతర అనుభూతి శక్తి గాఢతవల్ల ఇది మంచి ప్రతీక నిర్మాణంగల పాట అవుతుంది.

ఒక సంఘటన జరిగినపుడు, లేక ఉపద్రవం వచ్చి సమాజాన్ని అతలాకుతలం చేసినపుడు, చలనశీలత గల కవి తక్షణమే స్పందిస్తాడు. సాధారణంగా అటువంటి స్పందన ఆ సంఘటన తీవ్రతను నమోదు చేసే క్రమంగా కవిత్వమవుతుంది.

ప్రతిభావంతుడైన కవి తక్షణ స్పందనకి పరిమితం కాకుండా, సమస్యను అన్ని కోణాల్లోను తడుముతూ, మూలాల్లోకి ప్రవహించి, నైపుణ్యంతో దిద్దితీర్చితే వచ్చే కవిత్వాన్ని కొయ్యగుర్రం నిరూపిస్తుంది.

నగ్నముని కొయ్యగుర్రం దివిసీమ ఉప్పెనను దృశ్యమానం చేసిన ప్రతీకాత్మక కావ్యం. ఉపద్రవానికి బలియైన ప్రజల 'వర్గా'న్ని నిర్ధారించి దానికి కారణమైన రాజ్యాంగ దుర్మార్గాన్ని ఎండగట్టింది:

**"ఎంగిలి మెతుకులేరుకొని ఎలక్ట్రిక్ తీగల మీదా**
**ఇళ్ళకప్పుల మీదా జంతు కళేబరాలమీదా**
**అలగాజనం పుళ్ళమీదా**
**పొడుచుకు తినడానికి చేరే కాకులు మాత్రమే**
**మిథ్యగూర్చి కావుకావుమంటూ ప్రవచించగలవు"** (నగ్నముని - కొయ్యగుర్రం - పుట -1).

ఎంగిలి మెతుకులేరుకోవటం - శ్రమగుణం లేని శుష్కవేదాంతుల్ని, ఇళ్ళకప్పుల మీద అంటే బతుకు బరువు తెలీని లాలసుల్ని, జంతు కళేబరాల మీద అంటే మానవత్వం లేని నీచుల్ని, అలగాజనం పుళ్ళమీద అంటే పేదవర్గాల్ని పీడించే పెట్టుబడిదారుల్ని - సూచిస్తుంది. ఇటువంటి దుర్లక్షణాలు గల వాళ్ళకి 'కాకి' ప్రతీక అయింది.

**"బక్కటెద్దులు వెంటరాగా నాగలి బుజాన వేసుకుని**
**పొలం వెళ్ళే ప్రతి రైతు నాకు శిలువమోస్తున్న**
**జీసస్‌లా కనిపిస్తాడు"** (నగ్నముని - కొయ్యగుర్రం - పుట - 5).

భావచిత్రమే ఇక్కడ ప్రతీకగా నిలుస్తుంది. ఈ భావచిత్రం తర్వాత జీసస్ హత్య ప్రస్తావన వుంటుంది. అప్పటి 'రాజ్యం' చేసిన కుట్ర ఫలితంగా జీసస్ హత్య చేయబడతాడు. ఇక్కడ ప్రభుత్వ దుర్మార్గం, నిర్లక్ష్యం కారణంగానే ప్రజలు బలి అవుతారు. శ్రామికులకు బక్కటెద్దులు ప్రతీకకాగా, జీసస్ మానవత్వానికి ప్రతీక.

కవికి సామాజిక స్పృహ ఎంత ముఖ్యమో సాహిత్య స్పృహ కూడా అంతే ముఖ్యం. వస్తువాదులైన విప్లవ వర్గంలో ఉండి, అనుభూతి గాఢతకు చెందిన అభివ్యక్తి రూపం 'ప్రతీక'ను పండించటం విశేషం. కె. శివారెడ్డి 'ఆసుపత్రి గీతం' ప్రతీకాత్మక దీర్ఘకావ్యం. ఇందులో ఆసుపత్రి ఆధునిక భారతదేశానికి ప్రతీక. అంటే ఆసుపత్రి వాచ్యం కాగా, దేశపాలనా వ్యవస్థ వ్యంగ్యంగా ధ్వనిస్తుంది. ఆసుపత్రిలో జరిగే

కార్యకలపాలు మొత్తం దృశ్యమానమవుతున్నా - పరోక్షంలో ప్రభుత్వ వ్యవస్థలోని లోపాలు అనుభవంలోకి వచ్చి మనల్ని కదిలిస్తాయి. వస్తువే ప్రతీకలుగా మారిపోయి ఆసుపత్రి రూపాంతరం చెందటం ఇక్కడ కనిపిస్తుంది.

**"గదుల్నిండా మూలుగులు**
**ఎదల్నిండా వాగులు**
**వరండాల్నిండా తెల్లటి పెద్దబాతులు**
**పెద్ద ఎద్దు బాతులు - డక్స్**
**బోడ్లో దోపిన సంచుల్తో - ఈ తెల్లకాకులు**
**ఈ తెల్ల కంకుల్నించి పాలు పిండుతాయి**
**తెల్లదనం శాంతికి గుర్తంటారు**
**తెల్లదనం పవిత్రతకు ప్రతీకంటారు**
**నాకు మాత్రం తెల్లదనం చూస్తే**
**బాగా బలిసి కొవ్వుపట్టిన తెల్ల పిల్లులు**
**జంగు పిల్లుల స్ఫురణ"** (కె. శివారెడ్డి - ఆసుపత్రి గీతం - పుట - 7).

తెల్లబాతులు డాక్టర్లుగాను, తెల్లకాకులు నర్సులుగాను, కొవ్వుపట్టిన తెల్ల పిల్లులు, జంగు పిల్లులు - ప్రభుత్వ వ్యవస్థలోని మంత్రులుగాను రాజకీయ నాయకులుగాను - రూపించటంతో అటు పాలనా వ్యవస్థనీ ఇటు ఆసుపత్రినీ, ఒకే చోట నిలిపినట్లైంది. గదుల్నిండా మూలుగులు, ఎదల్నిండా వాగులు అంటే రోగులే పాలితులైన ప్రజలని ధ్వనిస్తోంది.

**"గద్దెలు రోగి క్షేమాన్ని తర్కిస్తున్నాయి**
**కుర్చీలు - రోగి భవిష్యత్తుని అంచనావేస్తున్నాయి**
**లాఠీలు - రోగి రోగిగానే జీవించేందుకు**
**కట్టుదిట్టంగా కాపలా కాస్తున్నాయి**
**వెళ్ళండి మేమంతా రోగి కోసమే**
**రోగి చావడని హామీ**
**రోగి లేకపోతే ఆసుపత్రి లేదు"** (కె. శివారెడ్డి - ఆసుపత్రి గీతం - పుట - 87)

ఇక్కడ గద్దెలు మంత్రులకి, కుర్చీలు అధికారులకి, లాఠీలు పోలీసు వ్యవస్థకీ ప్రతీకలు.

ఈ దేశాన్ని ఒక ఆసుపత్రిని చేసి, జన సామాన్యాన్ని రోగుల్ని చేసి, పట్టిపీడిస్తున్న ఈ మొత్తం 'తెల్ల'ని వ్యవస్థని ధ్వంసం చేయాలనే విప్లవ దృక్పథం స్పష్టంగా ఈ కావ్యంలో వుంది.

శివారెడ్డి ప్రతీకలు సాయుధపోరాటాన్ని గర్భితంగా స్వప్నమాధ్యమంలో అనుభూతికి తెస్తాయి. పొలాలు రైతుపోరాటాలకు; అడవులు, కొండలూ, కర్మాగారాలు – విప్లవ, గిరిజన, శ్రామిక వర్గాలకు ప్రతీకలు. వర్గపోరాటంలో సాయుధ పోరాటాలతో విప్లవం తప్పదని ధ్వనిస్తోంది. ఏక సూత్రతతో ఆసాంతం ప్రతీకాత్మకంగా నడచిన ఆసుపత్రి గీతం ఒక ఉత్తమ రచన. ఇక, సినారెగారి కావ్యాన్ని గురించి:-

**"జగతిని రంగస్థలంగా మార్చుకొని**
**గగనాన్ని మకుటంగా మలచుకొని**
**అందరిలో తన బింబాన్ని చూసుకుంటూ**
**అందరి ఆశయాలను తనలో శ్రుతి చేసుకుంటూ**
**నిత్య చైతన్యంతో నిలిచే మనిషి**
**నిష్క్రమణలేని పాత్రధారి**
**నిఖిల విశ్వంభరా పురోగతుల**
**నియతిని కాపాడే సూత్రధారి"** (డా॥ సి. నారాయణరెడ్డి – మట్టి – మనిషి – ఆకాశం – పుట – 102).

"మట్టి – మనిషి – ఆకాశం" ప్రతీకాత్మక దీర్ఘకావ్యం. ఇందులో సమస్త మానవజాతి పరిణామాన్ని కవిత్వీకరించటం వున్నది. తాత్విక దర్శనాన్ని పాఠకుడు అనుభవించేలా ఉన్నత స్థాయిలో తీర్చిదిద్దినదీ కావ్యం. డా॥ సి. నారాయణరెడ్డిగారి అసమాన ప్రతిభకు ఇది నిలువుటద్దం అనవచ్చు.

మనిషి నిష్క్రమణ లేని పాత్రధారి. అతడు జగతిని రంగస్థలంగా మార్చుకున్నాడు. మకుటంగా గగనాన్ని మలచుకొని ప్రతివ్యక్తిలోను తానై, తానే అంతటాఐ నిరంతర చైతన్యం కలిగివున్నాడు. మట్టి ఆకాశం అనే రెండు ప్రతీకలు తాత్విక భావనలతో కవిత్వమంతా పరుచుకున్నాయి. పాఠకుడు చదువుతున్నంత సేపు సంకేతిత అర్థస్థాయిని అధిగమించి తాత్విక లోకాల్లో విహరిస్తాడు.

వరవరరావు 'సముద్రం' ప్రజలకి, ప్రజాచైతన్యానికి ప్రతీక.

**"నేనే హోరెత్తిన సముద్రాన్ని కాకపోవచ్చు**
**నేను సముద్రం హోరును**
**నేను పోటెత్తిన సముద్రం హోరును**
**నేనే తూర్పు పడమరలను తుడిచిపెట్టే**
**ఉత్తరం దక్షిణాలను ఊడ్చిపెట్టే**

**ఉప్పెనను కాకపోవచ్చు**
**ఉప్పెనతో పెనవేసుకున్న గీతాన్ని నేను**
**ఉప్పెనకు సంకేతాన్ని నేను**
**సముద్రం నన్ను తనలో కలుపుకోవటం**
**నేను సముద్రాన్ని అని తెలుసుకోవటం"** (వరవరరావు - సముద్రం - యువ నుంచి యువదాకా - సంకలనం - పుట - 90).

ఇక్కడ సముద్రం సమాజ చైతన్యమైతే, దాని నినాదం కవి 'నేను'. విప్లవ కంఠధ్వనిగా, విప్లవంతో మమేకమై, విప్లవంతో పెనవేసుకున్నానని ప్రకటిస్తున్నాడు కవి, విప్లవ నాయకుడు.

ఈ కవితలో 'నేను' ఎన్నోసార్లు ఎన్నోవిధాలుగా మార్పులు చెందుతుంది. ఒకసారి సమాజం నుంచి విడవడి, పీడించే వ్యక్తిగా, పరోక్ష ప్రతీక చేయబడుతుంది.

సముద్ర సంక్షోభం స్వేచ్ఛ, శాంతి కోసమని; అందుకోసమే ఈ తుఫానులు సృష్టించటమనీ చెప్పడంలో, ఇక్కడ తుఫాను అంటే విప్లవమని గమనించాలి. శ్రమ సృష్టి, జీవనపోరాటం, ఎన్నో వైరుధ్యాల, వైవిధ్యాల మధ్య ఐక్యతా సూత్రం కోసం యోచన, గతితార్కిక భౌతిక పరిణామ స్పృహ వంటి అనేక అంశాల్ని తడిమిన ప్రతీకాత్మక కవిత ఇది.

అద్దేపల్లి రచించిన 'మెరపు పువ్వు'లో సముద్రం ప్రతీక. దీర్ఘకవితలోని భావ నేపథ్యమంతా నిరంతర చైతన్యదశలే. సముద్రం ఇందులో సామాజిక చైతన్యానికి ప్రతీకగా వినియోగించబడింది. ఈ కావ్యం ముగింపులో

**"పిడికిలి విప్పాను**
**తెచ్చిన వస్తువును చూశాను**
**కళ్ళు మిరుమిట్ల సముద్రాలైపై**
**సముద్రాలు వేల అలల్ని అరుస్తున్నై**
**అరుపుల్లో ఆకాశం వేగు చుక్కల్ని కురుస్తోంది**
**కురిసిన వెలుగుల వర్షం నేలై నిలిచింది**
**నేను తెచ్చిన వస్తువు పేరు 'నిత్యయౌవనం'** (అద్దేపల్లి రామమోహనరావు - మెరుపు పువ్వు - జ్వాల నుంచి మెరుపు దాకా - పుట - 291).

నిత్యయౌవనం నిరంతర చైతన్యమే. ప్రారంభంలో సంజవేళ సముద్రం దగ్గరకు వెళ్ళిన కవి, ముగింపులో వేకువవేళ వెలుగుల వర్షంలో నిలబడ్డ కవి, 'ఆకాశం

వేగు చుక్కల్ని కురవటం' అనడంలో సమాజ చైతన్యాన్ని దర్శించటానికి ప్రతీక అవుతుంది.

ఆధునిక కవిత్వానికి గొప్ప అభివ్యక్తి శిల్పంగా ప్రతీక రాణించింది. మనిషిలోని మౌలిక చైతన్యం సమగ్రతనందుకోవటానికి అనుభూతి తీవ్రతను పారదర్శకం చేయటానికి ప్రతీక గొప్ప సాధనమవుతుంది. ప్రతీక ప్రసిద్ధమైతే వెంటనే అందుతుంది. అలాకాకుండా తన మనస్సులో భావాలకు తనవైన ప్రతీకలు వేస్తూపోతే తన కర్థమవుతుందిగానీ, మరొకరికి అర్థం కాదు. అయినా "ప్రతీకలో వున్న ఆకర్షణ ఎలాంటిదంటే, ఏదో ఉందనిపించటంలో కూడా ఒక అస్పష్ట అనుభూతి ఉంటుంది" అంటారు డా॥ అద్దేపల్లి.

బలమైన నేపథ్యంతో అనుభూతిశక్తిచేత సాక్షాత్కారించే ప్రతీక ఆధునిక కవిత్వంలో ప్రధానమైన స్థానం పొంది, అన్ని భావనేపథ్యాలు గల కవుల చేత శిరసావహింపబడుతోంది.

*(సంపూర్ణం)*



# 'పఠాభి' గారితో నా పరిచయం

## – ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

*(గత సంచిక తరువాయి)*

పఠాభిగారు ఎప్పుడూ నిశ్చలంగా ఒక యోగిలా ఉండేవారు. అందుకే డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు ఆయనను గురించి కవిత వ్రాసి, దానికి "అంటీముట్టని బంగారం" అనే సార్థకమైన శీర్షిక ఉంచారు. ఆయన గొప్ప శ్రీమంతులయింట పుట్టారు. ప్రేమవివాహంవల్ల తండ్రికి దూరమయ్యారు. ఆస్తికీ దూరమయ్యారు. సినిమాలు తీసి ఎక్కువగా నష్టపోయారు. అమాయకత్వంవల్ల ఆయన్ని ఎందరో మోసం చేశారు. పర్యావరణాన్ని గురించి "దేవరకాడు" అనే గొప్ప కన్నడ సినిమా తీశారు. దానికి "రాష్ట్రపతి బంగారు పతకం" వచ్చింది. దానిని దూరదర్శన్‌లో ప్రదర్శించారు. నేను ఒకసారి, "దేవరకాడును దూరదర్శన్‌లో ప్రదర్శించడంవల్ల మీరు ఖర్చుచేసిన డబ్బు మీకు వచ్చేసిందనుకుంటాను" అన్నాను. 'నేను ఆ సినిమాకు ఆరు లక్షలు ఖర్చు చేశాను. దూరదర్శన్ వారు నాకు మూడు లక్షలు

ఇచ్చారు'' అన్నారు పఠాభిగారు. అంతేకాదు, ఆయనకు తెలియకుండా ఆ సినిమాను విదేశాలలో ఒకడు రిలీజ్ చేసి డబ్బు చేసుకున్నాడని చెప్పారు. ''ఎన్‌టిఆర్‌తోను, ఎఎన్ఆర్‌తోను మీరు తీసిన శ్రీకృష్ణార్జునయుద్ధం సక్సెస్ అయింది కదా! డబ్బులు వచ్చాయి కదా!'' అన్నాను నేను. ''ఆ డబ్బులన్నీ భాగ్యచక్రం సినీమాలో పోయాయి!'' అన్నారు పఠాభిగారు. 'సంస్కార' సినిమాకు బంగారుపతకం రావడం చాలాగొప్పవిషయం. ఇది సత్యజిత్‌రే తీసిన 'పథేర్ పాంచాలి' తో పోటీపడి నెగ్గింది. (పఠాభిగారు మద్రాసులో కె.వి.రెడ్డిగారితో కలిసి 'పెళ్ళినాటి ప్రమాణాలు' – 'శ్రీకృష్ణార్జున యుద్ధం' – 'భాగ్య చక్రం' సినిమాలు తీశారు. బెంగుళూరులో 'సంస్కార' – 'చండమారుత' – 'శృంగారమాస' – 'దేవరకాడు' సినిమాలు తీశారు.)

నేను 1986 నుండి ''చైతన్యకవిత'' అనే కవిత్వపత్రికనూ, 1994 నుండి ''శ్రీరస'' (శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య) అనే సాహిత్యసంస్థనూ నడుపుతున్నాను. ఈ రెండింటితోను పఠాభిగారికి సన్నిహిత సంబంధం ఉంది. చైతన్య కవితకు పఠాభిగారు గౌరవాధ్యక్షులు. 19 & 20 సంయుక్త సంచిక (April & July 1995) ముద్రణ వ్యయాన్ని పఠాభిగారు భరించారు. శ్రీరస నిర్వహించిన అనేక సాహిత్య సభలకు ముఖ్యఅతిథిగా విచ్చేసి, చైతన్యకవిత నూతన సంచికలను, ఇతర కవిమిత్రుల గ్రంథాలను ఆవిష్కరించారు. నా కోరికపై బెంగుళూరులోని కవులను కవయిత్రులను తన చేతులమీదుగా సత్కరించారు. 2004, 2005, 2006 సంవత్సరాలలో పఠాభిగారు పాల్గొన్న శ్రీరస సాహిత్యసభల విశేషాలను ప్రస్తావిస్తాను:–

2004 ఆగస్టు 15వ తేది భారత స్వాతంత్ర్యోత్సవ దినంనాడు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగుఅధ్యయన శాఖవారు – శ్రీరసవారు కలిసి ఒక ఆధునిక సాహిత్య సభను నిర్వహించారు. ఈ సభకు పఠాభిగారు ముఖ్య అతిథిగా విచ్చేశారు. ప్రసిద్ధ దిగంబరకవి నగ్నముని, ఆచార్య ఆర్వీయస్. సుందరం, శ్రీ వాడ్రేవు చినవీరభద్రుడు – విశిష్ట అతిథులుగా ఈ సభలో పాల్గొన్నారు. శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబుల సమకాలికుడైన ప్రయోగవాదకవి పఠాభిగారిని ఆచార్య సుందరం సభకు పరిచయం చేశారు. పఠాభిగారు హైదరాబాద్‌లో కాకుండా బెంగుళూరులో ఉండటం వల్లా, సినిమా నిర్మాణరంగంలో కూడా అడుగుపెట్టడంవల్లా, వీరికి కవిగా రావలసినంత పేరు రాలేదన్నారు. నిజమైన ఆధునికకవిత్వం పఠాభిగారితోనే ప్రారంభమయిందని అన్నారు. 85 సంవత్సరాలు నిండిన పఠాభిగారిని శ్రీరసపరంగా శ్రీ కె.పి.రావుగారు సత్కరించారు. శ్రీ 'వాసు' (శ్రీ న్యాయపతి శ్రీనివాసరావు)

రచించిన "కాసేపు" అనే కవితా సంపుటిని పఠాభిగారు ఆవిష్కరించారు. అలాగే ఈ సభలో ఆచార్య ఆర్వీయస్. సుందరం కన్నడంనుండి అనువాదంచేసిన శ్రీ అరవింద మాలగత్తి రచన - "చండాల స్వర్గారోహణం" అనే కావ్యాన్ని, శ్రీ కె. శ్రీనివాసమూర్తి రచించిన "ఊహల ఒడిలో...." అనే కవితా సంపుటిని, నేను వెలువరించిన "చైతన్య కవిత - 38 & 39 సంయుక్త సంచికను (స్వభాను శరత్తు - తారణ వసంతం: October 2003 & April 2004) పఠాభిగారు ఆవిష్కరించారు. తరువాత శ్రీరస కవులను కవయిత్రులను సత్కరించారు. (2004 డిసెంబరు చివరివారంలో బెంగుళూరులో జరిగిన ప్రపంచ తెలుగు సమాఖ్య (WTF) సభలలో పఠాభిగారు సత్కరింపబడ్డారు.)

ప్రముఖ అభ్యుదయ సాహిత్యవేత్త శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావుగారు 2005 జనవరి నెలలో "కవితా తరంగాలు" అనే పేరుతో బెంగుళూరులో ఉన్న కవుల కవయిత్రుల కవితలతో ఒక సంకలనం వెలువరించారు. దీనిని పఠాభిగారికి, సోమసుందర్‌గారికి అంకితమిచ్చారు. శ్రీరసవారు, బెంగుళూరు అరసంవారు కలసి మార్చి 6వ తేదిని మల్లేశ్వరంలోని గాంధీ సాహిత్యసంఘంలో ఆవిష్కరణ సభను ఏర్పాటుచేశారు. దీనికి పఠాభిగారు ముఖ్యఅతిథిగా విచ్చేశారు. 'కవితా తరంగాలు'తోపాటు శ్రీ వై. ముకుంద రామారావుగారు రచించిన "ఎవరున్నా లేకున్నా..." అనే కవితా సంపుటిని, నేను వెలువరించిన "చైతన్య కవిత" - 40వ సంచికను (తారణ శరత్తు, October 2004) పఠాభిగారు ఆవిష్కరించారు. పఠాభిగారు మాటలాడుతూ, కవులు ఎవరినీ అనుకరించకుండా, స్వతంత్రంగా ఆలోచించి కవితలు వ్రాయాలని హితవు చెప్పారు. 19-2-2005 నాటికి 86 సంవత్సరాలు పూర్తిచేసుకున్న పఠాభిగారిని శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావుగారు సత్కరించారు.

2005 డిసెంబరు నెలలో "చైతన్య కవిత" - 41 & 42 సంయుక్త సంచిక (పార్థివ వసంతం - శరత్తు : April & October 2005) ను సిద్ధం చేశాను. యథాప్రకారం పఠాభిగారిచే ఆవిష్కరింపజేయాలని భావించాను. అప్పటికే పఠాభిగారు మైసూరులో ఒక హోటలుగదిలో కాలుజారి పడ్డారనీ, ఒక చట్ట దెబ్బతిన్నదనీ, ఇంట్లో కఱ్ఱతో నడుస్తున్నారనీ మిత్రులు జోళదరాశి చంద్రశేఖరరెడ్డిగారు చెప్పారు. అయినాసరే పఠాభిగారిచేతనే, వారియింట్లోనే చైతన్యకవితను ఆవిష్కరింపజేయాలని నిశ్చయించాను. చంద్రశేఖరరెడ్డిగారిని పంపి, పఠాభిగారితో మాటలాడించాను. ఆయన అంగీకరించారు. 14-1-2006నాడు "సాహిత్య సంక్రాంతి" అనే సభను పఠాభిగారి యింట్లో జరిపాము. సాయంత్రం 6

గంటలనుండి రాత్రి 8 గంటల వరకు సభ చాలా అందంగా జరిగింది. కవులు, కవయిత్రులు ఈ సభలో సంతోషంగా పాల్గొన్నారు. వీరందరికీ పఠాభిగారు, ఆయన కుమార్తె శ్రీమతి నందనగారు, అల్లుడు శ్రీ వి.కె. హరీంద్రగారు రుచికరమైన చక్కటి విందును ఏర్పాటుచేశారు. అంతేకాదు, పఠాభిగారు సభ జరిగిన రెండు గంటలసేపూ ఎంతో ఉత్సాహంగా కూర్చుని సాహిత్య కార్యక్రమాన్ని చూచి చాలా ఆనందించారు. నూతన చైతన్య కవితను ఆవిష్కరించారు. ఈ సంచికను అంకితం పొందిన శ్రీ జె.ఎస్. రెడ్డిగారిని, శ్రీమతి అరిపిరాల సువర్ణగారిని, శ్రీ చిలకల వెంకట సుబ్బారెడ్డిగారిని, శ్రీ జోళదరాశి చంద్రశేఖరరెడ్డిగారిని శాలువాలతోను, పుష్పమాలల తోను సత్కరించారు. ఈ సందర్భంగా, తెలుగు నుండి అనేక నవలల్ని, కథల్ని కన్నడంలోకి అనువదించిన శ్రీమతి టి.ఎస్. రుక్మాయిగారిని కూడా పఠాభిగారు సన్మానించారు. ప్రముఖ రంగస్థలనటుడు, 'గానకోకిల' బిరుదాంకితుడు శ్రీ దర్శి లక్ష్మీవేంకటేశ్వర వరప్రసాదరావు పంతులుగారు కూడా సాహిత్య సంక్రాంతిలో పఠాభిగారిచే గౌరవింపబడ్డారు. 19-2-2006 నాటికి 87 సంవత్సరాలు నిండబోతున్న పఠాభిగారిని ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ జె.ఎస్. రెడ్డిగారు ఘనంగా సన్మానించారు. "శ్రీరస" - "చైతన్య కవిత" ల పరంగా ఈ సన్మానం జరిగింది. ఇదే పఠాభిగారు పాల్గొన్న మా ఆఖరి సాహిత్య సభ! ఆ రోజు నేను కప్పించిన శాలువాతోనే రాత్రి 11 గంటలకు ఊతకర్రతో మెల్లగా నడుస్తూ తన పడకగదిలోకి నిష్క్రమించారు. వెనుకనుండి ఆయనను నేను తదేకంగా చూశాను. మనసులో ఏదో దిగులు కలిగింది.

2006 మార్చి 9వ తేదీని పఠాభిగారు తిరిగి ఇంట్లో జారిపడ్డారు. రెండవ చట్ట విరిగింది. దానికి పెద్ద ఆపరేషన్ జరిగింది. పఠాభిగారు కదలలేని స్థితికి చేరుకున్నారు. ఏప్రిల్ 23, 2006నాడు (ఆదివారం సాయంత్రం 4.30 గంటలకు) నేను వారి యింటికి వెళ్ళాను. సంక్రాంతి సాహిత్య సభ (14-1-2006 నాటిది) లో తీసిన ఫోటోలు వారికి చూపించాను. చూశారు. చాలా మగతగా ఉన్నారు. కాని బాగానే మాటలాడారు. ఆ మగత, మాత్రల ప్రభావమని పనివాళ్ళు చెప్పారు. కుర్చీలో కుర్చున్న పఠాభిగారు, మంచంమీద పడుకుంటానన్నారు. ఇద్దరు పనివాళ్ళు సాయం చేయగా నేను వారిని మంచం మీద పడుకోబెట్టాను - "ఇవి వారి చివరి రోజులేమో! తిరిగి కోల్కోరేమో!" అని మనస్సులో అనిపించింది. మిత్రులు జోళదరాశి చంద్రశేఖరరెడ్డిగారు కూడా ఈ పరిస్థితిలో ఉన్న పఠాభిగారిని రెండుసార్లు దర్శించారు. నాకు ఫోను చేసి "బహుశః his last days !" అన్నారు. మన బంధు మిత్రులు ఎంతకాలం బ్రతికినా ఇంకా బ్రతకాలనే ఉంటుంది మనకు. కాని యముడు నిర్దయుడు కదా! ఆఖరికి ఆ కఠోరవార్త మే 6వ తేదీ శనివారం ఉదయం

చంద్రశేఖరరెడ్డిగారి నోటనే వినవలసి వచ్చింది! పఠాభిగారు 87 సం॥లు ఆరోగ్యంగా బ్రతికిన పూర్ణపురుషుడు! ఒకసారి నేను వేసిన ప్రశ్నకు 'నేను లోకానికి చెప్పదలచిన దంతా చెప్పేశాను! ఇంక చెప్పడానికి నా దగ్గర ఏమీ లేదు!'' అని సమాధాన మిచ్చారు.

పఠాభిగారికి పొగడ్తలు అంటే ఇష్టం ఉండేది కాదు. సభలో తనను గురించి, తన కవిత్వం గురించి వక్తలు మాటలాడుతుంటే, కుర్చీలో చాలా ఇబ్బందిగా కూర్చొనేవారు. 6-3-2005 నాటి సభలో సుందరం ఆధునిక కవిత్వంలో పఠాభిగారి స్థానాన్ని గురించి చెపుతున్నాడు. నా ప్రక్కనే కూర్చున్న పఠాభిగారు నాతో : ''ఇదేమిటీ? నన్ను గురించి చెపుతున్నారు? గ్రంథావిష్కరణ సభ అని చెప్పారు కదా! ఇలా అని తెలిస్తే నేను రాకపోయేవాడిని!'' అన్నారు. పఠాభిగారి కవిత్వాన్ని గురించి పరిశోధన చేసిన ''శిఖామణి'' (డా॥ కత్తి సంజీవరావు)గారి చేత ఒక ఉపన్యాసం చేయించాలనీ, పఠాభిగారి పుట్టినరోజున (ఫిబ్రవరి 19వ తేది) ఒక కవిని ఆయన పేరుతో సత్కరించాలనీ నేను చాలా ప్రయత్నించాను. కాని పఠాభిగారు అంగీకరించలేదు. 'నేను అసలు పుట్టినరోజే చేసుకోను కదా!'' అన్నారు. పఠాభిగారి అమ్మాయి శ్రీమతి నందనగారు కూడా, తండ్రి బ్రతికి ఉండగానే ''పఠాభి అవార్డు'' ఇవ్వడానికి అంగీకరించారు. దీనిని నేనూ చంద్రశేఖరరెడ్డిగారూ ఆచరణలో పెట్టాలని అనుకుంటూ ఉండగానే పఠాభిగారు పరమపదించారు. (''ఏ నిమిషానికి ఏమి జరుగునో ఎవరూహించెదరు?'' అనే చలనచిత్ర గీతం జ్ఞప్తికి వస్తోంది.)

పఠాభిగారి యింట్లో జరిగిన ''సాహిత్య సంక్రాంతి'' సభ ప్రారంభంలో వారు నన్ను చూపెడుతూ - ''ఎప్పుడూ సుబ్బారావుగారు నాకు ఎన్నో పుస్తకాలు బహూకరిస్తూ ఉంటారు. ఈ సారి నేను వారికొక పుస్తకాన్ని బహూకరిస్తున్నాను'' అని చెప్పి, పి.వి. నరసింహారావుగారు ఆంగ్లంలోకి అనువదించిన జయప్రభగారి కవితా సంపుటి - "Unforeseen Affection and Other Love Poems" అనే గ్రంథాన్ని బహూకరించారు. అంతేకాదు, అందులో పఠాభిగారు స్వహస్తాలతో ఈ క్రింది విధంగా వ్రాశారు (ఈసారి తెలుగులో):-

**''తెలుగు సంస్కృతికి, బెంగుళూరులో ఎనలేని సేవ చేయుచున్న శ్రీ తంగిరాల సుబ్బారావుగారికి సంక్రాంతి శుభాకాంక్షలతో....''**

**పఠాభి**

14-1-2006 2724, New Tippa Sandra
Main Road, బెంగుళూరు - 560 075

దీనిని గొప్ప కానుకగా స్వీకరించాను. వారి మరణం తరువాత దీని విలువ మరింత పెరిగింది...! (జనవరి నెలలో ఈ సంఘటన జరిగింది. నాలుగు నెలలు తిరక్కుండానే వారు అనంతలోకాలకు వెళ్ళిపోయారు.)

మహానగరాలలో ఉద్యోగాలు చేసుకొనేవాళ్ళు అద్దెకొంపల్లో ఉండక తప్పదు. ఆ అద్దెకొంపల యజమానులు (house owners) నూటికి తొంభైతొమ్మిదిమంది అద్దెకున్నవారిని (tenants ను) నక్షత్రకుడిలా నానా హింసలూ పెట్టడం పరిపాటి. అయితే కొందరు అదృష్టవంతులైన తెలుగు కవులు అద్దెకొంపల్లో ఏండ్ల తరబడి సొంతయింటిలో ఉన్నంత హాయిగా ఉన్నారు. మద్రాసు మహానగరంలో టి.నగర్‌లో, శివప్రకాశ్ మొదలి వీథిలో నెం.1 ఇల్లు ఉంది. ఆరుద్రగారు కె. రామలక్ష్మిగారిని వివాహం చేసికొని ఆ యింట్లో దిగారు. అంతే ఆ దంపతుల జీవితమంతా ఆ యింటిలోనే గడచిపోయింది. ఆరుద్రగారు చనిపోయేవరకూ ఆ యింటిలోనే ఉన్నారు. అంటే ఆ గృహయజమాని అంత సౌమ్యుడు, గొప్పవాడు అని అర్థం. పఠాభిగారుకూడా అటువంటి అదృష్టవంతుడే! ఆయన ఎన్నో ఏండ్ల క్రిందట మద్రాసు నుండి బెంగుళూరు వచ్చి, సెయింట్ మార్క్స్ రోడ్డులో, ఇండియా గ్యారేజ్ హౌస్‌లో ఉన్న నెం. 58 ఇంటిలో స్నేహలతగారితో కలిసి ప్రవేశించారు. అంతే, ఇంచుమించు జీవితమంతా ఆ యింటిలోనే గడిపివేశారు. ఇప్పుడు వారి అబ్బాయి కోణార్క కూడా ఆ యింటిలోనే ఉంటున్నాడు. ఇంటి నెంబరు 58 మాత్రం 23గా మారింది. అంతే తేడా! అది మహాత్మాగాంధీ రోడ్డుకు దగ్గరగా మంచి సెంటర్‌లో ఉంది. పఠాభిగారు ఆ యింటిలో ప్రవేశించినపుడు ఆ యింటికి అద్దె కనీసం రూ.లు 300 ఉండాలి. (ఇప్పుడయితే 8-10వేలు ఉంటుంది.) కాని పఠాభిగారు 50రూ.లకు ప్రవేశించారు. ఎన్ని సంవత్సరాలయినా పఠాభిగారు ఆ యింటిలోనే ఉంటున్నారు. నాకు అనుమానంవచ్చి "ఇది మీ సొంతయిల్లా?" అని అడిగాను ఒకసారి. "కాదు, అద్దెయిల్లే!" అన్నారు. నేను ఆశ్చర్యపోయాను! అద్దె తెలిసికొని మరింత ఆశ్చర్యపోయాను! అప్పుడు ధర్మరాజువంటి ఆ గృహయజమాని కథను చెప్పారు పఠాభిగారు:-

ఈ కథ వినే ముందు, బెంగుళూరులో ఉండే పరమకిరాతకులైన అద్దెకొంపల యజమానుల్ని గురించి కొంచెం తెలుసుకోవాలి. బొంబాయి, ఢిల్లీల తరువాత దారుణంగా అద్దెలు (బాడుగలు) వసూలు చేసే ఊరు బెంగుళూరు. సాధారణమైన ఇంటికి 5వేల నుండి 10వేల వరకూ బాడుగ అడుగుతారు. దానికి పదిరెట్లు అడ్వాన్స్ ఇవ్వాలి. ప్రతి రెండు సంవత్సరాలకూ 10% అద్దె పెంచాలి. Software Engineers వచ్చాక బెంగుళూరులో అద్దెలు చుక్కలను తాకుతున్నాయి.

సదాశివనగర్, ఇందిరానగర్ వంటి posh areas లో నెలకి లక్షరూపాయల అద్దె కూడా వసూలు చేస్తున్నారు. కాని పఠాభిగారి ఇంటి ఓనరు అపర ధర్మరాజు! ఆయన ఇంటిలో ఐదారు వాటాలు ఉన్నాయి. "ఒక్కొక్కవాటాకు 50 రూపాయల అద్దె. అడ్వాన్సు లేదు. ఎన్ని సంవత్సరాలయినా అద్దె పెంచకూడదు. ఆ యింటిలోని వారిని ఖాళీ చేయమని అడగకూడదు" అని వీలునామా వ్రాసి మరీ చనిపోయాడు ఆ మహానుభావుడు! ఆయన (పేరు 'గురుస్వామి' కాబోలు) కొడుకులు - మనుమలు ఇప్పటికీ అలాగే అద్దె తీసుకుంటున్నారు. వారిని చూచి అద్దెకున్నవారు జాలిపడి స్వచ్ఛందంగా అద్దెను కొంచెం కొంచెం పెంచుతూ వచ్చారు. నేను పఠాభిగారిని ప్రశ్నించే నాటికి వారు 150రూ.లు బాడుగ చెల్లిస్తున్నారు. కొందరు tenants ఆ వాటాలను కొనుక్కున్నారు కూడా.

శ్రీశ్రీగారు మద్రాసులో "కెనాల్ బ్యాంక్ రోడ్డు"లో అద్దెకు ఉండేవారు. సోమసుందర్ గారు శ్రీశ్రీని గురించి ఒక కవిత వ్రాసి, దానికి "కెనాల్ బ్యాంక్ రోడ్డు" అని నామకరణం చేశారు. అలాగే పఠాభిగారిని గురించి కవిత వ్రాస్తే, దానికి "సెయింట్ మార్క్స్ రోడ్డు" అని పేరు పెట్టాల్సి ఉంటుంది. ఇటీవలి కాలంలో శ్రీమతి నందనగారు ఇందిరానగర్‌లో "న్యూ తిప్పసంద్ర మెయిన్ రోడ్డు"లో సొంత యిల్లు కట్టుకున్నాక, పఠాభిగారు పగలు కుమారుడైన కోణార్క్ దగ్గర, రాత్రి కూతురు ఇంటి దగ్గర ఉంటూ వచ్చారు.

పూర్వం తెలుగు సాహిత్యవేత్తలు వివిధ పట్టణాలలో ఉండేవారు. బెజవాడలో విశ్వనాథ; గుంటూరులో జాషువా, జంధ్యాల; విశాఖపట్టణంలో రావిశాస్త్రి; విజయనగరంలో నారాయణబాబు; రాజమండ్రిలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి; బందరులో పింగళి-కాటూరి, కవిపాదుషా పువ్వాడ శేషగిరిరావు, కడపలో పుట్టపర్తి నారాయణాచార్యులు, గడియారం శేషశాస్త్రి, వరంగల్లులో కాళోజీ - ఇలా ఉండేవారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత కవులు, కళాకారులు, పండితులు అందరూ హైదరాబాద్ చేరుకున్నారు. కొందరు ఆంధ్రప్రదేశ్ బయటనే ఉండిపోయారు. మద్రాసు పేరు చెప్పగానే నిన్న మొన్నటి వరకూ కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, ఆరుద్ర జ్ఞాపకం వచ్చేవారు. అలాగే బెంగుళూరు పేరు చెప్పగానే రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, పఠాభిగారు జ్ఞప్తికి వచ్చేవారు. బెంగుళూరు వచ్చిన సాహిత్య ప్రియులైన ఎందరో మిత్రులకు నేను పఠాభిగారిని పరిచయం చేశాను.

"ఫిడేలు రాగాల డజన్" - "నీలగిరి నీలిమలు" - "కయిత నాదయిత" - "పఠాభి పన్‌చాన్‌గం" - ఇవి పఠాభిగారి కవితా సంపుటాలు. వీటిలో "నీలగిరి

నీలిమలు'' మొదట పఠాభిగారే స్వయంగా ప్రత్యేక సంపుటిగా ముద్రించారు. తరువాత దీనిని ''కయిత నాదయిత''లో కలిపివేశారు. (ఇక్కడ ''కయిత నాదయిత''ను గురించి నాదొక ఫిర్యాదు ఉంది. క్రీ.శ. 15వ శతాబ్దంలో పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు అనే కవి ''శృంగార శాకుంతలము'' - ''సారంగధర చరిత్ర'' అనే కావ్యాలు వ్రాశాడు. ఆయన ''వాణి నారాణి'' అని అన్నాడని చెపుతారు. ఆ ప్రభావంతోనే పఠాభిగారు కూడా ''కయిత నాదయిత''' అని ఉండాలి. గుఱ్ఱం జాషువాగారు కూడా ''నను వరించిన శారద లేచిపోవునే!'' అని అన్నారు. అంటే ఈయన దృష్టిలో కూడా సరస్వతి తన భార్యయే! ప్రాచీనకవి అయినా, ఆధునిక కవి అయినా ఇలా అనడం నా దృష్టిలో చాలా అనౌచిత్యం. సరస్వతిని మనం తల్లిగా పూజిస్తాము. ఆమె చదువుల తల్లి. కవిసార్వభౌముడైన శ్రీనాథమహాకవి కూడా ''సరస సద్గుణ నికురంబ శారదాంబ!'' అని శారదను తల్లిగానే భావించాడు.)

పఠాభిగారికి 75 సం.లు నిండినప్పుడు, హైదరాబాద్‌లో ఉన్న వారి ఆప్తమిత్రులు, సోషలిస్టు నాయకులు శ్రీ రావెల సోమయ్యగారు పఠాభిగారి రచనలన్నింటినీ ముద్రించి, సాహిత్య ప్రియులకు మహోపకారం చేశారు. ఆచార్య ఆర్వీయస్. సుందరంగారు పఠాభిగారి ''ఫిడేలు రాగాల డజన్'' ను కన్నడంలోకి అనువదించారు. దీనికి శ్రీ యు. ఆర్. అనంతమూర్తిగారు పీఠిక వ్రాశారు. హైదరాబాద్‌లో ''జయంతి'' పత్రిక సంపాదకులు డా॥ వెలిచాల కొండలరావుగారు ఈ కావ్యాన్ని "Poetry Pattabhic" అనే పేరుతో ఆంగ్లంలోకి అనువదించారు. దీని ఆవిష్కరణసభ బెంగుళూరులో రవీంద్రభారతిలో జరిగింది. పఠాభిగారితోపాటు డా॥ ఉండేల మాలకొండారెడ్డిగారు, నేను ఆ సభలో పాల్గొన్నాము. కొండలరావుగారు దీనిని ఇప్పుడు తిరిగి ముద్రిస్తున్నారు.

ఇటీవల ఒంగోలులో ఉన్న సాహిత్య రసికులు, ప్రకాశంజిల్లా రచయితల సంఘం అధ్యక్షులు, న్యాయవాదులు అయిన శ్రీ బి. హనుమారెడ్డిగారు ''ఫిడేలు రాగాల డజన్'' తిరిగి ముద్రించారు. నేడు పొట్టి శ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయంలో (హైదరాబాద్) అసోసియేట్ ప్రొఫెసర్‌గా ఉన్న డా॥ కట్టి సంజీవరావుగారు ('శిఖామణి'గారు) తమ డాక్టరేట్ డిగ్రీ కోసం పఠాభిగారి రచనలను గురించి పరిశోధన చేశారు. (వీరి సిద్ధాంత వ్యాసానికి నేను, మిత్రుడు ప్రొ॥ ఆర్వీయస్. సుందరం న్యాయనిర్ణేతలుగా వ్యవహరించాము.) వీరి సిద్ధాంతగ్రంథం ముద్రణదశలోనే నిలిచిపోవడం దురదృష్టకరం! శిఖామణిగారు సాధ్యమైనంత త్వరలో దీనిని వెలుగులోకి తీసికొని వస్తారని ఆశిస్తున్నాను.

పఠాభిగారి పేరుతో ఏటేటా ఒక కవిని సత్కరించవలసిన బాధ్యత వారి కుమార్తె శ్రీమతి నందనగారిపైనా, కుమారుడు శ్రీ కోణార్కపైనా ఉన్నది. నేను కూడా ఈ విషయంలో వారికి నా సంపూర్ణ సహకారాన్ని అందిస్తాను............

*(సంపూర్ణం)*



ఉమర్ ఖయాం రుబాయత్‌లకు అనువాదం:

# స్వర్గావతరణమ్

– కీ.శే. బీర్నీడి విజయదత్తు

## ప్రథమ సంధ్య

*(గత సంచిక తరువాయి)*

అంటి అంటని స్వప్నమటు! పయింబయి వీచు
చిఱుగాలి చిన్నారి కెరటమువలె!
తొణకిపోయినది కమ్మని హాయి! ఒక రేయి!
పిడిబాకువలె ప్రొద్దుపొడిచి క్రుంకె!
మఱి ఒక్క రాత్రి – నిద్దుర నీలితెర మూయు!
కాలమెవ్వని చేతి కీలుబొమ్మ?
ఒడలిపట్టున గుండె గడియారమాడు నం
దాక నే నింత సంతాపపడను!

తేలిపోయిన మధురక్షణాల కొఱకు
కలలు కనలేను! రానున్న గడియకొఱకు
కలతపడబోను! గుండెలు పులకరింప
ఒక మధుపాత్ర! ఎదుట నీవున్న చాలు!! 46

ఎండిన మ్రోడువంటి బ్రతుకే ఒక నందన పుష్పవాటిగా
పండి, పరీమళింప మధుభాండము తెమ్మిటు! మాధురీ కళా
ఖండము జీవితమ్ము సుడిగాలికి నూగిసలాడు దీప, మి
ట్లుండుట యెంతకాలము? కృశోదరి! యౌవన మాఱిపోయెడున్! 47

ఆనందోత్సవమాచరించితిమి! నిత్యమ్మీ సుధాపాత్రతో
కానీ–ఆశలు చావలేదు మనకింకన్! పుష్పహాసోదయ
శ్రీనిండార వసంతకన్య గయిసేసెన్ క్రొత్త శృంగారముల్
ప్రాణమ్మాఱినదాక సౌఖ్యరస మాస్వాదింత మాత్మప్రియా!! 48

పువ్వులతోటలో నిలచిపోయి యెడారులలోని గాథలన్
త్రవ్వకు, మీ వసంత మధుర క్షణముల్ వ్యయమౌనొ యేమొ ఆ
నవ్వుల పువ్వులన్ పఱచి–నా నులివెచ్చని గుండెమీద – నీ
జవ్వన మారవోయుమిక సాఖి! సుఖించెద సుప్రశాంతిగా!! 49

వేదనలన్నియున్ తగులబెట్టుము ఆమని పూలమంటలో
రా! దరహాసముల్ పెదవి రాగిల – పాత్రిక నింపి తెమ్ము! ప్రే
మోదయమైన ఈ బ్రతుకు ఒక్క వసంతము పాటి, దోరసో
న్మాదిని! వ్యర్థతాత్విక విమర్శలు సేయకు! త్రావు మత్తుగా! 50

కమ్మని పైరగాలి మొలకల్! నులివెచ్చని సంజప్రొద్దు! మే
ఘమ్ములమీది యెఱ్ఱనిపొగల్! జతగూడి అపూర్వమైన లో
కమ్ము నెదో సృజించె మనకట్టెదుటన్ ప్రియురాల! రమ్ము పా
త్రమ్మును నింపుకొందము సుధామధుధారల, మేనుపొంగగా! 51

తొలకరించిన నఖిల వస్తువుల మీద
ప్రకృతి సంతోష బాష్పధారలు! మనుష్య
హృదయ పరితాపములు చూచి పెదవి విఱచి
నవ్వుచున్నది అపర సంధ్యాకుమారి! 52

పున్నమి వెన్నెలల్ విసరిపోసెను చల్లని చందమామ – లే
వెన్నవలెన్ కరంగె పృథివీవలయ, మ్మమృతమ్ము పొంగిన
ట్లున్నది నా మనస్సరసిలో! రసపాత్రికనింపు! కోరికల్
క్రొన్ననలెత్తగా తడుపుకొందము బీటలువాఱు గుండెలన్! 53

వింటివో! లేదొ! కాలగంభీరవాణి
జీవితానంద మధురిమ చెఱిపివేయు

మృత్యుదేవత తన పుక్కిలింతలోన
కూర్చుకొనె నిప్పుడే కాలకూట విషము! 54

అమృతమయ కౌముదీమూర్తి అర్ధరాత్రి!
బుల్బులులపాట! ఆమని పులకరింత!
దొరక దికమీద ఇంత సుందర నిశీథ!
మోసఖీ! రమ్ము! తెమ్ము! ద్రాక్షాసవమ్ము! 55

బ్రతుకొక ఆపరాని పడవై, సుఖదుఃఖపు నిండు టేటిలో
ప్రతినిమిషమ్ము ముందడుగు వైచెడు – నే సుడిగుండమూపులో
గతిచెడునో సఖీ! ప్రియుని కౌగిట వ్రాలుము – రేపు లేదు నా
మతమున! వెళ్ళిపోయెడిని మౌనముగా – సుఖమిచ్చు రాత్రియున్! 56

శ్రమపడి తప్పత్రాగిన మజా అగుపింపదు కైపుతగ్గ పూ
ర్వమువలె నీరసింతు! నొకపాటి వివేకము మేవనున్నచో
అమరదు కోరినంత ఫల, మా యిరుతీరుల కందియుండకీ
అమృతము త్రావెదన్! బ్రతుకునందొక వింత సుఖమ్ము చూచెదన్! 57

ఓసి! విలాసినీ! హృదయమూఱడ దీయొక పాత్రతోనె, నా
దోసిలి క్రుంగ పోయుము – కదుష్ణ సుధాసవ మేకధారగా!
ఆ సుమమంజరుల్ పఱచి అత్తరుపోసిన శయ్యగూర్చు! క
న్మూసెద నొక్క ప్రక్క మధుపూరము! నీవొక ప్రక్క వ్రాలగా!! 58

ఒక్కొక చుక్క మాటుపడుచున్నది! దేహములోని రక్తపుం
జుక్కలవోలె! పుష్పవని నుండి వసంతకుమారి యట్లు నీ
ప్రక్కకు మళ్ళెడిన్ ప్రణయభాగిని, ఈ యవకాశమెన్నడున్
చిక్కదు చేయిజాఱునెడ! స్నేహితుడా! ఇపుడే సుఖింపరా! 59

ఈ యుద్యాన సరోవరమ్ము దరిగా – ఈ పూలపందిళ్ళలో –
ఈ యానంద వసంతరాత్రములలో – ఏకాకివై యుంటివే
మోయీ! ప్రేయసి ప్రక్క నీ తనువు విద్యుత్తంత్రియై మ్రోగ, దుః
ఖాయాసమ్ము నొకింత తీర్చుకొనరాదా పానపాత్రమ్ముతో? 60

ఈ సుఖము పాపమని యేవగించుకొనము
చావుమాత్రము నీ మీద జాలిపడదు!
కాలరాక్షసి రక్తహస్తాల మఱక
సరస మధుధార పరిశుద్ధ పఱుపరాదొ? 61

ఎచ్చట ఏ నిమేషమున - ఏ అనుభూతికి నందకుండగా
చచ్చెదవోగదా! తెలియజాలవు; మిన్నులు చూచి, చేతికిన్
వచ్చిన సౌఖ్యమున్ వదలివైతువె? మానుము స్వర్గవీథికిన్
నిచ్చెనవేయు నెత్తుగడ - నెచ్చెలి! రమ్ము ఖయాము తోడుగా! 62

కొందఱు స్వార్థలోభు, లిక కొందఱు స్వర్గసుఖాలకై వెతల్
చెందు దరిద్రు, లీగజిబిజింబడు టెందుకు? భోగ్యమైన ఆ
నందము చేరువై నిలిచినప్పుడు - అందని దేనికోసమో
ముందుకు పోదువేమి? నిజమూర్తి లభించిన నీడయేటికిన్! 63

ఏమో లోకము మున్గిపోయినటు లా యీ శాస్త్రముల్ త్రవ్వి, మి
థ్యా మీమాంసలు కుప్పవోయకుము! సుల్తాన్ సర్వసామ్రాజ్యమున్,
నా మైరేయపు మట్టిగిన్నెకు సమానమ్మౌనె? ద్రాక్షాసవ
వ్యామోహమ్మున కొల్లగొట్టగలవయ్యా! కోటి కైలాసముల్! 64

అమృతసరస్సు లేదెచట, అప్సరసల్ నిను ముద్దుపెట్టుకో,
రమరపురీ మరీచికలకై మెడ సాచెదవేమి? ఆసవ
మ్మమృతము కంటె కమ్మనిది - అందము కోరిన సాఖిప్రేమకై
భ్రమపడి పాదుషాలు పడిచంచలుగాచి, రికేమి కావలెన్? 65

అమృతశరీర-సాఖిపెదవంటుచు వచ్చిన జాలు; నిత్య జీ
వము పనిలేదు! ఆమె పదపద్మ విలాసము సూర్యచంద్ర బిం
బములకు వన్నె పెట్టినది - ప్రాతవడెన్ తన మోవిముందఱన్
జమిషుదు పైడిపాత్ర - ఇక నా బ్రతుకే ఒక వెల్గుదీవిరా! 66

అచ్చము ద్రాక్షసారము! ఒయారపు ఏ సెలయేటి ప్రక్కనో
పచ్చని తోట! అప్సరసవంటి ప్రియాంగన కౌగిలింత - ఇం

కచ్చట మల్లెపూవుల నమర్చిన పాన్పొకటున్న జాలు నా
ముచ్చటదీఱ సౌఖ్యపడిపోదును! స్వర్గముజోలి యేటికిన్? 67

అలవోకన్ చిఱుమల్లెతీవపయి గానాలాపముల్ సేయు బు
ల్బులి కన్నెల్; శ్రుతిగల్పునట్లు సెలయేఱుల్ పాటెడున్, పాత్ర అం
చులనిండన్ మధురారుణాసవము పొంగున్; దూరతీరాలలో
కలగా శూన్యముగా భ్రమల్ గొలుపు స్వర్గమ్మేల ఖయ్యాముకున్? 68

కంటికి కానవచ్చినది కాదని పెద్దతపోవ్రతమ్ము గై
కొంటివి! స్వర్గమున్నదనుకొమ్మది యెవ్వడు చూచినాడు? నీ
వంటి మనుష్యు లిప్పటికి ప్రాణము లూడ్చిన దెంద? అయ్యయో!
రెంటికి జెడ్డ రేవనివలెఁ తుదియేడ్చెద విందునందునుఁ 69

కాలముజాఱ స్వర్గనరకమ్ముల జోస్యము జెప్పి, గుండెకున్
గాలము వేసి లాగకు! సమాజుల పూజలవంక, కాత్మ ద్రా
క్షాలతవోలె ముద్దులొలుకన్ తలుకొత్తు నొయారి యౌవన
శ్రీలను దోచుకొమ్ము! మధుసేవల తీండ్రిలు రెండు చేతులన్! 70

హృదయ పిపాస లార్చుకొఱకే మన పెద్దలు స్వర్గలోక మ
న్నది తలనాటిపోయిరి! యథార్థముగాదది – ఎవ్వడైన కాల్
గదిపెనె జీవయాత్ర తుదిగా ముగియించిన పాంథులందు? నీ
యెదుట ప్రపంచమున్నది – అదే సురద్రావుము స్వర్గమయ్యెడున్! 71

వలపుల రంభ – నా హృదయవాహినిలో మధువీచి – సాఖి న
వ్వులు కురియించు లేతపెదవుల్ సుతిమెత్తని మేను కౌగిలిం
పుల కరిగించుచున్, కరగిపోవుచు, చల్లని ద్రాక్షతీవ ఊ
యెల తలవాల్చు నా యెదుట ఎత్తకు దైవిక కల్పనాకథల్! 72

దిగు లెగజిమ్ము నా సుఖరతిన్ అరవ్రాలిన కంటిరెప్ప లే
మిగిలిన రోజులన్ ప్రతినిమేషముపై విజయధ్వజమ్ము నె
త్తగలవు! జీవగానపు సితార అపస్వరమంటకుండగా
గగనము భూమి మారుపలుకన్ వినిపింతు రసార్ద్రసత్యమున్! 73

ఆమని పూలతోట! మధురాసవ భాండము! ప్రేయసీ మహా
ప్రేమ పరిత్యజించుకొని, పేరును నూరును లేని యే రహో
భూములకో వృథాపయనముల్ పొనరింతువు వెఱ్ఱివాడ! ఈ
కోమలపుష్పవల్లరులు గుండె గదల్పవొ? వాడివత్తలై! 74

నరకమ్మో! స్వర్గమ్మో!
చెరికొంచెము మధురసమ్ము సేవింతము ర
మ్మరుణాధరి! యీ తనువున
నరనర ముడుకెత్తి జీవనవ్యథ సడలన్! 75

పూపవయస్సు నేలు వలపున్నను దోసిళులెత్తి, ఈ గులా
బీ పొద విందుకున్ మనల పిల్చెడి – "మీ బ్రతుకంత నావలెన్
పాపము! మూడునాళ్ళ మురిపమ్ము గదా! సుఖమందు" దన్న వి
జ్ఞాపనమున్న దా పిలుపునందు నమూల్యరహస్యమై సఖీ! 76

తేలనివెంతకీ బ్రతుకు తెన్నున చిక్కులు! కాలసర్పమై
కాలము కాటువేయు వెనుకన్ మన చేతికి రాదు ప్రాణ, మిం
కేల? మనస్సు నేర్చు రసహీన కథల్? మధుపాత్రలోనె ఆ
మూలము ముంచియెత్తుదము – మ్రోడయి పాడయిపోవు జీవికన్! 77

పూలపొలాలతో సరసముల్ పచరించెడి పిల్లగాలిలో
తేలి, సుడుల్ సుడుల్ తిరిగి, దిక్కుల కూపిరివోయు దివ్య గీ
తాలపనమ్ము సేసెడి ప్రియా! అదె బుల్బులి, ఆలకింపు మీ
"వేళలపాత్రదక్క మఱి వేఱొకడంటకు" డన్న భావమున్! 78

మాటికి మాటికొక్కొక ప్రమాదమునంబడు జీవితమ్ము, ఆ
కాటుక నీలిమబ్బు తడికౌగిట వెన్నెల వంటిదోసి! మో
మోటమి యేల? వెన్నెలలపోలెనె నవ్వుచు నాటిపోద, మి
చ్చోట – కలార్ద్రమై తనువుసోలగ ఈ యమృతాసవమ్ముతో! 79

పచ్చికలు మొల్చి పచ్చని పడకలైన
సెలల గట్టున ననుభవించెదము మధువు!

గుండె కుంపటిగా రగుల్కొన్న దిగులు
సెగలు చల్లారి! బ్రతుకిట్లె ముగిసిపోవ! 80

అసలది చేతగానితనమైనను గావలె – వీలుగాక వె
క్కస వడియైన పోవలెను గాని సుఖమ్మెవడిచ్చగింపడే?
వ్యసనము పట్టలేక మనవారు నిషేధము పెట్టినార! లీ
రసమయ మద్య మంటుకొనరాదని – పాపమటే! అదేమిటో! 81

చిట్టెపుగుండెలా అవి? మసీదులకున్ గుడి గోపురాలకున్
పుట్టుగులాములై సుఖముపొందక యుండుట, కుక్కుకచ్చదాల్
గట్టి తపించునంత మొనగాడెవడే? ఒకసారి మద్యమ్ముఁ
ముట్టి – గులాబివంటి చెలిబుగ్గను తాకిన గుట్టురట్టగున్! 82

శ్యామలకోమలామలముల్ పువుపందిరులెత్తి – ఈ కలా
రామములో వసంతుని కరమ్ముల ఊయెలలూగె సృష్టి నీ
కేమిటికీ విరక్తి? హృదయేశ్వరి! చేదగు జీవితమ్ము నా
ప్రేమకటాక్షధార మధురించెదరమ్ము సుఖానుభూతికిన్! 83

ప్రాయము పొంగునన్ పయిన వ్రాలు విలాసిని! మోహన శ్రుతిన్
పాయని వీణె! తేనె! నవనాడుల నట్టెటులూపు కావ్య పా
రాయణ! మున్న ముక్తికెగబ్రాకెడి యోగియు జాగరూకతా
ధ్యాయము మూసివేసి, పరమాత్మునకొక్క సలాము కొట్టెడున్! 84

మోక్షము పేర నా కనులు మూయకు! నీతులకేమిలే! సవా
లక్ష, వియెన్నన్నైన మన ప్రాయము చాలదు! మృత్యువింతలో
శిక్ష విధించు! నప్పుడు నశీబున కేడ్తునటోసి! ఒక్క యీ
అక్షయ పానపాత్ర మనకాయువు పోయును రా! చిరమ్ముగా! 85

గడపితి మిన్ని యేండ్లిచట! గమ్యము శూన్యము! చావువెన్క క
న్పడదు విశేషమేదియును! ప్రాణముపోవక మున్నె నిన్ను పూ
బడకలకీడ్తు! నీ యెఱుపు వాతెఱనంటి మటింత తీయముం
బడసిన భుక్తశేష రసవారుణి త్రావి, తరించిపోయెదన్! 86

వాడునో! కందునో! యని కృపారతి నంటియునంటనట్లు ము
ద్దాడితి నీ పువుంబెదవు లయ్యో! ఇదేమిటి? ఇంత మోటుగా
వేడి యెడంద పొంగున ద్రవించి, పదేపదె నొక్కుచున్నదీ
పాడుది! పాత్ర-దీని పనిబట్టక - ఊరక చూచుచుందునే? 87

ఈ హృదయమ్మునిండ ప్రణయేశ్వరి! నీ మధుర స్వరూపమే
స్నేహరసార్ద్రమై నిలువనీ! నిను వీడి, మఱొక్క చోట నా
ఊహలు సంచరింపవు! వియోగ మహాగ్ని శిఖల్ తగిల్చి, నా
దేహము చుట్టు నాఱని చితిన్ రగులింపకుముక్కుగుండెతో! 88

తెలియని, తెల్పరాని ఒక తీయని వేదన యేదియో మదిన్
కలకలు వేయ నా బ్రతుకొకానొక ప్రేమతరంగమై నినున్
వలగొని పోవుచున్న దతివా! అల మృత్యుపిశాచికిన్ వృథా
బలియగు వారికెల్ల గుణపాఠముగా నిను ముద్దులాడెదన్! 89

ఎంతకు ప్రొద్దుగ్రుంకదు! ఇదేమిటి? ఈ పగలంతయున్ విషా
దాంతము జేసినాను! విరహమ్మున - మేనున మేనుగల్పి - ఏ
కాంతపు రాత్రిలో సుఖములందితి, మా మధురస్మృతుల్ విషా
క్రాంతములై శరీరమున కత్తులు నాటెడు నొంటిపాటునన్! 90

*(సశేషం)*



# శేషేంద్ర కవితా వైభవం

**- ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

*(గత సంచిక తరువాయి)*

(గత సంచికలో శేషేంద్ర కవితా వైభవాన్ని వివరిస్తూ, ఆయన కవిత్వంలో - అంటే పద్యాలు + వచన కవితలు కలిసిన దానిలో ఆరు శాఖలుంటాయని చెప్పాను: (1) ప్రకృతి సౌందర్యం (లేక ప్రకృతి వర్ణనలు); (2) ప్రేమౌన్నత్యం (లేక ప్రణయ

కవిత్వం); (3) సామాజిక చైతన్యం; (4) విప్లవ చైతన్యం; (5) సాంద్రకవితా చైతన్యం (సుప్త చైతన్య స్మృతి – అనుభూతి, ప్రతీకలు – భావచిత్రాలు); 6. కవిత్వ తత్త్వం. వీటిలో మొదటి రెండు శాఖలు వివరించాను. ఈ వ్యాసం వ్రాసిన తరువాత, మిత్రులు సౌభాగ్యగారు రచించిన "ఈ కాలం కవులు" అనే గొప్ప పుస్తకాన్ని నేను చూడటం తటస్థించింది. అందులో సౌభాగ్యగారు శేషేంద్ర కవితా వైభవాన్ని కేవలం మూడు పుటల్లో అత్యద్భుతంగా ఆవిష్కరించారు. శేషేంద్ర ప్రకృతి వర్ణనలలో నా కంటికి కనబడని రెండు మూడు కవితా ఖండికలను ఆయన ఉదాహరించారు. వాటిని కూడా చేర్చుకుంటేనే కాని నా వ్యాసానికి పరిపూర్ణత రాదు – అనే ఉద్దేశంతో, శేషేంద్ర మొదటి కవితా శాఖకు – అంటే ప్రకృతి సౌందర్యానికి – ఈ క్రింది ఉదాహరణలు చేరుస్తున్నాను.)

**VII. కవితా శాఖలు: 1. ప్రకృతి సౌందర్యం (లేక ప్రకృతి వర్ణనలు):** అనే శీర్షికలో ఉదాహరణం "1.5" తరువాత, ఈ క్రింది ఉదాహరణను కూడా చేర్చుకోవాలి.

సౌభాగ్యగారు చెప్పినట్లుగా "తన వ్యక్తిత్వంతో కవిత్వానికి ఒక రాజసాన్ని, గాంభీర్యాన్ని, ఇచ్చినవాడు శేషేంద్ర. ఆయన కవితలు తేనెలో ముంచి తీసినంత తన్మయ మాధుర్యాన్ని కలిగి ఉంటాయి. ప్రకృతి ఆయన అక్షరాల్లో పరవశిస్తుంది. వస్తువు ఏదైనా, అభివ్యక్తి వైచిత్రి ఆకట్టుకుంటుంది." ఉదాహరణానికి ఈ క్రింది కవిత చూడండి:

**"నేనొక పాటని!**
**అడవిలో సరిగమలల్లుతూ**
**ముత్యాలగుంపుల్లా పరుగెత్తే వాగుని!**
**నీలిమలో మధురిమ చల్లుతూ**
**రెక్కలమీద తేలిపోయే పక్షిని!**
**తోటలో వసంతం – గుండెల్లో గ్రీష్మం**
**ఎటుపోవాలో తెలీని బాటసారిని!!"**

ఇదే మొదటి శీర్షికలో "పక్షిపాట"ను గురించిన ఉదాహరణం "1.9" తరువాత, ఈ క్రింది రెండు ఉదాహరణలు చేర్చాలి:–

*(i)* *"చందమామ"ను గురించిన వర్ణన:*

"ఎక్కడ
ముద్దుగా ఇంటిమీదికి ఒరిగిన

జాబిల్లి ముద్ద
చేతికందుతాడనిపిస్తుందో
అక్కడికి
ఆ కలల లోయల్లోకి
పోదాం పదమంటుంది ఆత్మ
నగ్న వృక్షాల బారి నుండి తప్పించుకొని
శాంతియాత్ర చెద్దాం పదమంటుంది"

(ii) *"ఆకాశాన్ని" గురించిన వర్ణన:*

భావుకతా పరాకాష్ఠలో ప్రకృతి తనను అమ్మలా ఆహ్వానిస్తున్నట్టూ, చేతిలో పిప్పరమెంటు పెట్టినట్టూ అనుకుంటాడు శేషేంద్ర. కాని ఆ పిప్పరమెంటు తన నోటిలో వేసుకుందుకు కాదు, తన ఆత్మలో వేసుకుందుకట! నోరు చప్పరించడానికి కాదు, తన ఆత్మ చప్పరించడానికట!! సౌభాగ్యగారు చెప్పినట్లుగా "నిష్కల్మష భావుకుణ్ణి ప్రకృతిలోని ప్రతి అణువూ పరవశంగా పిలుస్తుంది; రమ్మంటుంది; ఆడుకుందామంటుంది; ఆలింగనం చేసుకుంటుంది". ఈ క్రింది ఉదాహరణం చూడండి:-

"ఆకాశం రమ్మంటోంది ....
చెట్ల సందుల్లోంచి
ఇళ్ళకప్పుల మీదినించి
కొండశిఖరాలెక్కి
మేఘాల గుంపుల్లో దూరి
రమ్మంటోంది ....
ఋతువుల యుద్ధాల్లో
ఎన్నిపూలు నేలకు రాలాయో
చూపిస్తోంది ....
చూపుడు వేలులాంటి ఏకాకి చుక్కతో ....
పక్షిలేని తోటనించి పొమ్మంటోంది
ఒక చంద్రుణ్ణిస్తా నీ ఆత్మ చప్పరించటానికి
రమ్మంటోంది ...."

## 2. ప్రేమౌన్నత్యం (లేక ప్రణయ కవిత్వం) :

(దీనిని గురించి క్రిందటి సంచికలో వివరించాను. దీని తరువాత 3వ శాఖ నుండి ఇక్కడ విశదీకరిస్తున్నాను. చదవండి.)

## 3. సామాజిక చైతన్యం :

దీనికి "నా దేశం నా ప్రజలు" అనే కావ్యమంతా ఉదాహరణమే. "ఋతుఘోష" వంటి ఇతర కావ్యాలలో కూడా ఈ చైతన్యం ఉంది. దీంట్లో పేదల బాధలు; పీడిత ప్రజలు – శ్రమ జీవులు (కార్మిక కర్షక పక్షపాతం); ప్రజాస్వామ్య వైఫల్యం లేక డొల్లతనం (శుష్క ప్రజాస్వామ్యం– శూన్యహస్తం); రైతుల తిరుగుబాటు – వర్ణింపబడ్డాయి.

**3.1.** **పేదల బాధలు:** పద్య కవితలోను, వచన కవితలోను కూడా పేదల బాధలే ఆయన ఇతివృత్తం. దేశంలో ఉన్న పేదరికాన్ని చూచి తీవ్రంగా చలించిపోయారు శేషేంద్ర.

(a) **"చలి పులివోలె దారుల పచారులు చేయుచునుండ, ఊరికా**
**వల పెనుమఱ్ఱి క్రింద, నెలవంకయె దీపముగా పరున్న పే**
**దల పసిపాప లెవ్వరికి తప్పు దలంచిరి, కాలమే హలా**
**హలమయిపోయి, ఆ శిశువు లాకలితో చలితో నశింపగన్."**

(b) "ఏ గుడిసెల్లో పగలు మనుషులు లేరో
ఏ గుడిసెల్లో రాత్రి వెలుతురు లేదో
ఆ గుడిసెల్లో నడచిపోతున్నా –
ఎక్కడ తిండిలేని పసివాడు దూడను మేతకు తీసుకుపోతున్నాడో
ఎక్కడ పసితనం కూడా బ్రతకడానికి పనిచేయ్యాలో
అక్కడ నా కాళ్ళు నిజంగా తెగిపోయాయి
నా చేతులు నిజంగా రాలిపోయాయి
నా నాలిక పడిపోయింది
అక్కడ నేను మహాప్రవాహాన్ని కాను
అక్కడ నేను ఝంఝూమారుతాన్ని కాను
ఆ పసివాడి కాళ్ళముందు!
కడివెడు కన్నీళ్ళు పోశాను ఆ కాళ్ళమీద

నా ఆత్మలో ముత్యాలదండ తెగి అతని మ్రోల పడిపోయింది
నా పద్యం అటువైపు చూడలేక ఏడ్చింది."

(c) "నీకు తెలుసా ఆకలి ఉందని?
నీకు తెలుసా దప్పిక ఉందని?
అవి రెండూ నీ విలువైన స్వేచ్ఛామాంసం
తిని బ్రతికే క్రూరమృగాలని?"

(d) దేశంలో ఒక ప్రక్క అక్రమార్జనతో ధనికులైన వ్యాపారులు. మరొక ప్రక్క తినడానికి గుప్పెడు మెతుకులు లేక, కుక్కల కన్న, ఈగల కన్న, దోమల కన్న, హీనంగా బ్రతుకుతున్న కటికి దరిద్రుల పిల్లలు! ఈ వ్యత్యాసాన్ని చూచి భరించలేకపోయారు శేషేంద్ర:
**"వాళ్ళు సేట్లుకారు, షేర్వాణీలు ధరించి
మెలికలు తిరిగి పడుకున్న కొండచిలువలు!
స్వాగత్ హోటల్ క్రింద ఎంగిలాకుల మీద
ముసురుకుంటున్న వాళ్ళు పిల్లలు కారు
మనుషులుగా మారిన ఈగలు!!"**

(e) నిరుపేదల దుర్భర జీవితాలను చూచి, మిక్కిలిగా చలించి, దుఃఖించిన శేషేంద్ర, ఒక్కొక్కసారి దేవుణ్ణి కూడా ధిక్కరించి పలుకుతారు. సందేహంతో దైవం ఉనికినే ప్రశ్నిస్తారు:
**"ఓ పరమేశ్వరా! యెచట నుంటివి? నీ వసలుంటివా? ప్రజా
శాపములన్ భరించుటకు సాధ్యము కాదని, పాతపెత్తనం
బీపయి సాగబోదని యెటేని పరారయినావ? బాధలం
బాపగలేవు నీవు శిలవా? కలవా? సెలవీయుమో ప్రభూ!"**
దీనిని బట్టి శేషేంద్ర నాస్తికుడని భావించడానికి వీలులేదు. ఆయన త్రికాల సంధ్యావందనం చేసే గొప్ప ఆస్తికుడు!

3.2 **పీడిత ప్రజలు – శ్రమజీవులు:** శేషేంద్ర కవిత్వంలో కార్మిక కర్షక పక్షపాతం ఎక్కువగా కనబడుతుంది. ఏ దేశసంపద అయినా ఆ దేశపు శ్రమజీవుల పైనే – అంటే కార్మికుల పైనా కర్షకుల పైనా ఆధారపడి ఉంటుంది. వీరికి రాజ్యాధికారం రావాలని కారల్ మార్క్స్ సిద్ధాంతం చేశాడు. ఈ సిద్ధాంతాన్ని శేషేంద్ర గాఢంగా విశ్వసించారు. అయితే శ్రమజీవులు మన దేశంలో పీడనకు

గురి అవుతున్నారు. దుర్భర దారిద్ర్యంలో మ్రగ్గుతున్నారు. ఈ పీడిత ప్రజలపై సానుభూతిని చూపించారు శేషేంద్ర. శ్రమజీవులదే ఈ దేశం అని చాటించి చెప్పారు శేషేంద్ర. ఆయన కవిత్వమంతా శ్రమజీవుల స్వేదంతో తడిసి ముద్దైపోయింది:-

**(a)** **"పీడిత ప్రజలకే ఈ భూమి సంక్రమిస్తుంది**
**రండి! పాతిపెట్టిన ఉషస్సును బయటికి తీద్దాం"**

**(b)** **"ఓ శేషన్! నీవు పీడిత ప్రజలకే చెందుతావు**
**అక్షరమై అందరికీ అందుతావు"**

**(c)** **"ఈ నదులు ఈ కొండలు ఈ దేశం ఎవరిది?**
**పనిచేసిన కూలితో బ్రతుకున్న ప్రజలది!**
**ఈ దేశపు వీథుల్లో నడిచే హక్కెవరిది?**
**స్వేద బిందువుల దండలు వేసుకున్న వారిది!"**

**3.3 ప్రజాస్వామ్య వైఫల్యం లేక డొల్లతనం (శుష్క ప్రజాస్వామ్యం – శూన్యహస్తం):**
1947లో మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది. రాజరికాలను, జమీందారీ వ్యవస్థను రద్దు చేసి ప్రజాస్వామ్యాన్ని స్థాపించుకున్నాం. 60 ఏళ్ళు దాటినాసరే, సామాన్య ప్రజల బాధలు పోలేదు. పేదరికం, నిరుద్యోగం అంతం కాలేదు. ధనస్వామ్యం, రౌడీస్వామ్యం తాండవమాడుతున్నాయి. ఎన్నికలు ఒక ఫార్సుగా తయారయ్యాయి. కోటీశ్వరులైన రాజకీయవేత్తలు నోట్లకట్టలతో, మద్యంసీసాలతో ఓట్లు కొనేస్తున్నారు. కుదరకపోతే రిగ్గింగు చేసి గెలుస్తున్నారు. ఎన్నికలలో శుష్క వాగ్దానాలు చేస్తున్నారు. తరువాత శూన్యహస్తాలు చూపుతున్నారు. ఈ స్థితిని శేషేంద్ర బట్టబయలు చేశారు:-

**(a)** **"నీకు తెలుసా! వ్యవసాయ కూలీల ఆకాశం**
**వర్షాలు కురుస్తుందే కాని వసంతాలు కురవదు**
**రైతులారా! రాజకీయ వర్షం పడుతోంది**
**మోసపోయి మీ విత్తనాలు చల్లకండి!"**

**(b)** **"తెలుసా బిడ్డా! ఈ దేశంలో రాజకీయ ఋతువు రాగానే**
**ఓట్ల డబ్బాలకు గర్భస్రావం జరుగుతుంది!**
**ప్రజాస్వామ్య శిశువు జననం ఎప్పుడూ జరగదు**

ఓట్ల పరికోతలు మాత్రం యథావిధిగా జరుగుతాయి
రాజధానుల్లో ధాన్యాగారాలు నింపడానికి"

(c) "ఎన్ని రోగాలైనా సరే ఎన్నికల మందుతోనే
నయం చేస్తామనే భూతవైద్యులు!
బాబూ! దేశం నెత్తిన పెట్టారు
శుష్క ప్రజాస్వామ్య శూన్యహస్తం!
అరే! ప్రజారక్తం నేలమీద రాలుతోంది
రండి! ఈ దినాన్ని అంతం చేయక తప్పదు!"

(d) "మన దేశం మండిపోతున్న ఒక చోటు
మనిషి కేవలం ఒక ఓటు!"

3.4 రైతుల తిరుగుబాటు: మనదేశంలో భూసంస్కరణలు అమలు కాలేదు. పొలం దున్ని కష్టపడి వ్యవసాయం చేసే రైతులకు, రైతు కూలీలకు ఏమీ దక్కడం లేదు. ఫలితమంతా భూస్వాములదే. ఈ స్థితిని చూచి శేషేంద్ర, తిరుగుబాటు చేయవలసిందిగా రైతులను ప్రబోధిస్తున్నారు:-

(a) "ఎన్నాళ్ళనుంచో పెంచి పోగుచేసిన వాళ్ళు
ఎండల తలపాగాలతో వెళ్ళిపోతుంటే
మిలియన్ల గొంతులెత్తి ఏడుస్తున్నవి ధాన్యపురాసులు!
ఈ యేడాది పైర్ల దుఃఖం తీరకపోతే
వచ్చే యేడాది వట్టి కొడవళ్ళు పట్టుకున్న పిడికళ్ళే మొలుస్తాయి!!"

(b) "నా పిల్లల చేత వాడు నా తిండిగింజలు తినిపించకపోతే
భూమిచేత నేను వాడి రక్తం తాగిస్తా!
నా కవిత్వం ఏ జెండాను ఎగరేయదు
కానీ నా చేతులు నా దేశపు ఖడ్గాలు!!"

## 4. విప్లవ చైతన్యం (నక్సలైట్ల ఉద్యమ సమర్థన):

ఈ దేశంలో నెలకొన్న దుర్భర దారిద్ర్యాన్ని, ఆకలిని, నిరుద్యోగాన్ని, ప్రజల సమస్త బాధలను పోగొట్టాలంటే మార్క్సిస్టు విప్లవం తప్ప మరోమార్గం లేదని గాఢంగా విశ్వసించిన మహాకవి శేషేంద్ర. ప్రజాస్వామ్యపు డొల్లతనాన్ని గుర్తించి,

మోసపూరితమైన ఈనాటి ఎన్నికలతో ప్రజల సమస్యలు పరిష్కారం కావని కూడా తెలుసుకున్నారు. అందువల్ల సమసమాజ స్థాపనకోసం తుపాకులు పట్టిన నక్సలైట్లను హృదయపూర్వకంగా సమర్థించారు శేషేంద్ర. ఈ విప్లవంలో నేలకొరుగుతున్న తరుణ వీరుల్ని తలచుకొని దుఃఖించారు:-

(a) "నది పొలాలవైపు పరుగెత్తింది – అన్నార్తుల్ని రక్షిద్దామని
చెయ్యి రైఫిల్ వైపు దూకింది – ప్రజాద్రోహుల్ని శిక్షిద్దామని"

(b) "కవిత్వం ఎర్రగుర్రంలా పరుగెత్తుకు వస్తోంది
రక్తంలో మునిగిన బాణంలా ...
వీరుడు విడిచిన ప్రాణంలా ...."

(c) "నా దేశమంతా వాడి (విప్లవ వీరుడి) విశ్వరూపమే, మరచిపోకు
మరణించిన వీరుడు ఈ ధరిత్రికి ఒక కొత్త నక్షత్రం!"

(d) "చంపి కొండల్లో పారేసిన వాడి శరీరం
ఒక రాగం కోసం బిగించిన ఫిడేలులా పడి ఉంది.
అతడి నోరు పాడిన పాటలు
ప్రవహించే నదులు ఆగి ఆలకించేవి
చావులేని వాడిని చంపే మూర్ఖులకు తెలియదు
ఏ మృత్తిక పువ్వును మనిషికి కానుకగా ఇస్తుందో
అది వాడి నిర్మాణంలో ఉందని!"

"ఒక వీరుడు మరణిస్తే, వేలకొలది ప్రభవింతురు" – అన్నాడు పూర్వం ఒక విప్లవ కవి. మట్టిలో ఒక దివ్యమైన శక్తి ఉంటుంది. ఆ శక్తి చరాచర ప్రాణికోటిని సృష్టిస్తుంది. ఒక చెట్టుకు ఉదయం ఒక పువ్వు పూస్తుంది. సాయంకాలానికి అది వాడిపోయి రాలిపోతుంది. తిరిగి మర్నాడు మరో కొత్తపువ్వు పూస్తుంది. నక్సలైట్లు, ఎల్.టి.టి.ఇ. వారు (తమిళ పులులు) 30-40 ఏళ్ళుగా యుద్ధాలు చేస్తునే ఉన్నారు.

## 5. సాంద్ర కవితా చైతన్యం: సుప్తచైతన్య స్మృతి లేక సుప్త చేతన (Sub-conscious) – అనుభూతి (Feeling):

మానసిక శాస్త్రం (Psychology) ప్రకారం మానవుని మెదడు మూడు అవస్థలలో ఉంటుంది. "చేతన" (Conscious)- "సుప్త చేతన" (Sub-conscious)

- "అచేతన" (Un-conscious). ప్రతీకలు (Symbols) - భావచిత్రాలు (Images) - వీటితో కూడిన గొప్ప కవిత్వం సుప్తచేతన స్థితిలో పుడుతుందని చెపుతారు. (కొందరి దృష్టిలో ప్రతీకలు అచేతన స్థితిలో రూపుదాల్చుతాయి.) కథలు, నవలలు, నాటకాలు చేతన స్థితిలో వ్రాస్తాడు రచయిత. శబ్దార్థాలకు అతీతంగా ఉండే ఒకానొక భావస్థితి "అనుభూతి" (Feeling). కవి తన అనుభూతిని వెల్లడించడానికి కూడా ప్రతీకలను - భావచిత్రాలను ఆశ్రయిస్తాడు.

శేషేంద్ర కవిత్వంలో అడుగడుగునా ప్రతీకలు - భావచిత్రాలు మనకు సాక్షాత్కరిస్తాయి. అవి మనలను ఆశ్చర్యచకితుల్ని చేస్తాయి. శేషేంద్ర రచించిన "నీరై పారిపోయింది" అనే కావ్యం సుప్త చైతన్య స్మృతికి, "సముద్రం నా పేరు" అనే కావ్యం అనుభూతి కవితకి మంచి ఉదాహరణలుగా పరిశోధకులు తేల్చి చెప్పారు. (చూ. "శేషేంద్ర కవిత్వానుశీలనం" - పెన్నా శివరామకృష్ణ) మరికొందరు పరిశోధకులు శేషేంద్ర కవిత్వంలోని సౌందర్య నవ్యతను, విప్లవ నవ్యతను, ఐతిహాసిక నవ్యతను సోదాహరణంగా నిరూపించారు. (చూ. "శేషేంద్ర కవిత - నవ్యత" - డా॥ కలువగుంట రామమూర్తి.) ఏది ఏమైనా, శేషేంద్ర కవిత్వంలో స్మృతికి అనుభూతికి ప్రాధాన్యం ఉన్నదని పాఠకులు గుర్తిస్తారు. దీనికి అనుగుణంగా ఎన్నో అద్భుతమైన ప్రతీకలు, భావచిత్రాలు సృష్టించారు శేషేంద్ర. ఇవి చదువరులను తన్మయులను చేస్తాయనడంలో ఏ మాత్రం సందేహం లేదు.

5.1 **సుప్త చైతన్య స్మృతి:** స్మృతి-అనుభూతులను గురించి ప్రస్తావిస్తూ శేషేంద్ర తన "శేషజ్యోత్స్న" కావ్యంలో "అనుభూతి కంటె స్మృతి బలీయం" అంటారు. ఆయన కవిత్వంలో స్మృతులకు ఎంతో ప్రాముఖ్యం కనబడుతుంది:

- **"వస్తువు వస్తువు కాదు/ అసంఖ్యాక స్మృతులకు సంకేతం"**
- **"విశ్వం ఒక సంకేతాల గుంపు / నేనొక జ్ఞాపకాల ఊరేగింపు"**
- **"జీవితం అంతా అరిగిపోగా/చివరి రేణువులా మిగిలి ఉన్న నా ఉనికి/ ఒక్క జ్ఞాపకం, ఒక్కటే!"**

ఈ చివరి ఉదాహరణానికి శేషేంద్ర మరణానంతరం సార్థకత వచ్చింది. తాను బ్రతికి ఉండగానే తన మరణానంతర స్థితి ఊహించిన మహానుభావుడు, మహాభావుకుడు శేషేంద్ర!

శేషేంద్ర కృతులలో "నీరై పారిపోయింది" ఒక విశిష్టమైన కావ్యం. ఇదే అత్యుత్తమమైన కావ్యం అన్నారు కన్నడ కవులు, విమర్శకుడు. (దీనిని నేను,

నా శిష్యుడు డా॥ హెచ్.ఎస్. వెంకటేశమూర్తి అనే కన్నడకవితో కలిసి అనువదించాను.) కాని శేషేంద్రగారికి తన కావ్యాల్లో "నా దేశం నా ప్రజలు" అంటే చాలా యిష్టం. "నీరై పారిపోయింది" కావ్యాన్ని గురించి ప్రసిద్ధ విమర్శకులు ఆర్.ఎస్. సుదర్శనంగారు "భారతి"లో మంచి వ్యాసాన్ని వ్రాశారు. శ్రీ వడలి మందేశ్వరరావుగారు కూడా ఈ కావ్య వైశిష్ట్యాన్ని కొనియాడారు. మనస్తత్వ శాస్త్రవేత్త "ఫ్రాయిడ్" వైయక్తిక సుప్తచేతన స్థితిని (Individual Sub-conscious State ను) గురించి చెప్పాడు. అతని శిష్యుడైన "యూంగ్" సామూహిక సుప్తచేతన స్థితిని (Group Sub-conscious State) విశ్లేషించాడు. వీరిద్దరి కన్నా ముందుగానే, ఎన్నో వందల సంవత్సరాలకు పూర్వం మహాకవి కాళిదాసు తన "అభిజ్ఞాన శాకుంతలమ్" నాటకంలో, ఐదవ అంకంలో, ఈ సుప్త చేతనను గురించి ప్రస్తావించాడు:-

**"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్**
**పర్యుత్సుకోభవతి యత్సుఖితోపి జంతుః ।**
**తచ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వం**
**భావస్థిరాణి జననాంతర సౌహృదాని" ॥**

<u>తాత్పర్యము:</u> "ఒక అందమైన చిత్రాన్ని చూచినా, ఒక మధురమైన గీతాన్ని విన్నా, సుఖంగా ఉన్న ప్రాణి కూడా దుఃఖాన్ని పొందుతుంది. ఎక్కడివో ఎప్పటివో వాసనలు మనసులో మేల్కొంటాయి. పూర్వజన్మల సంస్కృతి సంస్కారమే దీనికి కారణం."

కాళిదాసు-ఫ్రాయిడ్-యూంగ్‌ల భావాలను కలిపి, ఒకదాని నుండి మరొకటి విడదీయడానికి వీలులేకుండా శేషేంద్ర "నీరై పారిపోయింది" కావ్యాన్ని సృష్టించారు. జన్మజన్మల నుండి వచ్చిన తన సంస్కారాన్ని, తన జాతి సంస్కారాన్ని త్రవ్విపోశారు. ఆదిమ మానవుని నుండి నేటివరకు వచ్చిన మనిషి లోభాలను, బాధలను, ఔన్నత్యాన్ని చూసే ప్రయత్నం చేశారు:-

**(a)** ఒక మనిషిలో మొత్తం మానవజాతి చైతన్యాన్ని చూసే ప్రయత్నం. ఇది వైయక్తిక సుప్తచేతనతో కలసిన సామూహిక సుప్తచేతన.

<u>మానవుల సుప్తచేతన:</u>

**"ఏవేవో స్మృతులన్నీ దూరదూరాల నుంచి**
**నా రక్తప్రవాహాల్లో పడి కొట్టుకొచ్చాయి ....**

ఒక్కొక్కప్పుడు బయట పడతాయి,
నా రక్త నదీతీరాల్లో నా పాతరాతి పనిముట్లు –
ప్రవాహాల్లో కొట్టుకొస్తాయి ప్రాచీన సుమేరియాలు,
మొహంజొదారోలు''

(b) <u>సామూహిక సుప్తచేతన:</u>
''అందరము ఏ చెట్టుకో పుట్టిన ఆకులం,
ఏ శాఖకో పూచిన పూవులం
అందరము అన్నీ విడచి పోతాము,
మరికొన్నిటికి తావిస్తాము, కానీ జీవిస్తాము''

(c) <u>వైయక్తిక సుప్తచేతన:</u> వెనుకటి జన్మలో నేను క్రూరజంతువుగా, పచ్చగడ్డిగా, చెట్టుగా పుట్టి ఉండవచ్చును అనే స్మృతి:–

''నేను ఏ అడవుల్లో తిరిగానో సింహశార్దూలాల గర్భాల్లో నిద్రిస్తూ –
నన్ను ఏ అందమైన లేడి మేసిందో శాద్వలాల్లో తన రక్తమాంసాలను బజ్జగిస్తూ–
నేను ఏ అడవి అనుభూతి కోసం చెట్టుపై కొమ్మలు జాపానో
నా ఆకుల అంగుళులతో శూన్యం స్పృశిస్తూ ....''

(d) <u>వైయక్తిక సుప్తచేతన:</u>
''నా స్మృతి మీద ఒక స్తంభం విరిగిపడింది
నా గొంతు మీద గడ్డి మొలిచింది
గోవులు తిని భూవలయం మీద పిల్లలందరికీ పాలిచ్చాయి
పిల్లల్లో నా గొంతు పద్యాలై పల్లవించింది
వాటి మీద బంగారు మూర్ఛపోయింది
దేవుడు కాళిదాసై కన్నీళ్ళతో చేతులు కడుక్కున్నాడు.''

ఈ కవితలో కొన్ని అద్భుతమైన ప్రతీకలున్నాయి. వాటిని తెలుసుకుంటేనే కాని ఈ కవితలోని వైయక్తిక సుప్తచేతన అర్థం కాదు.

స్మృతి = అహం (నేను)

స్తంభం = మరణం

గొంతు = కవిత్వం

గడ్డి = కాలం

గోవులు = రాగద్వేషరహితులైన సహృదయులు
పాలు = జ్ఞానం
పిల్లలు = విలువైన సత్యం
దేవుడు = మహాకవి
కన్నీళ్ళు = కరుణ ప్రేమలతో కూడిన మానవత

ఈ ప్రతీకలను గుర్తించిన తరువాత ఈ కవితయొక్క భావం ఇలా విశదమవుతుంది: "కవినైన నేను చనిపోయినా సరే, భావితరాల మీద నా ప్రభావం ఉంటుంది. కరుణ, ప్రేమ, మానవత వంటి విలువైన సత్యాలను చెప్పే కవి, దేవునితో సమానుడు."

5.2 **అనుభూతి కవిత:** శేషేంద్ర రచించిన "సముద్రం నా పేరు" అనే కావ్యమంతా దీనికి మంచి ఉదాహరణం. కవి తనను సముద్రంగా భావించుకొని (ఊహించుకొని) పొందిన అనుభూతిని ఎలా చెపుతున్నాడో చూడండి:

**"ఈ వేళ సముద్రం - విరిగిపడుతున్న భారీ కెరటాలూ**
**తెల్లటి నిరాశలాంటి నురుగుల సమూహాలూ**
**తీరాల మీద పడి గొంతు కోల్పోయిన శంఖాలూ**
**ఛిన్నాభిన్నమైన నత్తగుల్లలూ**
**శాశ్వతంగా నీళ్ళు పోగొట్టుకున్న భగ్న నౌకలూ..."**

భగ్న నౌకల్లా తయారైన ప్రజల జీవితాల్లో నుంచి నిరాశను తొలగించాలని కవి భావం.

కేవలం సిద్ధాంత ప్రవచనాలతో కాకుండా, అభివ్యక్తి విశిష్టత, వ్యంగ్య వైభవం కలిగిన కవితను "అనుభూతి కవిత" అనవచ్చునంటారు ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య. రాజకీయ సిద్ధాంత సమ్మేళనం లేకుండా, కవి అనుభూతిని శబ్ద చిత్రాలుగా మలచాలనుకోవటం అనుభూతి వాదానికి ప్రాతిపదిక. ఒక వస్తువు, ఒక సంఘటన నేరుగా కవికి కలిగించిన ప్రథమానుభూతికి ఇక్కడ ప్రాధాన్యం (చూ. ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారి ఆలోచన, పుట 58). అయితే, "అనుభూతి కవిత" అని ప్రత్యేకంగా చెప్పటాన్ని శేషేంద్ర ఒప్పుకోరు. ఏ రకమైన కవితలోనైనా కవి పొందిన అనుభూతిని పాఠకునిలో కలిగించటం ద్వారానే ఇతర చైతన్యాలను రేకెత్తించడం జరుగుతుందని శేషేంద్ర అభిప్రాయం.

అంతర్లోకాలలో అగ్నిపర్వతాలతో, బాహ్యరూపంలో ప్రచండ తరంగాలతో నిండిన చైతన్యశీలియైన మానవుడే ఒక అగాధ సముద్రం. "సముద్రం నా పేరు" అనే కావ్యాన్ని విశ్లేషిస్తూ ప్రముఖ విమర్శకులు ఆచార్య ముదిగొండ వీరభద్రయ్యగారు ఇలా అన్నారు: "సముద్రం నా పేరు - అన్నదానిలో "నా" కేవలం వ్యక్తి కాదు. శేషేంద్ర అనే సామాన్యుడైన వ్యక్తి అసలే కాదు. అది బృహదహం. సర్వమానవజాతినీ, జీవకోటినీ దర్శించి, అవన్నీ తానేయైన విశ్వరూపాన్ని పొందిన మహావ్యక్తిని "నా" అన్నది సూచిస్తుంది" (అనుభూతి కవిత్వం, కొన్ని వ్యాసాలు, పుట. 43).

**"సముద్రమొక మార్మిక ద్రవ్యము! నీకేలా తెలుస్తాయి సముద్రపు లోతులు? సముద్రపు నాడుల్లో ఎన్ని పర్వతశ్రేణులున్నాయో, దాని పేగుల్లో ఎన్ని నాగరికతలు జీర్ణమైపోయాయో, దాని రక్త ప్రవాహాల్లో ఎన్ని యుగాల, ఎన్ని మన్వంతరాల అగ్ని దాగివున్నదో, ఎన్ని వేదనలు, ఎన్ని విస్మృత ఆత్మల సాహసోపేతయాత్రలు దాని అంతరాళాల్లో ఘుర్ఘురధ్వనులు చేస్తున్నాయో?"**

మనిషినీ సముద్రాన్నీ సంపూర్ణంగా అర్థం చేసుకోవటం దుస్సాధ్యం. నేటి మానవునిలో ఆదినుండి మనిషి సాధిస్తూవచ్చిన ప్రగతి, వివిధ యుగాలలో అక్రమాలపై చూపిన ప్రతిఘటనా ప్రవృత్తి, సాహసం నిక్షిప్తమై ఉన్నాయి. (చూ. పెన్నా శివరామకృష్ణ, శేషేంద్ర కవిత్వానుశీలనం, పుట-55).

5.3 **ప్రతీకాత్మకత:** పాశ్చాత్యులు చెప్పే "ప్రతీక" (Symbol) మన "ధ్వని"తో సమానమని, వాళ్ళు చెప్పే "భావచిత్రం" (Image) మన ఉపమ, రూపకం వంటి అలంకారాలతో సమానమని స్థూలంగా చెప్పవచ్చును. సూక్ష్మంగా పరిశీలిస్తే తేడాలు ఉంటాయి.

కవి తాను వర్ణించదలచుకున్న "వస్తువును చెప్పకుండా, తన అనుభూతి కేంద్రమైన మరో వస్తువును చెప్పటం ద్వారా అసలు వస్తువుని స్ఫురింప జేయటం ప్రతీక". (చూ. లంకా వెంకటేశ్వర్లు, సమకాలీన కవిత్వంలో ప్రతీకలు - భావచిత్రాలు, పుట.23).

"యాంత్రికమైన సాంకేతికత కంటె భిన్నమైనది, అనుభూతి జన్యమైనది, వాచ్యత కంటె సూచన ప్రధానమైనది, వస్తువులను ప్రతీయమానం చేయటం కాక వస్తుతత్వాన్ని వ్యక్తీకరించేది ప్రతీక అని నిర్వచించుకోవచ్చు". (పెన్నా శివరామకృష్ణ, శేషేంద్ర కవిత్వానుశీలనం, పుట-63).

స్వయంగా శేషేంద్రగారే తన 'రక్తరేఖ'లో ప్రతీకాత్మకతను విశదీకరించారు: "సింబలిజంలో ఒకే వస్తువు ఉంటుంది. దానిలోనే రెండో వస్తువు ఉంటుంది. బయటికి కనిపించేది భౌతిక వస్తువు. మామూలు కళ్ళకు కనిపించకుండా లోపల ఉండేది రెండో వస్తువు (-తాత్త్విక వస్తువు). అంటే ఒక వస్తువు యొక్క భౌతిక తాత్త్విక రూపాలను కవి గ్రహిస్తాడు. ఒకటి చర్మచక్షువుతో; రెండోది విజ్ఞాన చక్షువుతో."

"ఫ్రెంచి ప్రతీకవాదుల సిద్ధాంతాలలో ప్రతీక స్వభావాన్ని చెప్పే పద్ధతులమీద భారతీయ ధ్వనిసిద్ధాంతచ్ఛాయలను గమనించటం సులభం" అంటారు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు. కాని శేషేంద్రశర్మగారి దృష్టిలో మన ధ్వని కంటే ఫ్రెంచివారి ప్రతీక చాలా గొప్పది; ఉన్నతమైనది: "ఆలంకారికులు సాహిత్య పరాకాష్ఠగా చెప్పే ధ్వని కంటే సింబలిజమ్ చాలా గొప్పది. సింబలిజం ఒక విరాట్ స్వరూపం అయితే, ధ్వని దాని పాదం వరకే వస్తుంది. ధ్వని కేవలం ఒక శబ్దశక్తివ్యవహారం. కాని సింబలిజం దృశ్యవ్యవహారం. సదసద్వివేక వ్యవహారం, వైదిక వ్యవహారం. సింబలిజంలో సింబల్స్ మన ఇష్టం వచ్చినట్టు పెట్టుకొనేవి కావు. ఏవో వొట్టి గుర్తులు కావు. అవి సింబలిస్ట్ అనే ఒక ద్రష్ట చూచిన దృశ్యాలు. ఆ ద్రష్టకు సిద్ధించిన దార్శనిక అనుభూతులు" (రక్తరేఖ, పుటలు 48, 49).

శేషేంద్ర కవితల్లో ఇంచుమించు ప్రతిపాదంలోనూ ఏదో ఒక ప్రతీక, ఏదో ఒక భావచిత్రం తొంగిచూస్తూనే ఉంటాయి. కాబట్టి వాటిని ప్రత్యేకంగా ఉదాహరించడం కష్టం. ఇంతవరకూ ఈ వ్యాసంలో నేను ఉదాహరించిన ప్రతి కవితా ఖండికలోనూ ప్రతీకలు, భావచిత్రాలు పుష్కలంగా ఉన్నాయి. అయినా స్పష్టత కోసం మరికొన్ని ఉదాహరణలిస్తాను:-

**"బాబూ! నదిలో ఇవాళ మనమంతా మునిగిపోతే పోవచ్చు**
**కాని, రేపు నదే సముద్రంలో మునిగిపోయే రోజు రాకపోదు"**

ఇది ఎమర్జెన్సీ కాలంలో శేషేంద్ర వ్రాసిన ఒక అద్భుతమైన ప్రతీకాత్మక కవిత. ఇక్కడ "నది" = ఇందిరాగాంధికి ప్రతీక; "మనమంతా నదిలో మునిగిపోవడం" = ప్రజలందరూ ఇందిరాగాంధి విధించిన ఎమర్జెన్సీతో బాధపడటం; సముద్రం = ఇందిరాగాంధి పతనం (ఎన్నికల్లో ఓడిపోవడం లేదా మరణం).

**5.3.1 సూర్యుడు = సృజనశక్తికి ప్రతీక:** శేషేంద్ర సమగ్రకావ్యం "ఆధునిక మహాభారతం"లో సూర్యుని ప్రసక్తి 95సార్లు వస్తుంది. సూర్యుడు కేంద్రంగా అనేక సందర్భాలలో ప్రతీకలు, భావచిత్రాలు ప్రయోగించారు శేషేంద్ర.

శేషేంద్ర కవిత్వంలో సూర్యుడు సృజనశక్తికి ప్రతీక. ప్రాణులకు జీవనశక్తిని ప్రసాదిస్తాడు సూర్యుడు. వానచినుకు ఊయలలో ఊపుతాడు; బహిరంతరాల తమస్సును హరించే జగచ్చక్షువు సూర్యుడు. **"చెట్లలో సూర్యుడు/మేఘాల్లో సూర్యుడు/జలాల్లో సూర్యుడు/ఆకాశంలో సూర్యుడు/ లోపల సూర్యుడు/ వెలుపల సూర్యుడు"** (మండే సూర్యుడు, పుట.55) – అంటూ ప్రకృతి అంతటా సూర్యుని అంశనే దర్శిస్తూ, లోకమంతా సృజనశక్తి ఫలితమేనన్న భావన కలిగిస్తారు. **"లేస్తోంది ఉషఃకాంతుల్లోంచి ఒక హస్తం..."** అని కర్షకుని లోకబాంధవత్వాన్ని ప్రదర్శిస్తారు. **"దినం పూర్తిగా కొల్లగొట్టి తరిమివేస్తే పాపం! కట్టుబట్టలతో పడమటి పొలాల మీదుగా నిష్క్రమించే"** పీడితుడిగా వర్ణింపబడ్డాడు సూర్యుడు. సుత్తెలు, కొడవళ్ళు లాంటి కిరణాలను ప్రసాదించి కార్యోన్ముఖులను చేసే తేజోమూర్తిగా, ప్రజల బాధల నిశిరాత్రికి స్వస్తి చెప్పి, ప్రభాతాన్ని ప్రకటించటానికి తూర్పు గుడిసె మీద గొంతెత్తిన ఎర్రటి కోడిపుంజుగా లేచిన సూర్యుని ప్రాభవాన్ని అనేక రీతుల్లో వర్ణించారు శేషేంద్ర. (చూ. శేషేంద్ర కవిత్వానుశీలనం, పుట. 67).

**5.3.2 చెట్టు = ప్రాణి తన అస్తిత్వం కోసం చేసే పోరాటానికి ప్రతీక:** మట్టిపొరలను చీల్చుకొని వచ్చి, కాలపు కర్కశ పరశువుకు ఎదురొడ్డి, నిలిచే వృక్షం ప్రాణి అస్తిత్వపోరాటమే కదా!

**5.3.3 చెట్టు = కర్షకునకు ప్రతీక:** తానెంత పరితాపాన్ని అనుభవిస్తున్నా ఆశ్రితులకు శీతలచ్ఛాయతో ఉపశమనం కలిగించే వృక్షంలాంటి వాడు కర్షకుడు.కర్షకునకు ప్రతీకగా వృక్షం శేషేంద్ర కవిత్వమంతటా దర్శనమిస్తుంది. ఎన్ని తుఫానులు చుట్టుముట్టినా, వేళ్ళతో ధరిత్రిని పట్టుకొని ఉండే వృక్షంలాగ, కర్షకుడు ఎన్ని బాధలు వచ్చినా భూమిని వదలి ఎక్కడికీ పోలేడు. ఇద్దరూ ఈ నేలకే అంకితమయి, మట్టిలో కలిసిపోయి, నిరీక్షిస్తూ ఉంటారు. గింజ దిగగానే, చినుకు పడగానే, వారు ప్రేమించిన గర్భంలో ప్రవేశిస్తారు. మనుషుల జన్మలకు మళ్ళీ బీజాలవుతారు.

5.3.4 చెట్టు = శ్రామికునకు ప్రతీక: "చెట్టు గనక పర్వతాగ్రాలెక్కి కేక వేస్తే, చెట్లు గుంపులు గుంపులుగా వస్తాయి .... అన్ని దిక్కుల్నించి, తిరస్కార సూచకంగా తలుపులు, దూలాలు, ద్వారబంధాలు, కుర్చీలు, బల్లలు అన్నీ చెట్లుగా మారి బయటకి వస్తాయి. అరణ్యాల్లోకి పోతాయి. బానిసల్ని చేసే కర్మగారాలన్నీ కూలిపోతాయి. కర్మ ఆగిపోతుంది. కర్త మారిపోతాడు".

పై కవితలోని ప్రతీకను డా॥ పెన్నా శివరామకృష్ణగారు ఇలా వివరించారు: "చెట్లు - తలుపులు, కుర్చీలు, బల్లలు మొదలైన జీవితోపకరణాలుగా మారినట్లే, సమాజ గమనం కోసం 'శ్రమ' రకరకాల ఉద్యోగుల రూపాలు దాలుస్తుంది. చెట్టు కేక వేస్తే, వస్తువులన్నీ చెట్లుగా మారి బయటికి వచ్చినట్టు, ఒక శ్రామికుడు సమ్మెకు (లేదా తిరుగుబాటుకు) పిలుపునిస్తే, వివిధ రూపాలలో ఉన్న శ్రామికులందరూ బయటికి వస్తారు. ఈ విధంగా చెట్టును శ్రామికునికి ప్రతిరూపంగా చిత్రించాడు" (శేషేంద్ర కవిత్వానుశీలనం, పుట, 68).

5.3.5 పక్షి = కవికి ప్రతీక: "గాలిలో విమానంతో పోటీపడుతున్న ఆ పక్షి పక్షి అనుకోకు; అది ఎత్తుల మీద కూర్చుని లేస్తూ పడుతూ నడిచే మానవ నాగరికతల్ని పరికిస్తున్న ప్రాచీనపక్షి - ఏ నాగరికతల్ని మనిషి తన గొప్పతనానికి ప్రతీకలుగా పతాకలుగా ఎగుర వేస్తున్నాడో చరిత్ర పేజీలో, ఆ నాగరకతల్ని పరీక్షిస్తున్న పక్షి".

ఇక్కడ పక్షిని కవికి ప్రతీకగా గ్రహించి, ఆర్షభావన అంతరార్థాన్ని వ్యంగ్యం చేస్తున్నారు శేషేంద్ర. పక్షి తన చూపులతో దూరాలను కొలుస్తుంది; సమస్త ప్రపంచాన్నీ సమీక్షిస్తుంది. అనుభవ జ్ఞాననేత్ర ద్వంద్వంతో మానవుని అతీత వర్తమానాల్ని అనుశీలించి, కవితాశాఖ నధిరోహించి, క్రాంతిగీతాల నాలపించే "కోకిల స్వామి" కవి. అందుకే "వందే వాల్మీకి కోకిలం!" అన్నారు మనవాళ్ళు. (చూ. శేషేంద్ర కవిత్వానుశీలనం, పుట. 69).

5.3.6 పర్వతం = (1) చైతన్యంలేని వ్యక్తికి ప్రతీక (2) ప్రగతి నిరోధకులకు ప్రతీక: అనుభూతికి ఆధారమైన వస్తు సందర్భాల వైవిధ్యాన్ని అనుసరించి, అర్థవైవిధ్యాన్ని కలిగి ఉండే ప్రతీకలు కూడా శేషేంద్ర కవిత్వంలో ఉన్నాయి. పర్వతాన్ని తన అనుభూతికి ఆధారంగా చేసుకున్నారు. రెండు సందర్భాలలో

దాన్ని ప్రతీకగా ప్రయోగించారు. రెండు సందర్భాలలోను ఈ ప్రతీకకు మూలతత్త్వానికి వైరుధ్యం లేకుండా రెండు భిన్నమైన అర్థాలు స్ఫురిస్తాయి:

- **"రూపాల కోసం నిరీక్షిస్తున్న నా దేశపు పర్వతాల్ని సింహాలుగా, ఏనుగులుగా, ఒంటెలుగా, శ్రామికులుగా, వాటి మకుటాల లాంటి ఇతిహాసాలుగా మలచదలచుకున్నా"**
- **"పర్వత శ్రేణులు ప్రభాతాన్ని ఆపగలవా?<br>సూర్యుడు వేయి ఖడ్గాలతో ఛేదించుకుంటూ దూకుతాడు!<br>అన్ని కొండల మీదా ఎర్రజెండాలు నాటుతాడు!"**

మొదటి కవితలో "పర్వతాలు" చైతన్యం లేని వ్యక్తులకు ప్రతీక. రెండవ కవితలో "పర్వత శ్రేణులు" ప్రగతి నిరోధకుల వ్యాపకత్వానికి, సామాజికంగా వారి ఔన్నత్యానికి ప్రతీక.

**5.3.7 ఒక్కొక్క పర్వం – ఒక్కొక్క ప్రతీక:** శేషేంద్ర పూర్వం తాను రచించిన వచన కావ్యాలన్నింటినీ కలిపి ఒకే ఒక సమగ్ర కావ్యంగా "ఆధునిక మహాభారతం" అనే పేరుతో వెలువరించారు. పూర్వం రచించిన కావ్యాలపేర్లు కొంచెం మార్చి, వాటిని ఈ సమగ్ర కావ్యంలో పర్వాలుగా చేర్చారు. ఉదాహరణానికి – నా దేశం నా ప్రజలు = ప్రజాపర్వం; మండే సూర్యుడు = సూర్య పర్వం; గొర్రిల్లా = పశుపర్వం – ఇత్యాదిగా మార్చారు. వీటిలో ఒక్కొక్క పర్వంలో (లేదా కావ్యంలో) మానవుణ్ణి ఒక్కొక్కశక్తికి ప్రతీకగా చిత్రించారు – (చూ. విజయ సారథిగారు రచించిన 'శేషేంద్ర కవితా విశ్వరూపం").

ప్రజాపర్వంలో మానవుడు శ్రమశక్తికి ప్రతీక<br>
సూర్యపర్వంలో మానవుడు సృజనాత్మక శక్తికి ప్రతీక<br>
పశుపర్వంలో మానవుడు క్రియాశక్తికి ప్రతీక<br>
ప్రవాహపర్వంలో మానవుడు చైతన్యశక్తికి ప్రతీక<br>
అద్మీపర్వంలో మానవుడు విప్లవశక్తికి ప్రతీక<br>
ప్రేమపర్వంలో మానవుడు విప్లవశక్తికి ప్రతీక<br>
జ్యోత్స్నాపర్వంలో మానవుడు మానవతాశక్తికి ప్రతీక<br>
మయూరపర్వంలో మానవుడు స్వప్నశక్తికి ప్రతీక

విజయసారథిగారు ఆధునిక మహాభారతంలోని రెండు పర్వాలను వదలివేశారు. అవి "సముద్రపర్వం" – "మౌక్తిక పర్వం". సముద్ర పర్వంలో

మానవుడు అనుభూతి శక్తికి, మౌక్తిక పర్వంలో మానవుడు చమత్కార శక్తికి ప్రతీకలుగా గ్రహింపవచ్చును.

ఈ విధంగా శేషేంద్ర కావ్యాలన్నీ మానవునిలోని ఒక్కొక్కశక్తికి ప్రతీకలుగా తీర్చిదిద్దబడ్డాయి. కావ్యంలో అక్కడక్కడ ప్రతీకలు ఉండటం సహజమే. కాని ఈ విధంగా మొత్తం కావ్యాన్నే ఒక ప్రతీకగా నిర్మించడం శేషేంద్ర ప్రతిభకు గొప్ప నిదర్శనం!

*(సశేషం)*



# అవధాన మహిమ: మెదడు మీద పరిశోధన

**– ఆచార్య తంబిశెట్టి రామకృష్ణ**

("2005, ఫిబ్రవరి 25న ప్రసారమయిన 'అవధాన మహిమ' ఉపన్యాసంలో, భావ పరిపుష్టి, వ్యాకరణ సంక్లిష్టత మెండుగా వున్న – పద్యరచన, పద్యపఠనం మెదడు ఎదుగుదలకు – ఎలా దోహదకారి కాగలవో – వివరించారు ప్రొఫెసర్ తంబిశెట్టి రామకృష్ణగారు. 2006, ఫిబ్రవరి 27న, మహాసహస్రావధాని, డా. గరికిపాటి నరసింహారావుగారు అష్టావధానం చేయగా, వారి మెదడు పనితీరును గురించి చేసిన పరిశోధన విశేషాంశాలను, వారీ ప్రసంగంలో వివరిస్తున్నారు – శ్రీమతి నీలిమగారు.)

బహుశా Cognitive Neuroscience అనబడే శాస్త్రీయ పరిశోధనా రంగంలో, మెదడు-భాష (Brain and Language) అనే ఆ రంగంలోని ఉప విభాగంలో, 2006వ సంవత్సరంలో ఫిబ్రవరి 27న చరిత్ర సృష్టించబడిందని చెప్పుకోవచ్చు. 'అష్టావధానం-మెదడు పనితీరు' మీద శాస్త్రీయ పరిశోధన చేసుకోవడానికి అనుమతినిచ్చిన డా॥ గరికిపాటి నరసింహారావుగారికి ముందుగా కృతజ్ఞత చెప్పుకోవడం నా ధర్మం. పృచ్ఛకులుగా వ్యవహరించిన కవి పండితులు, శ్రీయుతులు డా॥ మన్నవ భాస్కరనాయుడుగారు, జోళదరాశి చంద్రశేఖర రెడ్డిగారు, చిలకల వెంకట సుబ్బారెడ్డిగారు, ఇంద్రకంటి పినాకపాణిగార్లు అభినందనీయులు. ఈ పరిశోధనలో భాగస్వాములు, ఆచార్య టి.ఆర్.రాజుగారు, డా॥ బిందుకుట్టి, డా॥సులేఖ, శ్రీ రామచంద్ర మరియు వారి సహోద్యోగులు. ఈ పరిశోధన బెంగుళూరులోని NIMHANS గా ప్రసిద్ధికెక్కిన, National Institute of

Mental Health and Neurosciences లోని Neurophysiology విభాగంలో జరిగింది. మొత్తం అవధానము-పరిశోధన వీడియో ద్వారా-సిడిలో నిక్షిప్తం చెయ్య బడింది. ఈ పరిశోధనలో ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు, డా॥ సోమశేఖర్‌గార్లు ఎంతగానో తోడ్పడ్డారు.

ముందుగా మెదడుమీద పరిశోధన ఎలా చెయ్యబడిందో వివరిస్తాను. అవధాని, కుర్చీలో ఆసీనులై, మామూలుగా అవధానం ఎలా చేస్తారో అలాగే చేశారు. వారి తలకు, 16 తీగెలు - అంటే Electrodes తో కూడిన వైర్లన్నమాట - అమర్చబడ్డాయి. ఈ తీగెల ద్వారా, వారి మెదడులోని విద్యుత్తరంగాలు, Electroencephalography అనే యంత్రం ద్వారా Record చెయ్యబడి, Computer లో నిక్షిప్తం చెయ్యబడ్డాయి. ప్రయోగశాల - పరిమితులవల్ల, అవధానం ఈ క్రింది ప్రక్రియలకు పరిమితం చేసుకోవలసి వచ్చింది. (1) నిషిద్ధాక్షరి, (2) సమస్యా పూరణం, (3) దత్తపది (4) వర్ణన, (5) వ్యస్తాక్షరి, (6) అప్రస్తుత ప్రసంగం.

మెదడులోని విద్యుత్తరంగాలను ముందుగా, అవధాని కళ్ళు తెఱచి వుంచిన స్థితిలోను, ఆ తరువాత కళ్ళు మూసివున్న స్థితిలోను Record చెయ్యటం జరిగింది. ఈ Recording ద్వారా అందరిలోను సామాన్యంగా కనిపించే లక్షణాలు - మేధాతరంగాల్లో వున్నాయా అని తెలుసుకోవచ్చు. సెకనుకు ఎన్ని భ్రమణములు ఉన్నాయి? Micro Volts లో వాటి పరిమాణ మెంత? అనే రెండు కొలతల్ని బట్టి, ఈ తరంగాల గుణవిభజన జరుగుతుంది. Alpha తరంగములు సెకనుకు 7.5 నుండి 13 భ్రమణములు కలిగి వుండగా, Theta తరంగములు సెకనుకు 3.5 నుండి 7.5 వఱకు, Delta తరంగములు 3 లేక అంతకంటె తక్కువ భ్రమణములు కలిగి వుంటాయి. ఇందుకు భిన్నంగా, తరంగముల శక్తి, Alpha లో తక్కువగాను, Theta లో అంతకంటె ఎక్కువగాను, Delta లో అత్యధికంగాను వుంటాయి. Alpha తరంగములు మెదడుకు Occipital Lobes అనబడే వెనుక భాగములో ఎక్కువగా ఉంటాయి. Theta, Delta లు Frontal Lobes అనబడే ముందుభాగములో ఎక్కువగా ఉంటాయి. Alpha ను, ఒక తటాకంలో మెల్ల మెల్లగా కదులుతూవున్న చిన్న అలలతో పోల్చుకోవచ్చు. ఇది మెదడుయొక్క ప్రశాంత స్థితికి సంకేతం. తటాకంలో ఒక రాయి విసిరినప్పుడు ఉద్భవించే పెద్ద అలలతో Theta, Delta లను పోల్చుకోవచ్చు. ఇది, మెదడు నిశితమైన ఆలోచన ద్వారా, ఏదో ఒక పనిలో నిమగ్నమై వున్నప్పుడు జరుగుతుంది. వీటికి తోడు Beta, Gamma అనే తరంగాలు కూడా వుంటాయి. కేవలం శ్రవణ మాధ్యమం ద్వారా, వాటి విశదీకరణ, అవగాహన సులభసాధ్యం కాదు గనుక, వాటి జోలికి ప్రస్తుతం వెళ్ళటం లేదు.

ఉదయం, 11.35కు అవధానిగారి మేధావిద్యుత్తరంగాల సామాన్యస్థితి Record చేశాక, వారు ప్రయోగశాల పరిస్థితులకు, అలవాటు పడటానికి ఓ గంట సమయం ఇవ్వడం జరిగింది. 12.35 గంటలకు, అవధానం, అవధానిగారి ప్రార్థనతో మొదలయ్యింది.

**ఈ యవధాన మేమి? తనువెక్కిన తీగెల పందిరేమి? పె**
**ద్దాయన రామకృష్ణ, మన అంతరవేది జరుంగునట్టి, ధీ**
**వాయు విహారముల్ గనగ పడ్డ పరిశ్రమ ఏమి? అమ్మా, ప**
**ద్మాయత నేత్ర యుగ్మముల సంతయు చూడుము, నన్ను బ్రోవుమా**

తరువాత, నిషిద్ధాక్షరిలో, శ్రీ కృష్ణదేవరాయలను కీర్తిస్తూ, కందం చెప్పమని, అందంగా కందంలోనే అడిగారు పృచ్ఛకులు:

**అందమ్ముగ కందమ్మున**
**వందితు శ్రీ కృష్ణరాయ వసుధీశు, ఘనున్**
**పొందుగ కొనియాడుమయా**
**విందుగ మా హృదులకెల్ల విబుధ వతంసా -**

"శ్రీ" అని అవధానిగారు మొదలు పెట్టగానే, "కృ" నిషేధించబడింది.

అవధానిగారు "రా" అనగానే "జ" నిషేధమన్నారు పృచ్ఛకులు.

ఇలా, నిషిద్ధాక్షరి మొదటి పాదం సాగుతూ వుండగా, అప్రస్తుత ప్రసంగం రానే వచ్చింది! **"అవధానిగారూ, ఎలా వుంది - Electrodes మధ్య అవధానం చేస్తున్న అనుభూతి?"** అని అడిగారు పృచ్ఛకులు - సమాధానంగా నరసింహారావుగారు ఇలా అన్నారు - **"వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లుంది - అంటాం గదా - ఇక్కడైతే మరి తలకు తగిలినట్లుంది, అంతే తేడా"**. వెంటనే వ్యస్తాక్షరి మొదలయ్యింది. ఇచ్చిన **9**వ **అక్షరం "నీ"**- అని చూపెట్టి, అక్షరం రాసివున్న కాగితాన్ని పారేశారు-అవధానిగారు.

ఇహ, సమస్యాపూరణంలో ఈ క్రింది సమస్య ఇచ్చారు, పృచ్ఛకులు.

**"బకజపములు సల్పి ముక్తి బడయగ వచ్చున్"** వెంటనే, సమాధానంగా, అవధానిగారు మొదటి పాదం ఇచ్చారు - **"పకపకలును వికవికలును"** - పైగా - **"మూడో పాదంలో సమస్యకు సమాధానం దొరుకుతుంది. ఇది ఏ బకమో చూద్దాం"** అన్నారు. వెంటనే, వ్యస్తాక్షరిలో **4** వ **అక్షరం "వి"** అని ఇచ్చారు పృచ్ఛకులు. వెను వెంటనే, దత్తపదిలో - ఈ క్రింది పదాలను ఉపయోగిస్తూ, శ్రీరామచంద్రుని వర్ణించమన్నారు పృచ్ఛకులు.

"క్యాన్సరు, టి.బి., ఎయిడ్స్, బి.పి."

ఇంతలో, వ్యస్తాక్షరిలో ఇచ్చిన 15వ అక్షరం 'డ' అని పృచ్ఛకులు ఇచ్చిన అక్షరాన్ని చూపించి, వెంటనే, దత్తపదిలో మొదటిపాదం ఇలా పూరించారు:

**"సారోదార శుభ స్వభావమునసే శక్యాన్సరోజాంబకాన్"**

ఇలా మొదటి పాదం ముగించారో లేదో, వ్యస్తాక్షరి - **మొదటి అక్షరం "నై"** అని తెలియజేశారు అవధానిగారు. వెనువెంటనే, వర్ణన కోరుతున్న పృచ్ఛకులు, **ఋషిత్రయము అనసూయను వివస్త్రయై భోజనము వడ్డించమన్నప్పుడు - ఆమె మనోభావన ఎట్లుండవచ్చునో - ఉత్పలమాలలో వర్ణించవలసినదిగా కోరారు.** సమాధానంగా అవధానిగారిచ్చిన మొదటి పాదం -

**"ఈ పరమర్షులేమి? నను నిట్టి పరీక్షలు బెట్టుటేమి? ఏ"** ఇలా మొదటి ఆవర్తం పూర్తి చేసి, రెండో ఆవర్తంలోకి వెళ్ళారు, అవధానిగారు. ఇలా 12.35 గం.లకు మొదలుపెట్టి, వివిధ ప్రక్రియల్లోకి వెళ్ళి, పృచ్ఛకులకు ఒక్కో ఆవర్తంలో సమాధానాలిచ్చుకుంటూ, అప్రస్తుత ప్రసంగానికి ఛలోక్తులతో స్పందిస్తూ, 1.40కి అవధానం పూర్తిచేశారు నరసింహారావుగారు. ఆ తరువాత, మూడు నిమిషాల వ్యవధిలో ధారణ పూర్తిచేశారు. ధారణ ప్రాముఖ్యాన్ని తెలియజేస్తూ, ఆశువుగా వారు చెప్పిన పద్యం ముందుగా వినిపించి, ఆ తరువాత, ధారణలో వారు వినిపించిన అన్ని పద్యాలను వినిపిస్తాను:

**హారము లేని కారు, సుమహారము లేని పూజ, చిల్లు సిం**
**గారము లేని గారె, మమకారము లేని బంధువర్గమున్,**
**కారము లేని కూర, అవగాహన లేని వివాహబంధమున్,**
**ధారణ లేని యట్టి యవధానము, వ్యర్థములీ ధరిత్రిలో**

**నిషిద్ధాక్షరి:**

**శ్రీరాయలు రాజై నా**
**డే రాణిన్ జేసె తెగునెటీ యాగంబుల్**
**ఆ రాజు స్ఫూర్తిగా గొని,**
**మీరే వెలిగింపుడయ్య మీ తెలుగికపై.**

**సమస్యాపూరణం:**

**పకపకలును వికవికలును**
**చకచక ముగియించి, చిత్త సారసమందున్**

శుకుని గతి నెంచి, నిమిషాం
బక జపములు సలిపి ముక్తి బడయగ వచ్చున్.

దత్తపది:

సారోదార శుభ స్వభావముననే శక్యాన్సరోజాంబికాన్
ధారాపాతగతాన్ నిరూప్య నృపరాట్ ధాటీ బిడౌ జాకృతిన్
దూరీకృత్య రఘూత్తమో విలసతే ద్యోభీ పినాకయుతే
పారంపర్య మనంగ తానె యిడు శుభ్రప్రాభవంబుల్ సదా.

వర్ణన:

ఈ పరమర్మలేమి? నను నిట్టి పరీక్షలు బెట్టుటేమి? ఏ
పాపము మూటగట్టి, ఋషి పత్ని ప్రతిష్టను గూల్చువారొ? నే
పాపలజేసెదన్, పసిడి పాలకు గిన్నెల జేసెదన్, ధరన్
శాపములే వరంబులగు సాధ్వులకున్ సుగుణాల మాధ్వికిన్.

వ్యస్తాక్షరి:

"నైతిక విలువల నీడ నరుని జాడ"

ముగింపు:

"నచ్చిన జాలు మీకు, వదనంబులు విచ్చిన జాలు, శారదా
సచ్చరింతంబు బాడుటకు జన్మము లెత్తెద వేనవేలు, ఏ
మిచ్చిన, నీయకున్న మనసిచ్చిన జాలును, భారతీకృషన్
పచ్చగ నుండుడింక సెలవా, ఇలువాకిలి జూచుకోవలెన్"

అంటూ, సెలవు తీసుకున్నారు అవధానిగారు.

ఇక అవధానియొక్క మేధావిద్యుత్తరంగాల విశ్లేషణ, అవధానప్రక్రియలతో వాటి అన్వయం గురించి చెప్పుకుందాం. వారి Alpha తరంగములు కళ్ళు మూసివున్నప్పుడు ఎక్కువగాను, కళ్ళు తెరిచినప్పుడు అంతకంటె తక్కువగాను ఉన్నాయి. ఇది అందరిలోనూ కనిపించే సామాన్య లక్షణం. అవధానం చేస్తున్నప్పుడు, Alpha తరంగములు తక్కువ కావటం, Theta, Delta తరంగములు ఎక్కువ కావటం జరుగుతోంది. ఇక్కడ, తగ్గుదల, హెచ్చుదల అంటే, Micro Volts అనబడే కొలమానం ద్వారా తరంగముల శక్తి (Power) ని అంచన వేస్తున్నామన్నమాట. Theta తో పోల్చినప్పుడు Delta తరంగముల శక్తి మరీ ఎక్కువవుతోంది.

వివిధ ప్రక్రియల్లో ఇవి ఎలా మారుతున్నాయి? - అని పరిశీలిస్తే - సమస్యా పూరణం మరియు దత్తపది ప్రక్రియల్లో Theta ఎక్కువగా కనిపించింది. అప్రస్తుత ప్రసంగంలోను, వ్యస్తాక్షరి లోను - ఆ క్రమంలో Delta తరంగముల శక్తి ఎక్కువగా కనిపించింది. అప్రస్తుత ప్రసంగానికి, అవధాని స్పందిస్తున్నప్పుడు, మెదడు యొక్క Frontal Lobe అనబడే ముందు భాగములో, కుడివైపు, Delta శక్తి, అత్యధికంగా కన్పించింది. ఇవీ, స్థూలంగా, అవధానం చేస్తున్నప్పుడు, మెదడులోని విద్యుత్తరంగముల శక్తిలో కనిపించిన మార్పులు. ఈ మార్పుల్ని - మెదడు పనితీరుతో - అన్వయించుకోవడం ఎలాగో వివరిస్తాను.

Theta, Delta తరంగముల శక్తి ఎక్కువ కావడం - అనేది మెదడు ఏదైనా పనిలో నిమగ్నమవడాన్ని సూచిస్తోంది. అలాగే Alpha తరంగముల యొక్క శక్తి తగ్గుదల కూడ. అయితే, ప్రక్రియను బట్టి, ఈ హెచ్చు తగ్గులు - మెదడులోని - తరంగములు Record చెయ్యబడ్డ ఐదు భాగములలో - వివిధ మోతాదుల్లో జరుగుతోంది. మెదడు చేస్తున్న పనియొక్క సరళతను బట్టి, ఆ పనియొక్క నైజమును బట్టి - అనగా - మెదడు వ్యాకరణసూత్ర నిబద్ధత ననుసరించి, వాక్యనిర్మాణం పద్యపాద నిర్మాణం చేస్తున్నదా, లేక ఇదివరలో గ్రహింపబడి, నేర్చుకోబడి నిక్షిప్తం చేయబడ్డ విషయాన్ని పునశ్చరణ చేసుకుని, ఆ విషయాన్ని ఇప్పుడు ఉపయోగించుకుంటూ వుందా - అనే అనేక విషయాల్ని బట్టి - మెదడులోని వివిధ నాడీకణ సముదాయములు (Crotical Neuronal Assemblages) పనిచేయడం ప్రారంభిస్తాయి. అంటే, ఒక్కొక్కరకమైన పనికి, ఒక్కొక్క సముదాయం పనిచెయ్యటం ప్రారంభిస్తే, మరో సముదాయం పనిచెయ్యటం మానివేయడం, లేదా తక్కువగా పనిచెయ్యటం, జరుగుతోందన్న మాట. ఉదాహరణకి - ఏదైనా ఆలోచన తళుక్కున మెరిసినప్పుడు Delta తరంగముల శక్తి, ఎక్కువ కావడం జరుగుతుంది. పైగా మెదడుయొక్క కుడివైపునున్న నాడీకణముల సముదాయము - ఊహకు, సృజనాత్మకతకు - పనిచేసేవిగా మనకు తెలుసు. అప్రస్తుత ప్రసంగం, అవధాని యొక్క సమయస్ఫూర్తికి, ఊహా శక్తికి, పెద్ద పరీక్షగా మనం భావించవచ్చు. అలాంటి అప్రస్తుత ప్రసంగానికి అత్యంత సమయస్ఫూర్తితో, ఊహాశక్తితో - జవాబులు చెబుతున్నప్పుడు, అవధాని యొక్క మెదడు ముందు భాగములో కుడివైపున వున్న నాడీకణముల సముదాయము నుండి వస్తున్న Delta తరంగముల శక్తి ఎదుగుదల స్వాభావికంగానే కనిపించవచ్చు. కాని, అన్నింటికంటే - ముఖ్యమైన విషయం ఇదీ - అవధానంలో కవి, అందరి పృచ్ఛకులకు వరుసగా సమాధానాలు ఇచ్చుకుంటూ వస్తున్న

సమయంలో, ఆయా ప్రక్రియలకు - అది వరకు ఇచ్చిన సమాధానాలు / లేక పద్య పాదాల మీద తన ఏకాగ్రతకు (Sustained Attention) భంగం రానీయకుండా - అడిగినప్పుడల్లా - అప్రస్తుత ప్రసంగానికి - చటుక్కున సమాధానమిస్తాడు! అంటే, ఒక్కొక్క ప్రక్రియకు, ఒకొక్క నాడీ కణముల సముదాయాన్ని, మెదడులోని కుడి, ఎడమ భాగములను మారుస్తూ ఉపయోగించుకోవటంలో, అవధాని అద్భుతమైన, ఆశ్చర్యకరమైన ప్రతిభను కనపరుస్తున్నాడన్నమాట! వివిధ కణముల సముదాయములను - ఉపయోగించుకోవటం అనేది - అతి వేగవంతంగా కూడా జరుగుతోంది. అయితే - ఇదంతా - వారి ఆసక్తి మరియు ప్రతిభ మాట అటుంచి, అవధాని ఏదో ఒక పద్ధతిద్వారా, ఇచ్చుకున్న లేక పుచ్చుకున్న తర్ఫీదు ద్వారా సాధ్యమయిందా? అనేది మిగిలిపోయిన ప్రశ్న. అలాంటి తర్ఫీదు లేక, ఆ రకమైన తర్ఫీదును మన విద్యావిధానంలో పొందు పరచకపోవటం చాల ఆశ్చర్యకరమైన విషయం. ఎందుకంటే, మానవ నాగరికతా విలువల విస్తరణ, ఎదుగుదల అంతా, మన మేధాశక్తిని ఎలా, ఇతోధికంగా, ఉపయోగించుకోగలం? అన్న ప్రశ్న మీదే ఆధారపడి వుంది. అవునా? భాషా ప్రయోజనాల అధ్యయనానికి పెద్దపీట వేస్తూ, పురుడు పోసుకున్న, ద్రావిడ విశ్వవిద్యాలయంవంటి ఉన్నత విద్యాసంస్థలు, ఈ దిశలో ప్రయోగాలకు, వాటి ప్రయోజనాల విస్తరణకు నాంది పలుకుతాయని ఆశిద్దాం - శుభస్య శీఘ్రం - సెలవా మరి!

*సర్వేజనా: సుఖినోభవంతు!*

(ఈ పరిశోధనకు, Indian Academy Group of Institutions, Hennur Cross Road, Bangalore వారి పరిశోధనావిభాగం అందించిన సహకారానికి కృతజ్ఞుణ్ణి)

*(ఇది, All India Radio, Bangalore స్టేషన్ నుండి, "స్నేహ భారతి" కార్యక్రమంలో 2006లో ప్రసారమయిన ప్రసంగపాఠం.)*



"పొద్దు పోవకపోవటం మృత్యులక్షణం
పొద్దు చాలకపోవటం జీవలక్షణం"

- మధురాంతకం రాజారాం

# హైకూ శతకం

- డా॥ కాసల నాగభూషణం

(గత సంచిక తరువాయి)

39. కర్ణుడు గుర్తొచ్చాడు
కుంతికి, కృష్ణుడికి -
యుద్ధం ముందు!

40. కర్ణుడికి
భీష్ముడితో తగాదా! -
పాపం, దుర్యోధనుడు!

41. పరసతిని
మరొకడి కెరవేస్తే -
వాడు దేవుడు!

42. చుక్కలు పెట్టి
ముగ్గు గియ్యడం మరిచారు -
ఆకాశంలో!

43. పదేళ్ళలో
కోట్లు గడించాడు
ప్రజాసేవ చేసి చేసి!

44. నీ ముఖంలో
మనసు తెలిస్తే
మరి మాటల్లో, చేష్టల్లో?

45. భాష పువ్వు
సాహిత్యం తావి
విడదీస్తాడు శాస్త్రవేత్త!

46. మనసంతా
లేడీ కొలీగ్!
తన పెళ్ళాం - మరొకడి కొలీగ్!

47. డబ్బులయినా
తీరికయినా
ఎక్కువయితే అనర్థమే!

48. దేశ భవిష్యత్తు
యువతరం మీద!
యువత-'రం' మీద!

49. మగవాళ్ళు
చాలా మంచివాళ్ళు -
ఆడవాళ్ళ నడగండి!

50. నిరాశే! -
అమృత ఫలం ఆశిస్తే -
నాటింది విషబీజం!

51. అసలు రంగు
బైట పడ్డది -
వర్షమొచ్చి వెలిశాకే!

52. ఎంత దేవుడయినా
తప్పలేదు
చేతిలో ఆయుధాలు!

53. నీ గురించి
నువ్వే చెప్పుకో! -
ఎదుటివాడు చెప్పడుగా!

54. సెక్సెడ్యుకేషన్
నేర్పాలా?
అసలే ఆకలి - సింహాలకి!

55. ఒక్కచోట
ఇద్దరు చేరితే
మూడోవాడు చాట్ మసాలా!

56. ఆగి ఆలోచిస్తేనే
తప్పో, ఒప్పో!
చేసేస్తే -అంతా ఒప్పే!

57. హంతకుడే!
వదిలెయ్యండి పాపం!-
ఎందర్ని చంపాలో!

58. మృగంలోంచి మనిషి!
డార్విన్ దాకా ఎందుకు?
తనే సాక్షి!

59. అన్నం కాదు
మనుషులు కావాలి -
కళ్ళలో ఆకలి!

60. అపార్థాలకి
వడలిపోయే పువ్వు -
ఆడదాని నవ్వు!

61. ఇచ్చేవాళ్ళుంటే
అడిగేవాడికి
ఏదయినా లంచమే!

62. ఆర్టిస్టో,
సైంటిస్టో! - తర్వాత!
ముందు నువ్వు మనిషివి కా!

63. విలువలు
దేవతా వస్త్రాలు!
లేవనే కుర్రాళ్ళు లేరు!

64. సాయం కోసమేనా?
జాగ్రత్త! -
ఆ చెయ్యందుకుంటాడు ముందు!

65. అరవై
అని సంతోషమా!-
పోయిన వలబై మార్కులు?

66. ఒక్కసారి
మూతి కాలింది -
మరోసారి వెళ్ళిందా పిల్లి?

67. పరిచయస్థులే
అందరూ!
ఆదుకుంటేనే స్నేహితులు!

68. మాంసాహారి
మరీ మాట్లాడుతున్నాడు -
అహింస గురించి!

69. స్వార్థమే చూసుకుంటే
తప్పు లేదు!-
పరార్థం ఆశిస్తేనే!

70. గుండెల్లో
తూటా ఒకసారే!
మాట? - గుర్తొచ్చినప్పుడల్లా!

71. పెరటి చెట్టుకి
నీళ్ళు పొయ్యం - కొట్టేస్తాం! -
పక్కింట్లో కాస్తే!

72. వాన నీళ్ళు
క్షాళనం చేస్తే
ఎంత స్వచ్ఛమో నేలతల్లి!

73. సత్యం జయిస్తుంది
పొరపాటున -
అసత్యం ఓడిపోతే!

*(సశేషం)*



# రెండు సరదా హైకూలు

**- ముళ్ళపూడి వెంకటరమణ**

గత సంచికలో డా॥ కాసల నాగభూషణంగారి "హైకూ శతకం" ప్రచురించడం ప్రారంభించాము. అందులో ఒక హైకూ ఇలా ఉంది. (18వ హైక్కూ, పుట.137).

"తల్లులు ముగ్గురు -
ఐనా రాముడు
ఏకపత్నీవ్రతుడు!"

దీనిని చదివిన ప్రముఖ సినీ రచయిత శ్రీ ముళ్ళపూడి వెంకటరమణగారు తనకు "సరదాగా తోచిన" మరో రెండు హైకూలు వ్రాసి నాకు పంపించారు:

(-సంపాదకుడు)

"తల్లులు ముగ్గురు -
అందువల్లే రాముడు
ఏకపత్నీవ్రతుడు"

"ఒక ఆలిని మెప్పించడానికి
ఇద్దరు తల్లులను నొప్పించాడు
ఒక తండ్రి"



# A TIME FOR INTROSPECTION

Netaji Subhas Chandra Bose's life and times were truly a saga of sacrifice and relentless fight against the British colonial rulers in the nation's freedom movement. In spite of his differences with Mahatma Gandhi over the path he chose to fight the British rulers, Netaji's contribution to the freedom struggle inspired a whole generation and made him a darling of the nation till his political career ended abruptly in an air crash. The committee set up by the Centre to celebrate the centenary of Netaji's birthday has an ambitious agenda. To mark the event, the Government, true to its style, proposes to release a commemorative stamp. The centennial birth anniversary was also observed as a public holiday though Netaji's nephew and a popular figure in his own right, Mr. Sisir Bose, did not think it a fitting way of paying homage to the memory of the departed leader. To many the revelation at the Planning Commission function on Wednesday by its Deputy Chairman, Prof. Madhu Dandavate, that Netaji was the first to realise the need for planning in free India would come as a surprise but Netaji's blueprint for economic development had also indisputably subscribed to the socialist doctrine. To celebrate the birth centenary, the committee should draw up an imaginative programme by highlighting Netaji's ideals and achievements to "generate a new breed of youth" much as he did in his time.

The turmoil witnessed in Bengal at the turn of last century inevitably influenced the political career of Netaji. His militant ways had drawn the youth in Bengal and Punjab to the freedom movement, in striking contrast with the rest of the country where Mahatma Gandhi had been immensely successful in mobilising all sections of the community, including the masses in his non-violent struggle against the British rule. Born on January 23, 1897 at Cuttack in Orissa, Netaji had a brilliant academic career. Incensed by the racial attitudes of the British rulers and

their exploitation of India, he was ready to make compromises with the extremists but had little patience with the moderates in the Indian National Congress, which spearheaded the freedom movement. Disillusioned with the factional politics of the Congress, Netaji rallied round him the radical elements in the party. The final parting of ways with the Congress came later in controversial circumstances which left few options for Netaji as Mahatma Gandhi had not favoured his election to the presidentship of the party. It was clear that the Bengal school led by Netaji had little support in the Congress Working Committee since the Haripura session. This development only helped the radical politics of Netaji and the birth of the Forward Bloc, which has survived now to become a member of the ruling coalitions in West Bengal and at the Centre.

Netaji's great escape from house arrest at his Elgin Road (now Lala Lajpat Rai Sarani) residence in Calcutta and his meetings with the German and Japanese leaders to mobilise their support for his "war of liberation" had pushed him to the centre of a major controversy in the mid-Forties. But his slogans 'Delhi chalo' and 'Jai Hind' had undoubtedly boosted the morale of freedom fighters and mesmerised the people. Following the surrender of Japan, when the Indian National Army (INA) ended its brief but stunning career, its stalwarts had all become national heroes. The events only proved how astute Mahatma Gandhi was in his political judgment in waging a non-violent struggle to free this country. But there is little doubt that Netaji, too, made a significant contribution to the freedom movement by hastening the withdrawal of the British from the sub-continent. Hopefully, the year-long centenary celebrations will highlight the multifaceted personality of Netaji and his selfless sacrifice for the cause of India's freedom.

*(Courtesy: The Hindu, Friday, January 24, 1997)*



# బోయి భీమన్న 'జన్మాంతర వైరమ్' - సవిమర్శక పరిశీలన

- డాక్టర్ కె. సంజీవరావు (శిఖామణి)

మహాకవి, పద్మభూషణ్ డా. బోయి భీమన్న తెలుగు సాహిత్యంలో పండించని ప్రక్రియా పంటలేదు. పద్యకావ్యం, గేయ కావ్యం, వచన కావ్యం, నాటకం, నాటికలు, సాహిత్య విమర్శ, పీఠికలు, తత్వశాస్త్రం ఇలా అనేక ప్రక్రియలలో తనదైన ముద్రతో రచనలు చేసినవారు. ఏ ప్రక్రియను చేపట్టినా దళితాభ్యుదయం దాని ప్రథమ లక్షణం. సౌందర్య తత్వవివేచన గౌణం. తెలుగు భాషమీద సమధికారమైన ప్రభుత కలిగిన వాడే ఇన్ని ప్రక్రియలను సమర్థవంతంగా నిర్వహించగలడు.

అశోకవనిలో రాముడు, మణిమానసం వంటి పద్యకావ్యాల కోవలోకి చెందిందే 'జన్మాంతర వైరమ్' కావ్యం. దీనికి 'కర్మ సిద్ధాంత కావ్యం' అనే ఉపశీర్షికను పెట్టడంవల్ల కావ్యంలోని వస్తువు సూచితమైంది. 'జన్మాంతర వైరమ్' అంటే అనేక జన్మల నుండి పరంపరాగతంగా వస్తున్న శత్రుత్వం అని తెలుస్తోంది. ఎవరి మధ్య ఈ శత్రుత్వం అని ప్రశ్నించుకుంటే బ్రాహ్మణులకు అస్పృశ్య కులాలవారికి అని సమాధానం. 'కర్మ సిద్ధాంతం కావ్యం' అనే ఉపశీర్షిక ద్వారా ఈ కావ్యంలో వస్తువు కర్మసిద్ధాంతం ఆధారంగా రూపొందించబడినట్టుగా గ్రహించవచ్చు.

భారతీయ సమాజంలోని హిందూవ్యవస్థలో కర్మసిద్ధాంతానికి అధిక ప్రాముఖ్యం యివ్వబడింది. అనాదిగా హిందూ వ్యవస్థలో వర్ణ వ్యవస్థ మనుగడకు ఈ కర్మసిద్ధాంతం అధికార ముద్రగా పనిచేస్తు వస్తున్నది -

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః
తస్య కర్తారమపి మాం విద్ధ్య కర్తార మవ్యయమ్

*- భగవద్గీత, జ్ఞానయోగం-13*

అని గుణకర్మలను బట్టి మానవులు నాలుగు వర్ణాలుగా నాచేత సృష్టించబడ్డారు అని గీతాకారుడు చెప్తున్నాడు. అంతకు పూర్వం ఋగ్వేదం పదవ మండలంలోని పురుష సూక్తంలో విరాట్ పురుషుడి వివిధ శరీరభాగాల నుండి చాతుర్ వర్ణాలు వెలిశాయని చెప్తుంది.

శ్లో॥ బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్ / బాహూ రాజన్యః కృతః
ఊరూ తదస్య యద్వైశ్యః / పద్భ్యాం శూద్రో అజాయత

ఈ పుట్టుక క్రమమే ఆ తర్వాత వారి సామాజిక హోదాను నిర్ణయించే కీలక అంశం అయింది.

## కావ్యం ప్రతిపాదించే వస్తువు:

కర్మసిద్ధాంతం అంటే తాను చేసిన పనికి తత్సంబంధమైన ఫలితాన్ని అనుభవించడం. అనుభవించడం అనేది ఈ జన్మలో కావచ్చు.జన్మాంతరంలో కావచ్చు.

"గత జన్మలో అస్పృశ్యతను పాటించిన బ్రాహ్మడే, తత్కర్మానుభవం కోసం ఈ జన్మలో అస్పృశ్యుడై పుడతాడు. గత జన్మలో అస్పృశ్యుడుగా బాధపడ్డ హరిజనుడే ఈ జన్మలో పగతీర్చుకోవడం కోసం, అస్పృశ్యతను కఠినంగా అమలుజరిపే బ్రాహ్మడై పుడతాడు" కర్మ సిద్ధాంతం ప్రకారం ఆలోచిస్తే ఇదీ సిద్దాంతం.

అయితే అంబేద్కరు అనుయాయిగా భీమన్నగారు ఈలాంటి పాతచింత కాయపచ్చడిలాంటి కర్మ సిద్ధాంతాన్ని నమ్మడంలో అర్థం వుందా? ఇది వైరుధ్యం కాదా? అనే అనుమానం రావచ్చు. దీనికి గ్రంథ పీఠికలో కవిగారే యిలా తెలియజేస్తున్నారు.

"కర్మసిద్ధాంతం తప్పు అనేది నా ఊహకందిన సత్యం. జన్మాంతర కర్మానుభవం అనేది హిందువులలో వున్న నమ్మకం" పుట:157.

ఆ హిందువులలో వున్న నమ్మకం వల్లనే వారిలో పరివర్తన తీసుకురావాలనే ఉద్దేశంతో ఈ కావ్యం రాసాడు భీమన్న. జన్మ పరంపర లేకపోవడమే మోక్షం అని హిందువుల నమ్మకం. మీకు పునర్జన్మ లేకుండా, మోక్షం కావాలంటే అస్పృశ్యతలాంటివి పాటించొద్దని సూచిస్తున్నాడు కవి. దీనిని మరో మూడు అంశాలలో వివరిస్తున్నాడు.

1. హిందూ మతం చెబుతున్న పూర్వజన్మ కర్మ సిద్ధాంతం నిజమైతే ఈ కావ్యగత సంఘటనమూ నిజమే.
2. కర్మ సిద్ధాంతం నిజం కాకపోతే – ఇదీ నిజం కాదు.
3. నా ఉద్దేశం మాత్రం – కర్మ సిద్ధాంతం వట్టి స్వార్థపరుల కల్పన అని. దానిని కొనసాగనివ్వకూడదని.

కర్మ సిద్ధాంతం గురించి భీమన్నగారికి వున్న స్పష్టమైన అభిప్రాయాలు ఇవీ. అయినా వాటిని ఆయన ప్రక్కన పెట్టి, కర్మ సిద్ధాంతాన్ని గుడ్డిగా నమ్మే వాళ్ళ పరివర్తన కోసం ఈ కావ్యం రాసారు.

కథాంశం: 'జన్మాంతర వైరమ్' కావ్యంలోని కథ చాల చిన్నదనీ, సూత్రప్రాయమైనదనీ ఒక సత్యాన్ని ఆవిష్కరించడానికి ఉద్దేశించబడిందనీ రచయితే స్వయంగా చెప్పుకున్నారు. ఇక ఇందులోని కథను చూద్దాం.

"అదొక అగ్రహారం. అగ్రహారం అంటే బ్రాహ్మణుల ఊరని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు కదా! దానికి పడమటివైపున మాలపల్లి, తూర్పువైపున పొలాలు వున్నాయి. మాలలంతా ఆ పొలాల్లో కూలీలు. పొలాలకు అగ్రహారంలోంచి దగ్గర దారి వున్నా, వారు అగ్రహారంలోకి రాకూడదు గనక, ఊరు చుట్టూ తిరిగి పొలాలకు వెళ్తారు.

ఒక సాయంత్రం అగ్రహారంలోని శివాలయం వీథిలోంచి 'దొంగదొంగ' అని కేకలు వినిపించాయి. అగ్రహారీకులంతా చేరి దొంగను పట్టుకుని తలో దెబ్బ వేస్తారు. తీరా చూస్తే వాడు దొంగ కాదు. పాలేరు మాల ఎంకడి కొడుకు. అంటరానివాడు తమ వీథిలోకి వచ్చాడనే కోపంతో మళ్ళీ కొడతారు. దాంతో ఆ పిల్లాడు చనిపోతాడు. అగ్రహారీకులంతా మెల్లగా జారుకుంటుండగా పిల్లవాడి శవం అమాంతంగా లేచి కూచుని "ఆగండి" అంటుంది. తన పూర్వజన్మ వృత్తాంతం చెబుతాడు. గత జన్మలో నిష్ఠాగరిష్ఠుడైన, వేద వేదాంగ పారంగతుడైన పీఠాధిపతి అయిన తాను ఒక వర్గం ప్రజలను అస్పృశ్యులుగా ప్రకటించి వేధించిన మూలంగా మరణించిన తర్వాత మోక్షం పొందవలసిన తాను, మాలపిల్లవాడిగా పుట్టి ఇప్పుడు మీ చేతుల్లో మరణించాననీ, అందువల్ల మీరు అస్పృశ్యతను పాటించవద్దనీ బ్రాహ్మణులను, తన వాళ్ళను మనుషులుగా బ్రతకమనీ, సర్వసమతను సాధించి, భారత సమాజాన్ని శక్తిమంతమైన ఏకైక సంఘటిత జాతిగా సముద్ధరించమనీ కోరతాడు. ఆది దేవుడైన శివుణ్ణి చూసైనా జాతి, మత, కుల, వర్ణ, వర్గరహితమైన సమసమాజాన్ని స్థాపించాలని విజ్ఞప్తిచేసి శివైక్యం పొందుతాడు.

ఈ జన్మలో అంటరానితనం పాటించిన వారంతా జన్మాంతరంలో అంటరాని వారిగా జన్మించి పీడనలు అనుభవిస్తారని పరోక్షంగా హెచ్చరించిందీ కావ్యం.

ఈ కావ్య ఆవిర్భావ నేపథ్యం ఒక ఆసక్తికర వాస్తవ సంఘటన. అది చూద్దాం –

**కావ్యహేతువు:** లోకంలో ప్రతీకావ్యం ఆవిర్భావం వెనుక ఒక హేతువు వున్నట్లే జన్మాంతర వైరమ్ కావ్యం పుట్టుక వెనుక కూడా ఒక బలీయమైన హేతువు వుంది. అది స్వాతంత్ర్యానికి పూర్వం 1937 ప్రాంతం. తూర్పుగోదావరి జిల్లా, కొత్తపేట తాలూకా, 'ఆవిడి' గ్రామంలో ఆదియాంధ్ర మహాసభ జరుగుతుంటే తన ఊరైన మామిడికుదురు నుండి ఆ సభకు మిత్రులతో బయలుదేరారు కవి భీమన్నగారు.

ఆవిడి గ్రామం వెళ్ళే దారిలో ముంగండ అగ్రహారం వుంది. ప్రముఖ అభ్యుదయ రచయిత మహీధర రామమోహనరావుగారి వూరది. ఆయన్ని పలకరించడానికి అగ్రహారంలో వారింటికి వెళ్ళి, తిరిగి వస్తూండగా మహీధర వారు జ్వరంతో బాధపడుతూ కూడా అగ్రహారం చివరి వరకు వచ్చి దిగబెట్టారు. దిగబెట్టి ఇక్కడిదాకా మీతోపాటు ఎందుకొచ్చానో తెలుసా భీమన్నగారూ అని ప్రశ్నించారు. తెలీదన్నారు భీమన్న. ఇలా సమాధానం యిచ్చారు మహీధర –

"వీధి పొడుగునా అరుగుల మీద చేరి తాంబూలాలు వేసుకుంటూ, పేకాడుతూ వుంటారు. అది మా వాళ్ళ నిత్యకృత్యం. ఎవరైనా కొత్తవాళ్ళు కనిపిస్తే ఊరు, పేరు, కులం, గోత్రం వగైరా నిలవేసి అడుగుతారు. మిమ్మల్ని అడుగుతారు. మీరు చెబుతారు. వాళ్ళు తన్నుతారు. అలా జరగడం నా కిష్టం లేదు. నేను కూడా వున్నాను కాబట్టి ఎవరూ మీ జోలికి రాలేదు" అన్నారు. అయితే ఈ సంఘటనకు భీమన్నగారు ఆశ్చర్యపోలేదు. అలాంటి దాడులు అప్పట్లో (ఇప్పటికీ....) సర్వసాధారణం కాబట్టి. అయితే ఆనాటి సంఘటన 'జన్మాంతర వైరమ్' కావ్యరచనకు బీజాన్ని నాటింది.

**కావ్యసమీక్ష:** ఇది 178 పద్యాల సంపుటి. "భావం, వస్తు స్వరూపం నిర్మాణ పథకము స్పష్టత సంతరించుకున్నాక రచన మొదలుపెట్టి పాతిక పద్యాల వరకూ రాసారు. ఇది చాలా సంవత్సరాలు అసంపూర్ణ కావ్య ఖండికగానే వుండిపోయింది. 1980లో మొదటి ముద్రణ పొందింది.

ఈ కావ్యం ప్రారంభమే గొప్ప వైచిత్రితో కూడుకున్నది. సాధారణంగా సంప్రదాయ పద్యకావ్యాలు అన్నీ శ్రీతో ప్రారంభం అవడం పరిపాటి. భీమన్నగారు సంప్రదాయ అనుసారి అయినా దానిని త్రోసిరాజని సంభాషణతో కావ్యాన్ని ప్రారంభించారు. ఈ ప్రారంభ పద్యం చూడండి.

**"ఎవ, డెవ్వ, డెవ్వ, డెవ్వం**
**డెవడో? దొంగ వేధవేమో! ఏమో చూడం**
**దవురా! పట్టుండనుచున్**
**దవులను వినిపించె పెక్కు దడబిడ కేకల్!"**

'ఎవడు' శబ్దం అయిదుసార్లు ప్రయుక్తం చేయడంవల్ల కావ్యాదినే పఠితలకు ఒక ఉత్సుకతను, ఉత్కంఠతను కలిగింపచేసారు. ఒక రకంగా ఇది కావ్యానికి అసాధారణ ప్రారంభంగా చెప్పుకోవచ్చు. గురజాడ అప్పారావుగారు తన దిద్దుబాటు

కథ ప్రారంభం ''తలుపు, తలుపు'' అన్న వాక్యాలతో ప్రారంభించడం లాంటిదే ఈ ప్రారంభమూను. దీనిని బట్టి భీమన్న ఎంత ఆధునికుడో, ఎంత ప్రయోగ ప్రియత్వము వున్నవాడో అర్థం చేసుకోవచ్చు.

ఎవడు ఎవడు అని అగ్రహారికులంతా గాలిస్తే ఒకడు దొరికాడు. చూడబోతే వాడు మాల మాదిగాడు. మాల యెంకడి కొడుకు. పాలేరు కొడుకు, చిన్న పాలేరు. అతని భౌతిక రూపాన్ని అలతి అలతి పదాలలో భీమన్న రూపు కట్టించాడు.

**బిల బిలమని నలు వీథుల**
**పలు వయసుల జనము మూగి పట్టిరి వానిన్**
**పిలవాని, గోచి మాత్రుని**
**తలపేలిక, చేతి కఱ్ఱ తాల్చినవానిన్ –**

ఈ వర్ణన చదవగానే పాఠకునిముందు ఒక చిన్నపాలేరు ఆవిష్కృతమౌతాడు. 'పిలవాని' పదం అతని లేత వయసును సూచించగా, గోచిమాత్రుని, తలపేలిక అనే పదాలు అతని ఆహార్యాన్ని పట్టి యివ్వగా, చేతి కఱ్ఱ తాల్చిన వానిన్ అనే పదబంధం అతని వృత్తిని సూచిస్తుంది. నల్లనివాడు ... అన్న పోతన పద్యం చదవగానే కృష్ణుడు స్ఫురణకు వచ్చినట్లు 'పిలవాడు' అనగానే బాల పాలేరును స్ఫురింపచేసారు భీమన్నగారు. అలాంటి పాలేరు కొడుకును వారంతా కలసి చితకబాదారు. అందుకు కారణం అతను దొంగతనం చేసాడనీ కానీ, తమ విలువైన సంపద దోచుకున్నాడని కానీ కాదు. మరి ఏమిటి?

**''ఎవడురా వాడు? చండాలు, ఓ పవిత్ర**
**విప్రవీథిని మైల కావించినాడు**
**వాడెరా వాడె! పడమటి వాడలోని**
**మాల యెంకడి కొడుకు, దుర్మార్గుడొర''**

బ్రాహ్మణ వీథిలోకి ఒక చండాలుడు ప్రవేశించి మైలపరచాడని వారికి కోపం. ఆ కోపంతోనే ఆ కుఱ్ఱవాణ్ణి విచక్షణారహితంగా చావబాదారు. ఆ దెబ్బలకు ఆ కుఱ్ఱకుంక నిజంగానే ప్రాణాలు విడిచాడు. దానితో జరగరానిది జరిగిందని ఆ బ్రాహ్మణులు మెల్లగా జారుకోబోయారు. ఇంతలో మృతుడైన ఆ కుఱ్ఱవాడు లేచి కూర్చుని తన వృత్తాంతము పూర్వ జన్మ వృత్తాంతము చెప్పజొచ్చాడు. తను పొలంపనిలో నిమగ్నమై యుండగా తాచుపాము అతనిపై పడగ విప్పింది. ఎలాగో తప్పించుకున్నాడు.

"ఆటయు, పాటయున్ పొలమె
　　య్యె; పనులెల్ల ముగించి నేను మా
పేటకు బైలుదేర, కని
　　పించిన దయ్యది ముందె; కాన, ఈ
పూటకు ఊరి మార్గమున
　　పోవదలచితి; పాము కోరలన్
దాటియు, చిక్కుకొంటి కుల
　　దర్ప దురాగత సర్పదంష్ట్రలన్"

ఇదీ సంగతి. అగ్రహార వీథుల గుండా వెళ్ళకూడదని ఆ కుర్రపాలేరుకు తెలుసు. అయితే పొలంలో పాము పగపట్టింది. పుంతదారి గుండా వెళ్తే దాని కాటుకు బలికావలసి వస్తుందని భావించి, ఈ పూటకు ఊరి మార్గం పట్టాడు. అదే అతడు చేసిన తప్పిదం. అతడు పాము కోరలను తప్పించుకోలిగాడు కానీ "కుల దర్ప దురాగత సర్పదంష్ట్రలన్" మాత్రము తప్పించుకోలేక పోయాడు. ఈ సందర్భాన్ని పురస్కరించుకుని మనిషికి మనిషే పరమ శత్రువు అనే తత్వాన్ని ఈ కింది పద్యంలో ఆవిష్కరించాడు:

పులులున్ కావు, విష నాగములును కావు
మానవుని ప్రాణ శత్రువు మానవుండె
కాంతకో, కనకమునకో, కమతమునకొ
చంప వెనుదీడు సరివాని స్వార్థపరుడు

1980లో రాసిన ఈ మాటలు వర్తమాన సామాజిక సందర్భానికి మరింత వర్తించేలా వున్నాయి. నేడు సంఘంలో జరుగుతున్న మారణకాండకు కేంద్ర కారకాలయిన వాటిని కవి గుర్తించడంలో సఫలమైనాడు. ఆ పాలేరు తనయుడు తన పూర్వజన్మ వృత్తాంతం చెబుతూ తాను పూర్వజన్మలో బ్రాహ్మణునిగా పుట్టాననీ, పంచమ ప్రజలను అస్పృశ్యులుగా ఎంచాననీ, అందువలన ఈ జన్మలో అస్పృశ్యునిగా జన్మించానని చెబుతాడు. ఈ సందర్భంలో పంచమ వర్ణం యొక్క ఔద్ధత్యాన్ని కవి పాత్ర చేత పలికిస్తాడు:

వేద వేదాంగ విద్య లావిష్కరించి
లోక గురువైన వ్యాస వాల్మీకులెల్ల
పూర్వ హరిజనులే అన్న బుద్ధి లేక
పెట్టితిని హింసలెన్నో అస్పృశ్యులంచు

భారత సంస్కృతి కెవడా
ధారము, ఎవడన్నదాతో, తత్‌యావత్ భూ
భార వహి నంటరాదని
దూరీకృతుజేసి, నేను దొర్నై మంటిన్

ద్రావిడ, అనార్య, అర్య భేదములు పెంచి
నలుపు, తెలుపుల నడుమ గోడలను కట్టి
ఎల్ల వర్ణాలకే హరివిల్లువన్న
తెలివిలేక పాడొనరించితి నరోర్వి.

'వ్యాస వాల్మీకులెల్ల పూర్వ హరిజనులే' అన్న వాక్యం ద్వారా ఈ దేశం, దీనికి సాంస్కృతిక వారసత్వాన్ని అందించిన వారు ఈ దేశ మూల నివాసులైన హరిజన గిరిజన కులాలే అని పరోక్షంగా హెచ్చరిస్తున్నాడు. ఎవడు ఈ భారత సంస్కృతికి ఆధారము, ఎవడు ఆరుగాలం కష్టించి ఈ దేశానికి అన్నం పెడుతున్నాడో, వాడిని అంటరాని వానిగ చేసి, నేను దొర్నై వెలిగితిని అనే పశ్చాత్తాపం ప్రకటింపచేస్తాడు. ఆర్య అనార్య బేధములు కల్పించి మనుషుల మధ్య హెచ్చు తగ్గులను కల్పించి ఈ ఉర్విని పాడుచేసానని వొప్పుకుంటాడు. అలాంటి ఘోరపాపాలు చేసినందుకే నరకం ప్రాప్తించిందని, అక్కడ పీడితుల ఆత్మలు అగ్గిరవ్వలై కాల్చివేశాయని అంటాడు:

"అగ్గి రవ్వలు, చురకత్తు లారె మొనలు
తోలు కొరడాలు, కంద్రీగ తుట్టె లహ
కండ్ల కారపు పొ, దూలగొండ్లనూడు
ఉపమ కందదు, పీడితాత్మోగ్ర ధాటి!

జీవ పరిధిని దాటి, ఆత్మావశిష్టు
నైన నన్నంటి హింసించు నట్టి దేదొ
ఎరుకగొంటిదే? ఎవరి నస్పృశ్యులనుచు
అణచిపెడితినో! వారి క్రోధమ్ములవ్వి ...

ఎన్ని తరముల, యుగముల, ఎన్ని కోట్ల
తత్ ప్రతీకార తీవ్ర ప్రతాత్మలచట
పొంచియున్నవో, అటునన్ను కాంచగానె
దూకినవి లేడిపై పులిమూకలట్లు.

నరుని వెలిబెట్టి, కుక్కలకు, నక్కలకును
వేసినాడను యజ్ఞోపవీతములను
భస్మ హవ్యమె అయ్యె నా బ్రతుకు బ్రతుకు
మానవత లేని వాడెట్టి మానవుండు?

పై పద్యాల ద్వారా భీమన్నగారు కర్మసిద్ధాంతాన్ని అన్వయించి చూపడానికి ప్రయత్నం చేసారు. గతంలో చేసిన తప్పిదాలకు తగిన ఫలితం అనుభవిస్తున్నట్లు చూపారు. పూర్వజన్మలో చేసిన తప్పిదాలను గుర్తించి, పశ్చాత్తాపపడి, పరివర్తన చెందుతున్న బ్రాహ్మణుని మనసు ఈ పద్యాలలో వ్యక్తమైంది. ఈ కావ్యం ఉద్దేశించిన ప్రయోజనమూ పరమార్థము కూడా ఇదే!

ఈ సందర్భంలో కవి జన్మపరంపరతత్వాన్ని, అందులో నిగూఢత్వాన్ని, గాఢతను తనదైన రీతిలో ప్రబోధించాడు:

రైలుబండి ఎన్నెన్నో సొరంగములను
దూసుకుని పోవుటెపుడైన చూసినారె?
ఒక్కొక్క సొరంగ మటులుండు ఒకొక జన్మ
తళుకు మనుచుండు నడుమ లే వెలుగు బయలు!

రైలుబండి సొరంగ మార్గం గుండా వేగంగా దూసుకుని పోతున్నప్పుడు వచ్చే వెలుగు చీకట్లలాగా ఒక్కొక్క జన్మ వుంటుందని లోక సాధారణమైన పోలికతో జన్మ పరంపరను వివరిస్తాడు. ఇక్కడ దువ్వూరి రామిరెడ్డిగారి పానశాలలోని "అంతములేని ఈ భువనమంత పురాతన పాంథశాల" పద్యం గుర్తుకు రాకమానదు. గంభీరమైన ఆత్మతత్వాన్ని కూడా ఈ పద్యంలో సుబోధకంగా వివరిస్తున్నాడు:

మధుకణము వంటి ఆత్మను మట్టిగడ్డ
చేయు స్వార్థము; పోవును చిత్తశుద్ధి,
ఆత్మశౌచమే శౌచము; అది నశింప
ఆత్మ పరమాత్మ లెట్టు లైక్యమ్ము చెందు

ఆత్మ పరమాత్మలో ఐక్యం చెందాలంటే శుచియైన ఆత్మ ఉండాలంటాడు. కాని పక్షంలో ఆత్మ పరమాత్మల ఐక్యం సాధ్యం కాదంటాడు. "ఆత్మశుద్ధిలేని ఆచారమదియేల?" అని వేమన ప్రశ్నించినట్టుగానే భీమన్న కూడా ఆత్మశౌచానికి అధిక ప్రాధాన్యం ఇవ్వడం గమనార్హం.

మానవుడు ఎంత మేధాజీవి అయినా ప్రకృతి ముందు పసిబాలుడే! ఎన్నో విజ్ఞాన రహస్యాలను ఛేదించినా, వైజ్ఞానికంగా ఎంతో పురోగమించినా, ఇంకా అనేక రహస్యాలు మానవునికి అందకుండానే ఉండిపోయాయి:

**జీవకణము, ఆత్మాణువు, దైవశక్తి**
**భౌతికమ్ములు కావు; విశ్వాంతికములు**
**అందుకొనలేరు దీని రహస్యమెవరు**
**వెలుగు నిత్తురు మెదడు శక్తులను బట్టి.**

విజ్ఞానానికి సంబంధించి మానవునికి ఉన్న పరిధులను, పరిమితులను భీమన్నగారు ఈ పద్యం ద్వారా గుర్తించారు. పై అంశాలపై తమ శక్తినిబట్టి కొంత వెలుగును ప్రసరింపచేయగలరేమో కానీ, దీని రహస్యం ఛేదించలేరు అంటాడు.

దళితులు ఉత్పత్తి కులాలు: బ్రాహ్మణుల పరాన్న జీవులు - గత పద్యాలలో ఎవడన్నదాతో అలాంటి దళితుల్ని అంటరానితనం పేరుతో ఊరు బయటే వుంచారని స్పష్టం చేసిన భీమన్న ఈ కావ్యంలో దళిత బహుజనులు శ్రామిక కులాలనీ, దేశ సంపదను ఉత్పత్తి చేసే వర్గాలనీ, బ్రాహ్మణులు కర్మసిద్ధాంతం పేరుతో ఆ సంపదను దోచుకుతినే పరాన్నజీవులని స్పష్టం చేసారు:

**అదియొక మాలపేట; గత**
**మందెపుడెవ్వరు చేసి రెట్టి త**
**ప్పిదము? ఎరుంగ రాదు; తమ**
**వెట్టికి, వేధకు హేతువేవి? తె**
**ల్పదు; మరిసాటివారు కల**
**వారెటులైరొ శ్రమించకుండనే!**
**అది అటనున్న దెప్పటిదొ -**
**హైందవనీతికి దిష్టిబొమ్మయై.**

**పక్కగల అగ్రహారులు పనినె చేయరు**
**అఖిల సుఖ భోగములు వారె అనుభవింతురు**
**అన్ని సంపదలకు స్రష్టయైయు, తాను**
**పేదగా మనగల్గిన పేట అద్ది.**

"మరి సాటివారు కలవారెటులైరొ శ్రమించకుండనే?" అనే ప్రశ్న నేటికీ వర్తిస్తుంది. భారతీయ సమాజంలోని సంపద అంతా ఇప్పటికీ పది పన్నెండు

కుటుంబాల చేతులలో వుందన్న విషయాన్ని గుర్తు చేసుకుంటే భీమన్న వేసిన ప్రశ్న ఎంత విలువైనదో తెలుస్తుంది. జాషువా కూడా తన గబ్బిలంలో ... "నిరాకరింప లేదెన్నడు, అప్పు పడ్డది సుమీ భరతావని వీని సేవకున్", అనీ; "అతని గాలి సోకనిదే సస్యరమ పండి పులకించ సంశయించు" అనీ; "ప్రపంచమునకు భోజనము పెట్టు, అతనికి భుక్తి లేదు" అనీ స్పష్టపరిచాడు. కులపరమైన సాంస్కృతిక దోపిడియేకాక అనాదిగా దళితులు ఆర్థిక దోపిడీకి గురౌతూవస్తున్నారని ఈ పద్యాలు తెలియజేస్తాయి. కానీ ఒకప్పటి మన వేదసమాజం అలా లేదు. అర్హతను బట్టి అందరికీ అవకాశాలు లభించేవి:

**క్రింది దశ నుండి పై దశ కెదుగు వాడె**
**మానవుడు మన వేద సమాజమందు**
**బ్రహ్మ విద్యచే శూద్రుడె బ్రాహ్మడౌను**
**ఎట్టులిక పుట్టె ఈనాటి పుట్టు కులములు?**

అని క్షత్రియుడైన విశ్వామిత్రుడు తన తపఃశక్తి వలన బ్రహ్మర్షి అయిన ఉదంతాన్ని పరోక్షంగా గుర్తుచేసారు. అర్హతలను బట్టి మారగల కులములు జన్మతో వచ్చునని చెప్పి స్వార్థపరులు జీవజాతిని ఛిన్నాభిన్నం చేసారనీ, ఉజ్వల భారతాన్ని, భానిసను చేసారని ఆవేదన చెందుతాడు. "చదువుకొని ఎవ్వడైనను సత్యమెరిగి తిరుగబడునేమొ అని నిషేధించినారు చదువునే" అని బ్రాహ్మణ్యంలోని కుట్రను కుండబద్ధలు కొట్టినట్టు చెప్పారు.

**రాజకీయార్థికాధికారమ్ము లెల్ల**
**ఎల్లకాలము తమ చేతనిడుకొనంగ**
**చేసినారానువంశిక శాసనమ్ము**
**శ్రుతులనే మార్చివేసిరి స్మృతుల పేర!**

కేవలం రాజకీయ, ఆర్థిక అధికారాలను శాశ్వతంగా తమవద్దే పెట్టుకోడానికి కులం పేరుతో ఆనువంశిక శాసనాలు చేసారనీ, కులం గుట్టుమట్టులు విప్పారు. శ్రుతులను మార్చి స్మృతులు సృష్టించారనీ పరోక్షంగా మనుస్మృతి ప్రస్తావించారు. అందుకే భారతరత్న డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్ తన ఉద్యమంలో భాగంగా ముందుగా మనుస్మృతిని దహనం చేశారు.

**విశ్వమునకెల్ల మూలమౌ విష్ణువునకు**
**పీతవస్త్రమ్ము నేసిన నేతగాడు**

**పాదరక్షలమర్చిన ప్రథమ శిల్పి**
**ఎప్పుడస్పృశ్యుడయ్యెనో చెప్పగలరె?**

అని భగవంతునికే వస్త్రాలు, పాదరక్షలు అందించిన మాల మాదిగ జాతిని అస్పృశ్యత ఎలా సోకిందని ప్రశ్నిస్తాడు. కుల మతాలను ఎంచువాడు కేవలం శరీరాలను మాత్రమే పూజించేవాడు. స్వార్థాన్నే దైవంగా చేసుకున్న మతస్వాముల కంటే చిత్తశుద్ధిగల నాస్తికుడు గొప్పవాడు అని ప్రకటిస్తాడు.

మనుధర్మశాస్త్రం వివిధ వర్ణ సాంకర్యం వలన పుట్టిన వారికి వివిధ కులాల పేర్లు పెట్టింది. బ్రాహ్మణ శూద్ర సంయోగం వలన కలిగిన సంతానాన్ని అస్పృశ్యజాతిగా పిలువబడింది. ఇందులో అనౌచిత్యాన్ని, హేతురాహిత్యాన్ని భీమన్నగారు ఈ పద్యంలో ప్రశ్నిస్తున్నాడు:

**బ్రాహ్మ శూద్ర వర్ణాంతర ప్రణయ ఫలము**
**బ్రాహ్మణుండొ, శూద్రుండొ కావలయు కాదె?**
**ఏల చండాలుడయ్యె? అస్పృశ్యుడయ్యె**
**స్వార్థ పశుబల యాజమాన్యమున కాదె?**

అని ఈ కులాల పుట్టింపు స్వార్థపరులైన పశుబలం కలిగిన యాజమాన్యం యొక్క మోసపూరితమైన కుట్రగా గుర్తిస్తారు. దైవము, మతము, దానిని బలపరచే శాస్త్రాలు అన్నీ బుద్ధిమంతులు, బుద్ధిహీనులను దోచుకోడానికి పన్నిన పథకాలే అంటారు:

**మతములు, నీతులు, శాసన**
**శతకమ్ములు, గుడులు, మడులు, స్వర్గనరకముల్**
**మతిమంతులు బ్రతుకుటకై**
**మతిహీనుల దోచుకొనెడి మార్గములు సుడీ!**

అని హిందూమతంలోని దోపిడీతనాన్ని, డొల్లతనాన్ని బహిర్గతం చేస్తాడు. ఒకడు బతుకుటకు వేరొకడు చావాల? ఉర్వీ ఫలము ఏ ఒక్కరిదో కాదు. ఎల్లరి హక్కు అది. అందరు దాని లోపల బతకవచ్చు అని, స్వేచ్ఛా సమానత్వాలను ప్రతిపాదిస్తున్నారు:

**మనిషి పుట్టుట మరియొక**
**మనిషికి కాళ్మొక్క, చిక్కి, మనుటకొ? ఎపుడేన్**

**చనునదె ప్రాణము, కావున**
**మనబూనుడింక మానమర్యాదలతో**

ఒక మనిషి పుట్టింది మరొక మనిషికి కాళ్ళు మొక్కి, జీవించటానికి కాదని, ప్రాణం ఎపుడైనా పోయేదని, బ్రతికనన్నాళ్ళు మనిషన్నవాడు ఆత్మగౌరవంతో బ్రతకాలని పాత్ర గతంగా ప్రబోధిస్తాడు. బ్రాహ్మణులలో పరివర్తన తీసుకురావడానికి 'కర్మ సిద్ధాంతాన్ని' తెరపైకి తెచ్చి, దానికో అందమైన కథను కల్పించిన భీమన్నగారు, కావ్యం చివరికి వచ్చేటప్పటికి భౌతికవాదిగా దర్శనమిస్తాడు. చనిపోయిన పాత్ర ద్వారా చెప్పించిన ఈ రెండు పద్యాలు అందుకు ఉదాహరణ:

**దేవుడును కాదు, పాపభీతియును కాదు**
**నరుని నడిపించునది స్వార్థపరత యొకటె**
**సంఘ చైతన్య ధృతినెల్ల సంఘటించి**
**ఉమ్మడిగ పొందు డవనీ సుఖమ్ము లెల్ల!**

**పాంచ భౌతికమ్మైన ప్రపంచమెల్ల**
**దాన లభియించు మణిమాన్య ధనములెల్ల**
**అఖిలజనులకు ఉమ్మడి ఆస్తి సుండు**
**సమత సాధింపు ఎంతటి సమరమ్మైన.**

వ్యాఖ్యానం అవసరం లేని ఈ తేటతెలుగు పద్యాలలో భీమన్నగారు దళితులకొక గొప్ప కార్యాచరణను అందించారు. అది "సంఘ చైతన్య ధృతినెల్ల సంఘటిత పరచడం, సమత సాధింపు ఎంతటి సమరమ్మైన" అనేవి. అంబేద్కర్ ప్రతిపాదించిన "చదివించు, సమీకరించు, పోరాడు" అనే సాధనత్రయం ఏదైతో వుందో దానినే భీమన్నగారు ఇక్కడ అందిస్తున్నారు.



"మంచితనం చిరంజీవి.
దానికి గ్రహణమే కాని మరణం లేదు"

– వాకాటి పాండురంగారావు

# శ్రీ గీతా

– కీ.శే. డా॥ మిరియాల రామకృష్ణ

*(40వ సంచిక తరువాయి)*

## ఐదు

1. అస లేవో పనులు
అలా అలా చేయడం కన్న
యుక్తితో పనుల్ని
రక్తి కట్టించడం మిన్న.

2. యోగి, యోగం అనేవి
మూగ మాటలు కావు
యుక్తిపరుడే యోగి
యోగ రూపమే యుక్తి.

3. అన్నీ వదిలేసిన వాడ్ని
అంటున్నాం సన్న్యాసి అని
అది తప్పుడు భావన
అసలర్థం వేరే ఉంది.

4. బంధాలు విడగొట్టు కోడానికి
పనులు చేయడం సన్న్యాసం.
న్యాసం అంటే ఉంచడం కదా
అది బావుంటే సత్‌న్యాసం.

5. బంధాలు తొందరగా
పారిపోవాలంటే
మన ఆచరణలో
మాత్సర్యాలు పనికిరావు.

6. స్వార్థమేదో ఉంచుకుని
సంచరిస్తాడతను.
ఎంత నడిచినా పాపం
ఇక్కడిక్కడే ఉంటాడు.

7. విశ్లేషించుకునే
విన్యాసాలలో
సంఖ్యలు తప్పవు
సాంఖ్యమంటే అదే

8. శాస్త్రవేత్తలు
సాంఖ్య నేత్రంతోనే
సమస్తాన్నీ చూస్తారు
సరీ బేసీ అంటూ

9. సాంఖ్యం కూడా
సరి అయిన ఆచరణే
శుద్ధిగల ఆచరణలో
బుద్ధిగల యోగం ఉంది.

10. అతడు చూస్తూనే
అలా అలా వెడతాడు
ఏం చూశావయ్యా అంటే
ఏమీ జవాబివ్వడు.

11. చూడటమంటే
చూడ్డం కాదు అద్దంలో.
ఆలోచిస్తూ
అవలోకించడమే చూపు.

12. యోగయుక్తుడు పొందే
ఉజ్జ్వల స్థితిని
సన్న్యాసి అందుకోలేడు
సత్కర్మలు ఎన్ని చేసినా.

13. రంగు వేసిన గోడల్ని
రాసుకుంటూ వెళ్ళాడు.
తెల్లబట్టలు కూడా
తిరగబడ్డాయి ఎర్రబడి.

14. ఎన్నెన్ని పనులు
పన్నుగడతో చేస్తాడో
ఇతడి పై తిరగబడవు
ఇంద్రియాలు ఏవీ.

15. తత్త్వవిదుడూ యుక్తుడూ
తటస్థంగా ఉంటాడు.
పనుల్లో దూరిపోతే
బైటపడలేననుకుంటాడు.

16. చూస్తాడు కళ్ళతో
చూపులు పారేసుకోడు.
వింటాడు చెవులతో
విలీనుడై పోడు.

17. పట్టి చూస్తాడు
పతనమై పోడు
పూలు వాసన చూసినా
నాలుక చాచడు.

18. మార్గాలన్నీ
మడమ తిప్పకుండా
నడుస్తాడు కానీ
నటుడుగా మారిపోడు.

19. మాటాడతాడు
మధురంగా కానీ
గాద్గద్యంతో
కంగారు పడిపోడు.

20. స్వీకరిస్తాడు
సిద్ధించిన
సన్మానాల్ని కానీ
సంబరపడిపోడు.

21. ముందుగానే
మోహం వదిలేశాడు
బ్రహ్మార్పణం అనే
బరువైన మాట అన్నాడు.

22. అతడొక తామరాకు
అంటుకోదతనికి
నీటి చుక్కయినా
నేర్పు కారణం కాబోలు.

23. అంటుకునేది
అంటే ఏమిటి?
మనం అంటించుకునేదే
మనసారా దేన్నయినా.

24. "కాయేన మనసా బుద్ధ్యా
కేవలై రింద్రియై రపి
యోగినః కర్మ కుర్వంతి
సంగం త్యక్త్వా త్మశుద్ధయే"

25. మనకి శరీరముంది
మనస్సు బుద్ధి ఉన్నాయి
ఇంద్రియాలున్నాయి
ఇవేవీ కాదు మనం.

26. ఎవరు నేను? ఎవరు నువ్వు?
ఎరగం మనం
కానీ తెలుసు మనకు
ఖచ్చితంగా ఆత్మలమని.

27. నేను శుద్ధిగా ఉండాలని
నిర్ణయించుకుంటే
వింతేమయినా ఉందా?
విశేషమే అవుతుందది.

28. శరీరాన్ని శుద్ధిగా
సంతరించుకోడానికి
స్నానం చేస్తే చాలు.
చాలదది ఆత్మకు.

29. ఆత్మశుద్ధి
అనే మాట!
అందరికీ
అవసరమ్మైనదే.

30. నిష్ఠ అనే మాట
నీకెంతిష్టమో
గీతా తెలుసుకున్నాను
కించిత్తు నేను.

31. నిష్ఠ పేరు
నిబద్ధత పేరు
మాటల పేచీ
మావాళ్ళకు తెలియదు.

32. అతనికి యుక్తి లేదు
ఆశ తప్ప
కోరిక లతడ్ని
చేరి బంధించాయి.

33. "యుక్తః కర్మఫలం త్యక్త్వా
శాంతి మాప్నోతి నైష్ఠికీమ్
అయుక్తః కామకారేణ
ఫలే సక్తో నిబధ్యతే".

34. ఎవడికైనా ఇష్టమే
నవద్వారపురం!
అందులో నివసించాలంటే
అనేక నియమాలున్నాయి.

35. ఆ నియమాల నెవడు
ఆ విధంగా రచించాడో
అతడ్ని వెదికితే
ఆతడే కదా ప్రభువు.

36. ఆ నిమయాలను
అనుసరించడం
జ్ఞానమని చెప్పడం
చర్విత చర్వణం కాదా?

(సశేషం)



గద్యకవిత (దీర్ఘకావ్యం):

# గుండెల్లో వాయుగుండం

- డా॥ ఆవంత్స సోమసుందర్

*(గత సంచిక తరువాయి)*

## 10

సగం కాలం నిద్ర! మిగిలిన సగమే జాగృతి, సంచారం, వాహ్యాళి, వ్యర్థ ప్రలాపం, పరస్పర కలహం, శృంగార రసామృతం. మిగిలిన సగంలో ఎన్ని ఎన్ని వైఖరులు నిద్రలేమితో మనసు జడమయం అవుతుంది.. కోల్పోతుంది చొరవ.. సన్నగిల్లుతుంది ఉత్సాహం.. అవునా?

అతినిద్రవల్ల మొద్దుబారతాయి నరాలు. మనసు చురుకుతనం కోల్పోతుంది. నిద్రకాని, మెలకువ కాని, విచిత్ర నిశ్చేతన స్థితి ఆవరిస్తుంది. హా నిద్రా! నీకు సమస్కారం. సమయాసమయా లెరుగక విడిచిపెట్టి పోకు సుమా!

నిద్రలేని దినం బాహ్యస్పందనా సౌకుమార్యానికి దూరమవుతుంది కదా?

భావుకత చచ్చుబడుతుంది. ఆలోచన మొద్దుబారుతుంది. గుండెల్లో కవితల చలమ ఆరిపోతుంది. జలలూరవు. అబ్బ ఎంత శూన్యస్థితి! రక్తస్పందనా శబ్దం తప్ప, హృదయానికి అనుభూతుల మార్దవత దూరమవుతుంది. ఎందుకో మనసు పిచ్చివాని దినచర్యలా గిరగిర తిరుగుతుంది, తన చుట్టూ తానే ...!

మాదకత్వం సౌఖ్యమనుకునే మందభాగ్యులకు మనసుకనే రంగు రంగుల కలలు కనిపించవు. అంతర్నిహిత సంస్పర్శలు దర్శనమీయవు.

మానవుని చేతన మహత్వపూర్ణ భూమిక. అది చేరబిలిచే దివ్యప్రభా మండలం దూరంగా దూరంగా జరిగిపోతుంది. అతిలోకానుభూతులను రశించలేని దౌర్భాగ్య స్థితి ఆవరిస్తుంది.

నిజం నిజం. అది మనుషులు కావాలని తెచ్చిపెట్టుకున్న దుర్వార శాపధార. కనుల చూపు మందగిస్తుంది కదా?.... మనసు జబ్బుగా నీలుగుతుంది కదా? శరీరం దబ్బున కూలిపోతుంది కదా? - ఎంత దురవస్థ!

# 11

నీటిపొరల నీలిమబ్బులు కనులపై క్రమ్ముతున్నాయి. మృషాభ్రమల సుడిగుండాలు కొరవి దెయ్యాలై తరుముతున్నాయి. పాదాలు మోపలేక, నాదాలు వినిపించుకోలేక కర్తవ్యాలు భర్తృవిహీనలై దుఃఖాలు ఆపుకోలేక, ఏవో సుడిగుండాలలో తేలిపోతూ ... భూమిపై బలంగా పాదాలు మోపలేక.. గగనంలో తేలలేక ఉత్తగాలి ఈతలో గడుపుతున్నాం కదా!...

శరీరం బరువెక్కిపోతే అదనపుబలం కలిగిందని ఆనందించే మందభాగ్యులం. ఉత్తుత్త ఆవేశాలతో వీరాంగమెత్తే వెర్రిపీరులం! ఇంత అల్పత్వాన్ని మహా వైభవంగా, ఎలా ఎంచుకుంటున్నామో! ఎలా తందనాలాడుతున్నామో, ఎలా మిడిసి పడుతున్నామో!

శరీరం స్వస్థంగా ఉన్నప్పుడే హృదయం నిశితంగా దూసుకుపోతుంది. భావుకతా శరపరంపరల సంధిస్తుంది. అవరోధాల తెరలు చీలుస్తుంది. వేకువగానాల అనార్తవ పికస్వరాల ఆహ్లాద తరంగాలలో తేలిపోతుంది. మనోజ్ఞ లోకాల ఆహ్వానాలందుకుంటుంది ...

జర్జరమైన జడమయ నిశ్చేతనత్వం మరణంతో సమానమే. సోమరుల మనసు - సగం బ్రతుకు, సగం చావు! వెలుతురు గుర్తించదు. చీకటిని విసర్జించదు. సమీపించిన సత్ఫలితాలను కూడా అందుకోలేక ఉపేక్షిస్తుంది. తల్లీ! పుడమీ! నీ తనూజులకు అట్టి స్థితి కల్పించకు.

ఫిల్మెంటు రాలిపోయిన బల్బు ఏ వెలుగు లందిస్తుంది? ఆత్మవిశ్వాసం కోల్పోయిన మనిషి ఏ విషయం సాధించగలడు? చైతన్యం కోల్పోయిన శరీరం శవమనే పేరుతో అందరి పూజలూ అందుకుంటుంది. దేవుడి విగ్రహంలా వాహనంపై కాని, ముందుకు సాగదు. అందరూ అంతలా ఏడుస్తారా? కన్ను తెరిచి అనునయించదు.. అభినయించదు.. ఎవరిపైనా అభియోగించదు. కదలదు!

రంగుల రాట్నంలో గుర్రంపై కూర్చుని ఎంత వేగంగా స్వారీచేసినా అది బయలుదేరినచోటనే ఆగుతుంది. గమ్యానికి చేర్చదు. సరిగ్గా అలాగే సంస్కారం లేని హృదయం ఆలోచనల్లో ముందుకు సాగదు. ఉన్నచోటే ఈగలా మళ్ళీ మళ్ళీ వాలుతుంది. సందేహాల డోలలో పరిభ్రమించే దేహం బాల్యనైర్మల్యంలోనికి ఎన్నడూ ఎగరలేదు. ప్రౌఢత్వపు మేధావైభవాన్నీ అందుకోజాలదు.

పుట్టుకరీత్యా మనిషి ఎంత గొప్పవాడో విద్యాసంస్కారాల జీవకాంతులు మాత్రమే ధ్రువపరుస్తాయి.

నిశ్చేతనసత్వం ఆలోచనాసమాధి కాబోదు. పాషాణ నిశ్చలత్వం తపశ్శక్తినీ సాధించదు. మాయామేయ జగత్తులో, మౌఢ్యానేకత్వంలో కొరడువారుతుంది వివేకం.

సమాజాన్ని పరిత్యజించిన వ్యక్తి తోడులేని ఏకాకి! మందనుంచి తప్పిపోయిన ముసలిగొడ్డు. అది గుంటనక్కకి సైతం లోకువే.

పాక్షికత్వం వివేచనా రాహిత్యానికే రహదారి. పూర్ణబింబాన్ని తటాకజలంలో తప్ప, దర్శించలేరు.

సమిష్టి విముక్తి కోసం చింతనావ్యగ్రుడు కాని వ్యష్టి ఉభయభ్రష్టుడు. అహంత వాడిని తనకు తానే నియంతగా మిగులుస్తుంది!

మేధావుల మనుకుంటున్న వాళ్ళే మతోన్మాదాల మూఢాచారాలతో కుప్పిగంతులు వేస్తున్నారు కదా! ఏమిటి కారణం? పుట్టు ఊబిలోంచి కాలుష్యమే మిగుల్చుకున్నారా?

ఎందరు మహనీయు లవతరించలే దీ దేశంలో? గౌతమ బుద్ధుని కన్న మహోన్నత త్యాగమూర్తులెవరున్నారు? అయినా మన పల్లెలు చూడు. నిద్రాణమై, నిస్తేజమై ... నిర్ధూమధామాటవులై... నిస్తరంగ సరోవరాలై ....

కులక్రిముల పుట్టలుగా కులకులలాడుతూ, దశదిశలా దుర్భర దుర్వాసనా పటలి క్రమ్ముతూ – ఛీఛీ .. ఎంత దుస్సహంగా ఉన్నాయి?

చుట్టూ చూసి ఆలోచించు. ఎన్ని శతాబ్దాలుగా ఈ సనాతన జాతి గతానికి కళ్ళు బిగించుకుని రెండడుగులు ముందుకు వేసినట్టే వేసి, పదిబారలు వెనక్కి వెనక్కి వెనక్కి – ఎందుకు పోతోంది? ఎవ్వరాపగలవారు??

## 12

ఏ మహా సంగ్రామంలో ఓడిపోయి ఛిన్నాభిన్నమై, నిరాశా మేఘజాలంలో చిక్కుకుపోయిన జాతి మనది. ఆవులకు పులిపిల్లలు పుట్టినట్లు బానిసలకు వీరులు పుట్టడమే అబ్బురమైపోయింది.

ఏ పురాతన మహాపాపం కట్టి కుడుపుతుందో మన జాతిని? - "అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ" అంటూ ప్రతి గాడిదకాళ్ళకూ మొక్కుతోంది. ఇందరూ ఇంత వెర్రిగా మొక్కుతూంటే గాడిద నిజంగానే దేవుణ్ణనుకుంటోంది. మూగిన ప్రతివాడూ ఆర్తనాదాలు చేస్తూ సముద్రం పొంగినంత సద్దు చేస్తున్నాడు. ప్రతి ఒక్కడూ నిజంగా ఆక్రోసిస్తున్నాడు, గాడిద ఆర్తరక్షకుడనుకుని.

ఇదే రీతిగా ఎన్ని తరాలు గడిచాయి? ఏమయిపోయింది మనిషి శేముషి?

గత వీరుల గాథలు కరిగి కరిగి బాధాతరంగాలుగా మిగిలాయా? పిరికితనాల మాయపొరలు క్రమ్మి ధీరత్వం భీరుత్వంగా మారిందా?

ఎలా భద్రపరచుకున్నా డీ వర్తమాన ధూర్తలోకంలో గతకాల ఉత్తమ వారసత్వాల సుసంప్రదాయాలను?

సద్దులేని నడికిరేయి కడలికెరటాల మూగవేదనలు వింటే గతకాలాల విగత వైభవాల దుఃఖాక్రోశాలు వినిపించవా?

బలాఢ్యశాఖల అంతస్సంఘర్షణలో జనించిన విస్ఫులింగాలే విషజ్వాలలుగా విజృంభించి దావానలమై మహాటవులను భస్మీపటల మొనర్చడం కాలానికి కొత్త కాదు కదా! దిగంతాలకు వ్యాపించిన రోదన ధ్వనులు బాష్ప వర్షాలుగా పుడమికి ఉప్పతిల్లడం చరిత్ర ఎరుగనిది కాదుగదా?

ఝంఝా ప్రకంపనాల ఉద్ధృతిలో వనస్పతులు అరిపేద మొక్కలై భూమిపై తలవాల్చి వెక్కి వెక్కి ఏడవడం ఎన్నిసార్లు జరిగిందో ఎవరికెరుక?

భూతల సంపదలన్నీ ప్రళయకాల విపత్కర చర్యలతో మటుమాయమైనా, మరలమరల పసిడికుప్పెల నీడల సొగసులు నేలపై పచార్లుచేయడం ఎన్నిసార్లు జరిగిందో ఎవరు రాసి పెట్టారు? తుఫాను ఘనీభవించి ప్రభంజన భీతావహమై తీరం చేరినపుడు .. చావు కబురులు సర్వత్రా సోకార్ణవాలు కల్పించగా, ఈ పుడమిపై మానవజాతి నశిస్తుందనీ, యుగాంత ప్రళయం ఆసన్నమైందనీ గడ్డాలు పెంచిన దొంగలు ఎన్నిసార్లు అసత్యాలు కూయలేదు? వరదులై, పులుగులై, ఎన్నిసార్లు అపశకునం పలకలేదు?

రోగం వరదానం ఎన్నటికీ కాదు. రోగం వదలినా ఏవో అదృశ్య బాధలతో మనిషి నీలుగుతున్నట్లు దిగంతాల భీతావహ నేపథ్యాలనుంచి ఏవో విషవక్త్రాల వికటాట్టహాసాలు వినిపిస్తూనే ఉంటాయా? మనిషి సుఖప్రదజీవితం చుట్టూ అశుభాల చెరలాటలు మానవా?

మానవా సంపదలన్నీ కోల్పోయినా, గతకాలాల అంతస్తులను చెరుపుకోలేక, ఎందుకలా ఏడుస్తున్నావు? ఏడుపులెన్నడూ వేడుకలు కావు! నేల నెరియలలో వజ్ర వైడూర్యాలు లభించవు. భయపడిన గుండెలలో కలల క్రిముల కలకలం. ఉన్నచోటే ఉండి ఊరేగుతున్న తొందర!

## 13

అసలీదేశం మూలాలలోనే కుళ్ళుజబ్బు పుట్టింది. అది మనువో, వాడి తల్లికి మొగుడో, ఎవడు కల్పించిన రోగమో తెలియదు. కులాల కూటనీతులు కులకుల మంటూ యుగయుగాలుగా విజృంభిస్తూనే ఉన్నాయి ...

అలనాటి మహావీరుల త్యాగాల ఫలితాలు, ఏ విషకూపాల మునిగాయో? నేటి దురంత విషమయ స్వార్థ తరంగాలలో వాటి నీడలైనా కనిపించవు.

దేశం శిరస్సున భారంగా పాపాల బండరాళ్ళు! విషాద కంటక కిరీటంగా అడుగు పెట్టరాని జ్ఞాపకాల నాపరాళ్ళు.

తప్పదా! నింపాదిగా భద్రంగా తిరోగమనం సాధించవలసిందేనా? పావన త్యాగశీలత పావకగర్భంలో మునిగిందా? సంక్షుభిత మహాకాశం ప్రకాశరశ్మల దిగమింగిందా?

ఇంకా మిగిలిన వృద్ధతరాల సచ్ఛీలతలు నిర్వీర్యమై, నిరుపయోగమై, నిరంతర పరాభూత చిత్తదీప్తులై మడియవలసిందేనా?

ఎవరెవరికి ఎలా విప్లవ నివాళులు అర్పించాలో వీరవరులారా! ఉపదేశించరా? సాహసమతులై ముందుకు రండి! మీ పవిత్ర చరిత్రలతో ధరిత్రిని కప్పండి!

సామాజికుల అజస్రబాష్పజలధిలో వెలిగించిన కర్పూర దీపకలికలు మటుమాయమవుతున్నాయే, ఏది దారి?

హృదయారుణ సజీవ సంకల్పాలు కల్పాంతాలలో సంఘటిత మాయాజాలంగా విపరిణామం చెందుతున్నాయే, ఏ దిక్కును నమ్ముకోగలం? శాఖాంతరాలలో వికటించిన విద్యుద్రేఖలు మృషాపుష్పాలై దర్శనమిస్తున్నప్పుడు మహత్తర పితరులారా! మీకెలా ఆవాహన పలకగలం? ఈ నది జాలిమదిలా కదలక అలలు కరిగించక నీకు జోహార్లందిస్తుందా?

అడవులను నమ్ముకున్న బెడదలు. వెడగులై మనోమోహన గానాల భ్రమల కాహుతిగా మధురశాపగ్రస్తనీహారాలై, కుపితహృదయాలతో నేలకరవడమే ఫలితార్థమా!

మహాభాగులారా! గడచిన విజయగర్వాల పర్వాలతో, చెరచెర రండి! సంశయ పర్వతాలు గమించండి!

ఎవరెవరి వాటాలకు ఎంతెంత విప్లవపీయూషం అందవలసిఉందో స్వయంగా వివరించండి! మీకు మీరై మీ చరిత్ర పుటలు విప్పండి. నివాళులందుకోండి.

వీరవరులకా మొగమాటాలు? సెలయేరులకా వెనుకచూపులు?

ప్రాక్జ్యోతిష్మంతులు కిరణమాలికలు ధరించి జగమంతా కీర్తితోరణాలు సంతరించి స్మృతి దీపాలు వెలిగించండి!

మీ ఆత్మత్యాగాల పూతచరిత్రలు హృదయాలకు అజరామర దీధితు లందిస్తాయి కదా! సంశయం దేనికి? నేడే విచ్చేయండి!

## 14

బ్రతికి ఉన్న మన చుట్టూ అహరహ ఆశావహ సాక్షాత్కారాలుగా, కాంతి వలె, సమీరతరంగం వలె, ఏమిటా గగుర్పాటు? జాగరించండి. శ్రద్ధాళువులై సంస్మరించుకోండి. ఈ దివ్యానుభవం మీ రక్తస్నాయువుల్లో స్మేరకాంతుల ప్రసరిస్తుంది.

ఈ నిశాంత సమయ ప్రాచీదిక్పతి సాక్షాదింద్రనీలమణిగ్రూలకు కాణాచిగా మెరుస్తోంది. గుర్తించుకోండి కన్నులతో; కీలించుకోండి గుండెలతో ... ఇన్నాళ్ళకి కదా బాహాబాహీగా ఉదయిస్తున్నదాశ!

గతరాత్రి భయంకర ధ్వాంతంలో ఛద్మవేషాలు విప్పేసిన బ్రహ్మరాక్షసులు నగ్న తాండవ మాచరిస్తూ సంచరించిన ఈ వసుంధర ఎంత కశ్మలమై పోయింది?

ఇప్పుడుకదా ఆగామి వేగున అమృత జీవవాహిని దర్శనమిస్తున్నది! చిరస్మరణీయ దీపికలు వెలిగిస్తున్నది!

జనతా హృదయ కాంతిరేఖలారా! దయచేయండి, దయచేయండి!

నిన్నటి మీ వీరసమరంలో ఎవరెవరిని ఎందుకోసం అంతరింపజేసారో మీకు మీరై వివరించండి! దాపరికాలు, బిడియాలూ లేని తబిసీళ్ళన్నీ వసుంధర వినదలచు కుంది. మహావృక్షాలన్నీ చిగురాకుల చిలిపికళ్ళతో కుతూహలం ప్రకటిస్తున్నవి.

ఈ నిశాంతం విషాదాంతాలకు విరుగుడు. అర్హులకు సముచిత సత్కారాలందించే సహృదయాతిథి!

ఎవరి అర్హతననుసరించి వారికే ఎంతెంత ప్రతిఫలం లభించాలో అంతా అంది తీరుతుంది. ఎన్నెన్ని కీర్తి పతాకల కితాబులు అందగలవో సందేహించక వివరించండి మీరే! దేశమాత తూరుపు దిగంతనేత్రంతో దీవించడానికి ప్రసన్నమై నిరీక్షిస్తోంది...

భ్రాతలారా! విభ్రాజమాన మానవులారా! - మీరే నిజంగా ఆశావహ ధావళ్యమూర్తులు. మీరే మీరే శుభంకరులు! సాటిలేని జయంకరులు!

ప్రజాహృదయ సమవర్తులై, క్రాంతికార దుర్వ్యవస్థాహర్తలై ... ప్రళయకాల మూర్తులై ... - మీరే మీరే వేంచేయండి! జనతా హృదయసాగర జలాలై పోటెత్తండి!!

*(సశేషం)*



# ప్రయాణికుడు

**- డా॥ రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు**

నేను రైలెక్కునపుడు సామాను బరువు
మోయుచుందును దాని నే పోర్టరుండో
తీసికొనివచ్చునపుడైన దిగదు బరువు
కానరాని రూపాన నాలోన నుండు

బండి వచ్చును ఒక కొంత బరువు దిగును
పెట్టె లే సీటు క్రిందకో నెట్టబడును
నెక్కు మూటలు పై బల్ల; నింతలోన
రైలు కదలును; మరికొంత తేలికౌదు

అప్పుడొక మార్పునకును లోనౌదు నేను
చిత్రముగ; అంతవరకును పాత్రనె కద

ఈ ప్రపంచాన; కపుడేను ప్రేక్షకునిగ
తర్జుమా యౌదు; రైలు మంత్రమయ శాల

వేడొ శక్తి కొలది విసరి వైచిన వేణు
వట్లు దొర్లి దొర్లి యాగు రైలు
కుదుపు తగిలి చెల్ల చెదురైన స్వరముల
పగిది నుందు రపుడు దిగెడు జనులు

చుట్టు ప్రక్కల వారిని చూచుచుందు
వారి కోపాలు తాపాలు వారి గాబ
రాలు తాత్కాలికంపు స్నేహాలహాలు
నాకు గన్పట్టు నొక్క సన్న్యాసికి వలె

చూచుచుందు; నెవరొ చలి కాచుకొనుచు
నుందురిట; నీట బట్టల నుదుకు చుంద్రు
చెట్లు చేమలు కాల్వలు చేలు బాట
లన్నియును సినీమా బొమ్మలట్లు తిరుగు

ఎవ్వడో ఆసనము కోస మెవరికో - అ
ధర్మ మొనరింప వానితో తలపడియెద
నెట్టి ఉద్వేగమును లేక: ఎవరికైన
చేయుదును సాయమేమి ఆశించకుండ

చెందియును చెందనట్లుగ నుందు నీ ప్ర
పంచమున కప్డు నిర్లిప్త భావమొంది
ఎంత ఉత్తమ మీ స్థితి ఎపుడు నిట్లె
ఉండవలెనని అనుకొనుచుందుగాని

ఏను దిగవలసిన స్టేష నేగుదెంచు
వేళ కేమౌనొ? ఎద నన్ను వేగిరించు
పాత్రనైపోయి దిగిపోదు ప్రక్కజనుల
త్రోసికొనుచును సామాను మోసికొనుచు.



# వీరి వీరి గుమ్మడి పండు
## (క్విజ్ కవితలు)

- ఆసు రాజేంద్ర

*(41+42 సంయుక్త సంచిక తరువాయి)*

26. పుష్పం నింగిది
దాని పరిమళం నేలది.

27. దేహం కఠినాతి కఠినం
మనసు సుతి మెత్తనం
హృదయం సజల పూరితం

28. నా తోట నిండా మల్లెలు
చూసేవాడే తప్ప
కోసేవాడు లేడు.

29. కరవని పాము
తరమని పాము
భలేభలే పాము
మావూరి మెలికెల పాము

30. ఇదేమి చోద్యం
నన్ను కరచి
వాడు ఏడుస్తాడేమిటి?!

31. నాకు ఎన్ని దంతాలున్నా
కొరకలేను నములలేను తినలేను.

32. వెండిగిన్నె
వొంపకున్నా
రాత్రంతా పాలు కారుతూనే ఉన్నాయి.

33. అత్తను కుదేసి
ఆరళ్ళు పెడుతుంది కోడలు.

34. అరసున్నా
అలిగిందో ఏమో
అటకెక్కింది.

35. పెట్టపెట్టని గుడ్డు
పిల్లాడు
పొదుగుతున్నాడు.

36. పాల మీగడలాంటి
చిన్నది
గిచ్చితే చీర యిస్తుంది

37. పడగ విప్పని పాము
పెరట్లో
పహారా కాస్తుంది

38. కని పారేసిందో తల్లి
తను మోయలేని
బిడ్డని

39. తల్లి మోట
బిడ్డలు రివట
వీరు ఏకమై కుట్రపన్నితే
లోకమే బూడిద

40. కనికరమా?! కాఠిన్యమా?!
దూలానికి ఉరితీసి
పిండివంటల్ని వడ్డిస్తున్నారు.

41. ముక్కు మొగం లేనిదాన్ని
చెలిమి చేస్తే
మీరే నేనౌతా.

42. చిన్నయింట్లో చిత్రం
కొడుకు దేకుతాడు
తండ్రి నడుస్తాడు
తాత పరుగెత్తుతాడు

43. తనేం దేవత కాదు
అయినా
గోపురంలోనే కాపురం

44. వానా కాలపు రైలు
పట్టాలు వదలి
రోడ్డు ఎక్కింది

45. నెత్తిమీద నల్లకుండ
పగిలిందంటే
శిరస్నానమే!

46. పాపాయి గొంతులో గులకరాయి
నెత్తిమీద ఒకటిచ్చుకుంటే
కెవ్వుమంటాడు.

47. దిగంబరిని
ఒక్క నూలుపోగైనా
ఒంటి మీద లేకుంటే
అడుగు ముందు కెయ్యలేను.

48. చుక్కల పందిరి
చుట్టుకుంది మెలికెల పాము
చుక్కలతో బాటు
తనూ మెరుస్తూ ...

49. పచ్చని యింట్లో
వెచ్చగా పడుకుంటాను
ముళ్ళదుప్పటి కప్పుకుని.

50. నా ఉసురు తగిలే
ముగ్గలు
పువ్వులవుతున్నాయి.

*(సమాప్తం)*

## జవాబులు

26. చందమామ
27. కొబ్బరికాయ
28. పాలపుంత
29. కాలువ
30. మిరపకాయ
31. దువ్వెన
32. వెన్నెల
33. రోకలి
34. నెలవంక
35. సున్నా
36. వెల్లుల్లిపాయ
37. పొట్లకాయ
38. గుమ్మడికాయ
39. అగ్గిపెట్టె-పుల్లలు
40. ఉట్టి
41. అద్దం
42. గడియారం
43. నత్త లేదా తాబేలు
44. రోకలిబండ (పురుగు)
45. మబ్బు
46. గోలీసోడా
47. సూది
48. వాకిట్లో ముగ్గు
49. గొంగళీ పురుగు
50. పొయ్యి.

# డా॥ రాజేశ్వరీ దివాకర్ల కవితలు

## 1. సరళ విశ్రాంతి

ఇప్పుడొక చోట
ఆమెను గురించిన ప్రశంస విచ్చుకుంటుంది.
మనసున నాటుకున్న పరిమళం
స్మృతుల పూలగుచ్ఛమందిస్తుంది.
నాలుక తిరుగని పద్యాలను
పట్టి పలుక నేర్పించిన
తెలుగు టీచరమ్మను
సాహిత్యాచార్యునిగా ఎదిగిన శిష్యుడు
ప్రతి వేదికమీద తలచి
వినయ సంపన్నుడౌతాడు.
లెక్కలురాని తనాన
రెక్కలు వంచి ఎక్కాలను దిద్దించిన
గణిత శాస్త్ర ఉపాధ్యాయినికి
చుక్కల ఉన్నతికెక్కిన ఛాత్రుడొకడు
స్వహస్త లిఖిత ఉత్తరాన
ఋణశేషం నిలుపుతాడు.
ఆఖరు బెంచీ ఆకతాయిని
అలాగే వదిలేయక
క్రమశిక్షణ కలిగించిన
కరకు పంతులమ్మను
బాధ్యత పదవులు చేరిన విద్యార్థి
బదిలీఅయి తిరిగి వచ్చి
మొదటి పలకరింపుల
అంచమిచ్చి
మనసును కరగిస్తాడు.
ఆమె కంటె ఘనులు
అలల నురుగులు కట్టి

భూమి పాదం తాకవచ్చినవాళ్ళు
సరళ విశ్రాంత జీవితానికి
సంతృప్తిని దోహదం చేసినవాళ్ళు.

* * *

## 2. వ్యయం - అవ్యయం

గోడ గడియారం టిక్కుమనకుండానే
సమయం విలువ తరిగిపోతుంటుంది
అమ్మాయిని కొడుకుతో సమానంగా
పెంచుకోవాలనుకున్న కోర్కెకు
మనసు మూల్యం వెచ్చమౌతుంది
రహదారిని గెలవాలంటే
తిరుగులేని చక్రవడ్డీ ఋణం
గిరగిరమని చుట్టుకుంటుంది.
ఇంటి ముందు వసారాలో
ఇప్పుడు కనిపించని వాలుకుర్చీ
వృద్ధుల సరకు లేని కొరతను
బాహాటంగా చూపుతుంటుంది.
పొద్దున్నే ఎవరి తోవన వాళ్ళు
వెళ్ళిపోయే తొందరలో
మొబైల్ కటిసూత్రం
మనుషుల దూరాలను కరగిస్తుంటుంది.
మధ్యతరగతి రాకపోకల బంధుత్వం
ఇంటికి వేలాడే తాళం కప్పతో తరగిపోతుంటుంది.
ఉగాదినాడు సెలవు కనుక
పొయ్యి మండక
నీలికళ్ళ పిల్లి నిదరపోతుంటుంది.
పండుగ భోజనానికి
అంగడి వెల చెల్లించుట తప్పనిసరి అవుతుంది
ప్రపంచీకరణ ప్రమాణాలకు

రూపాయిల ఖర్చు నీరై పారిపోతుంది.
ప్రతిదిన జీవన పరిచర్యకు
వ్యయం అవ్యయమౌతుంది

* * *

## 3. పూలమ్మే సంపంగి

ముక్కుపచ్చలారని సంపంగి
కలువ కళ్ళను విచ్చుకుంటూ
దళసరి దవనం ఆకుల
నూలు బుట్ట గౌనుతో
గన్నేరు కాయ కట్టిన
రక్ష తాయెత్తుతో
మందారం తేనె పిలుపులతో
మావాడ వరుసకు
పూల అమ్మకానికి వస్తుంది.
సరాసరి సాయంకాలానికి
సమయ గంధం తెస్తుంది
దీపం వెలిగించాలనుకున్న దృష్టికి
దోసిట నీరాజన మిస్తుంది
ఏ పేరిట దేవునికైనా
మెడలు వంచి
మాలలు వేయిస్తుంది
సరాసరి మూరలకు
బరాబరు వెలను చెప్పి
కొసరుకు మరింత చేర్చి
మనసుకు చేరువ అవుతుంది.
కత్తిరించిన గులాబీలను
గుచ్ఛాలను చేయగల నేర్పరి
బతుకు శ్రద్ధకు
విరుల స్నేహం
పంటబట్టించుకుంది.
మా పిల్లల ఈడుది
బడివేళలు ముగియగానే
జరుగుబడికి
ముడి సుమాల రాబడి
చేరుస్తుంది
తప తప రెక్కల పక్షులు
తమ గూటికి చేరే వేళ
అలసట తరిమిన నడకతో
చిన్ని గుడిసెను చేరి
అరమోడ్పు మొగ్గ చూపుల
అమ్మ తడిబుగ్గల
కానుతుంది.
గతుకు రేకు కంచంలో
గుప్పెడు కారం
మెతుకులు తిని
రేపటి చదువుల పాఠాన్ని
దిద్దుకునే దీక్షతో
గోడ వెలుగు నక్షత్రమై
గూటి పుస్తకం తెరుస్తుంది.



# చెట్టమ్మా ... చెట్టమ్మా! ...

– కె. ప్రేమ్‌కుమార్

పల్లవి: చెట్టమ్మా చెట్టమ్మా ...
పచ్చానీ చెట్టమ్మా ...
నువు లేకా మానవ మనుగడ లేనే లేదోయమ్మా ... ||చెట్టమ్మా||

చరణం:

1. ఇంటింటీ గుమ్మంలోనా – తోరణాల ఆకైనావూ
పెండ్లీలు, పండుగలొస్తే – పలకరించె పందిరివైనవ్
నిండూ ముత్తయిదువలాగా – ఇంటి ముందె ఇలవేల్పయినవ్
చుట్టాలూ పక్కాలొచ్చిన – చిరుగాలితొ పలకరించినవ్ ||చెట్టమ్మా||

2. ఆకలేస్తె అమ్మైవచ్చీ – కడుపు నింపె పండయినావూ
నిద్దరొస్తె ఊయలగయ్యీ – గాలి ఈల జోల పాడినవ్
ఎండొచ్చిన వానవొచ్చినా – గుండెలోన దాచుకున్నవూ
నీ గుణములొ గోరంతైనా – మనుషులకూ లేదోయమ్మా ||చెట్టమ్మా||

3. పొద్దున్నే శుద్ధిని చేసే – పళ్ళుతోమె పుల్లయినావూ
వంటకుండ పురుడుపోయగా – పొయ్యిలోన నిప్పయినావూ
అమ్మమ్మా తాతయ్యలకూ – తోడు నడిచె కర్రయినావూ
కూర్చుంటే కుర్చయినావూ – కునుకొస్తే మంచం అయినవ్ ||చెట్టమ్మా||

4. పరులసేవె ముఖ్యం అంటూ, శిరసు వంచి ముందు నడిచినవ్
చనిపోతే పాడైనావూ – కాల్చేసే కాడైనావూ
దహనంకూ దానం ఇచ్చీ – నీ దేహం కాల్చుకున్నవూ
ఎంత గొప్ప త్యాగమె నీదీ – ఓ పచ్చని చెట్టమ్మా ... ||చెట్టమ్మా||

5. నరులారా గురులారా ... – ఓ పండిత పామరులారా
ఆయురారోగ్యము నిచ్చే – చెట్టు కథను విన్నారా ...
పరిమళించె పచ్చని చెట్లూ – అంతరించి పోతున్నాయీ
పర్యావరణాన్నీ మనమూ – రక్షించగ ముందుకు పోదాం. ||చెట్టమ్మా||



# ప్రచండస్ఫూర్తి

– డా॥ అమళ్ళదిన్నె వేంకటరమణప్రసాద్

నేను సత్యాగ్రహిని
ఆయుధం నా ఆసరా
తాడిత ప్రజానీకంతో కృపాకీల వెలిగించే
గుండెబలమే నా బలం, బలగం.
ఉన్నట్టుండి హఠాత్తుగా తుపాకీలు పట్టాన్నాను.
అసంతృప్త జ్వాలల్లో రగిలిన కొలిమిలో
సాగి పదునెక్కిన మారణాయుధంతో
పండు కోసుకుంటే? ......
పాతుకుపోయిన పాతమఱ్ఱి ఊడల్ని
కాల్చకుండా పెరికేస్తే ?? ......
ఆలోచించాను.
ఆశయం జనంలోకి వెళ్ళింది
ఆచరణం జనబలమై గెల్చింది
నరుల నరనరాల్లో నా ఇజం నిజంగా నిలబడింది.
మసకబారిన బాపుటాలను దింపేసిన చరిత్ర పుటల్ని
కరపత్రాలుగా పంచాను.
గమనించండి నన్ను.
నా ప్రగతిశీల పరిణామ సిద్ధాంతాల్ని పరిశీలించండి.
నేడు నా అభిమతం జనహితం – సమ్మతం.
మీరూ కదలండి
జనవాహినిలో మంచినీటి బిందువులై
మెల్లగా చాపకింద దొర్లండి
ముప్పును ముంచేస్తూ
సశాస్త్రీయంగా లయబద్ధంగా ఉప్పెనలా పొంగండి.
అడవుల్లో రక్తాభిషేకాలు నిలిపేసి
జనగణంలో అమృతాభిషేచనం చేయండి.



## "అభినవ కృష్ణరాయ"లకు -

# అభినందన పద్యపుష్పాలు

(పశ్చిమ గోదావరి జిల్లా తణుకులో 1924లో స్థాపింపబడిన "నన్నయ భట్టారక పీఠం" అనే సాహిత్య సంస్థకు ప్రస్తుతం అధ్యక్షులుగా వున్న డా॥ జి.యస్.వి. ప్రసాద్‌గారు వృత్తిరీత్యా డాక్టరుగారు: M.S. (ENT), F.I.C.S. వృషనామ సంవత్సర ఉగాదినాడు (25-3-2001 నాడు) తణుకు పట్టణంలోని పెద్దలు, కవులు, పండితులు, విమర్శకులు చేరి డా॥ ప్రసాద్‌గారికి "అభినవ కృష్ణరాయ" అనే బిరుదాన్ని ఇచ్చారు. డా॥ ప్రసాద్‌గారు ప్రతి సంవత్సరం ఉగాదినాడు ఒక పండితుణ్ణి 5వేల రూపాయలతో సత్కరిస్తారు. తణుకులో పాతవూరు వంతెన వద్ద నన్నయ విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. నన్నయ భట్టారక పీఠానికి కొన్ని లక్షల రూపాయల నిధిని సేకరించి పెట్టారు. ఇటువంటి ప్రసాద్‌గారు "అభినవ కృష్ణరాయ" బిరుదానికి అన్ని విధాలా అర్హులు. వీరిని అభినందిస్తూ మా అన్నగారైన శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు రచించిన పద్యాలను 'చైతన్య కవిత' 41+42 సంయుక్త సంచికలో ప్రచురించాను. ఇప్పుడు మిగిలిన కవుల పద్యాలను వెలువరిస్తున్నాను.

– తంగిరాల)

## 1. "సరస్వతీ పుత్ర"–"త్రిభాషా మహా సహస్రావధాని"–"అభినవ శుక"

## శ్రీ వద్దిపర్తి పద్మాకర్

సీ. ఆది కావ్యాంకితంబంద రాజ్యమ్మిడు
        రాజరాజనృపాల రాజునేడి?
"మామా"యటంచు సమాదరమ్మొసఁగెడి
        మనుమసిద్ధి నృపాలమాన్యుఁడేడి?
కనుపట్టినంతనే గద్దియడిగ్గి, గౌ
        రవ మొసంగెడు కృష్ణరాయఁడేడి?
కవియన్న వాణి సాక్షాద్రూపమనినమ్ము
        రాణ్మణి రఘునాథ రాయడేడి?

తే.గీ. యనుచు రోదించునట్టి భూజనని కిపుడు
కలిగె నూరట, స్వస్థత కలిగెనయ్య!
ధీవరా! అభినవ కృష్ణదేవరాయ!
నీకు నీ బిరుదమ్ము రాణించు కతన. 1

క. స్మృతి ధర్మాంకిత జీవిత!
శ్రుతిఘోష శ్రవణమాత్ర రోమాంచిత! సం
స్కృత భాషా పటుసేవా
రత! అభినవకృష్ణదేవరాయ! ప్రసాదా! 2

క. వైద్య ప్రవృత్తికిని, నీ
విద్యాదాన ప్రవృత్తి వేదిక కాగా
సద్యోముక్త్యాధ్యాత్మిక
విద్యా ప్రద్యోతనుఁడవు వెలసితి కలిలో॥ 3

మ. కవులన్ పండితవర్యులం దెలిసి, సత్కారమ్ముతో, ఆంధ్ర వి
ద్య, వరిష్ఠమ్ముగఁ జేయు కాలము ప్రసాదా! త్వ త్ప్రసాదమ్ముగా
సవిశేషోత్సవమయ్యె, నీచలువచే, స్వర్ణాంధ్ర సాధించి, వై
భవ మిట్లుండునటంచుఁ జూపఁగదె, విద్వద్వంద్య! వైద్యోత్తమా! 4

చ. ఉభయ సరస్వతీ పద సముజ్జ్వల కాంచన కింకణీ స్వనం
"బభినవ కృష్ణరాయ" బిరుదాంచితుఁ జేసె, ప్రసాదవర్య! సం
క్షుభిత మహాంధ్ర సత్కవితకున్ పునరున్నతి వచ్చె, మాకునౌ
నభయము, నీకుఁ గల్గుత! సమంచిత కీర్తి జయాయురున్నతుల్ 5

* * *

## 2. రసరాజు

ఎవడు కవియంచు యవతారమెత్తి - కలము
పట్టుకొనగల్గునో - దానిపైన - పసిడి
పూలు వెదచల్లు జీయస్వీ! పూర్వపుణ్య
తేజ! శుభమస్తు! నవకృష్ణదేవరాయ! 1

సభమును తాకవచ్చు - సధునాతన శాస్త్ర విధానమబ్బినన్
విభవము నందవచ్చు - కృషి వేయితలల్ పయికెత్తి నిల్చినన్
"అభినయ కృష్ణరాయ!' యని ఆడగవచ్చును - వేషమున్నచో
"అభినవ కృష్ణరాయ!" బిరుదందుట గొప్ప సుమీ! ప్రసాదుజీ! 2

* * *

## 3. సుశర్మ

అతి ధీమంతుడు వృత్తి కార్యమగు - ఈ.యన్.టీ చికిత్సన్, - సదా
హితుడీ నన్నయ పీఠ సభ్యులకు సాహిత్యంబునన్, రాయలై
ప్రతిభ్ జూపును సాహితీ సభల ధారాళమ్ముగా పల్కుచున్
అతడీ సంస్థకు పుష్టినిచ్చెను గదా అధ్యక్షుడై దక్షుడై!

* * *

## 4. డా॥ కడిమిళ్ళ వరప్రసాదశతావధాని

నీ వైద్యమ్మది లోకసంస్తుతము గానీ సాహితీ భారతీ
సేవాయత్తము నీదు చిత్తమగుటే చిత్రంబు మాబోంట్లకున్
శ్రీ వాల్లభ్యము భారతీగరిమయున్ జేరెన్ గదా నిన్ను న
య్యా! విద్వత్కవి పద్మహేలివట జీయస్వీ ప్రసాదా! నతుల్.

* * *

## 5. కోట వేంకటలక్ష్మీనరసింహశతావధాని

సభలను నిర్వహింపగల జాణవు నీవని నవ్యసాహితీ
విభవ వివేక సంపదల విజ్ఞుడవీవని తణ్కుపట్టణం
బభినవ కృష్ణరాయ సుపదాన్వితు జేసెగ ఓ ప్రసాద నీ
విభవము వేయిరెట్లగుత విస్తృతి పొందుత భాష ఈ పురిన్.

* * *

## 6. డా॥ కుంచే

శ్రీలతో సాహితీ సీమలో భాసిల్లు
సరసగుణుండు ప్రసాదుగారు
ఓర్పు శాంతి సహన ముబ్బతిల్లగ సాగి
వెజ్జునై యలరారు సజ్జనుండు
నెలనెలా సభలకు బలమిచ్చి ఫణమిచ్చు
దక్షుడై, పీఠికధ్యక్షు డితడు.
ప్రతివత్సరమ్మొక పండితోత్తమునకు
అయిదువేల్నూట పదార్ల నిచ్చు

ధార్మికుం డాణిముత్యమై తనరువాడు
పలుకుపలుకులో సౌమ్యత పరిఢవిల్ల
అవర రాయలై నటనల నలరుచుండ
ముద్దుబిడ్డడు నాకని మురిసె వాణి!



## అచ్చెరువు శాస్త్రి

(ఉభయభారతి బ్రహ్మశ్రీ చెఱువు సత్యనారాయణ శాస్త్రిగారి అకాలమరణానికి దుఃఖిస్తూ...)

"మహాసహస్రావధాని"-"ధారణా బ్రహ్మరాక్షసుడు"
- డా॥ గరికిపాటి నరసింహారావు

ఫాలమ్ము త్రిప్పెనా పరమేశ్వరుని ఫాల
నేత్రాగ్నికీలమున్నిలిచినట్లు
మాలికల్ పలికెనా మాలికా డోలికా
తూలికా తల్పాల తూగినట్లు
అవధాన మిచ్చెనా వ్యవధానమే లేక
ద్యోధునీ భంగాలు దూకినట్లు
ఆశీర్వదించెనా ఆదిశేషుని రెండు
వేల జిహ్వాలు స్వస్తి పల్కినట్లు

అతడు నుతియింపబడుగాక ఆశువుగను
సత్యనారాయణుండు మా శాస్త్రిగారు.
చెఱువు గాదది బుద్ధి కచ్చెరువు గాని
బరువు గాదది జాతికిన్ పరువుగాని. 1

చెఱువై శ్రోతృ మనస్సరోరుహములన్ చిందెన్ సుధాబిందువుల్
గురువై వాకిట సంస్కృతాంధ్రముల నిగ్గుల్ జూపె మా బోంట్లకున్
తరువై మాలిక లెల్ల డోలికలుగా తల్పాల నూగించు అ
చ్చెరువున్, నిర్మల జీవనమ్మును జితశ్రీ నేను ప్రార్థించెదన్. 2

దోసము పల్కినంతనె ఎదో ఒక మాదిరిగాగ నవ్వు మీ
మీసము చాటు నూసులకు మేము చలించి పరిష్కరింపగా
మీసము దువ్వి భేషగు సుమీయని కన్నుల తోడ నవ్వరే!
మీసము గల్గు భారతివి! మీ సములేరి వధానవిద్యలో 3

ఈడే మీకు శతావధాన కళలో ఈనాడు మా బోంట్లు! మీ
రే డంబంబునులేని సత్కవితతో, ఈశాన నేత్రాగ్ని కీ
లా డంబాకృతి తోచు శబ్దతతితో, లాలిత్య విస్ఫూర్తితో
మా డెందంబుల దోచుకొంటిరిక సొమ్మై నిల్చి గీర్వాణికిన్ 4

గ్రీష్మర్తుప్రతిభా సమాన రవియై గీర్వాణ పాథోధియై
భీష్మాచార్య శరప్రసార నిభమై వేవెల్గులన్ జిమ్ము! శా
భాష్! మాకంద రసప్రవాహ మనగా వాణీశ్రవఃకుండలా
ర్చిష్మత్త్వాకలితావధానమిది అచ్చెర్వున్ ప్రసాదించెడిన్ 5

ఆశువు పల్కువేళల మహాశుగవేగము నందుకోవలెన్
వ్రాసెడివారలందుకొని వ్రాయగలేనటు పల్కగావలెన్
రాశులు రాల పద్యముల రాసులు పోసెడి మీ కవిత్వమం
దాశువులా వియద్ధునికి ఆగని వేగము నేర్పజాలెడిన్ 6

* * *

ఓ దుర్మార్గపు మృత్యువా! చెఱువువారో! నీకు నాపోశనల్?
ప్రాదుర్భూత సుసంస్కృతాంధ్ర కవితా ప్రాణ స్వరూపంబు, వా
ణీ దివ్యాధర రక్తిమంబు, సురవాణీ దత్తచిత్తంబు - ఏ
దో దౌర్భాగ్యము గాక వీడి చనునా దూరాబ్ధి తీరాలకున్ 7

ఏడ్చుట తప్ప మీ కొరకు ఏమి యిడంగలవారమయ్య? నీ
వూడ్చుకు పోతివే కద! మహోన్నత సంస్కృత వాక్యబంధముల్
పూడ్చుకు పోయె గొంతు - రసపూర్ణ సుధామధుపాత్ర వీవునై
మాడ్చుట ఎట్టి ధర్మమగు మమ్ము వియోగపు మండుటెండలో! 8

ఎవ్వారు మా పద్యహేలా విలాసాల
మెరుగు నురుగు చూచి మెచ్చువారు?
ఎవ్వార లవధాన మిందీవరంబంచు
మాలికాభ్రమరమై వ్రాలువారు?
ఎవ్వారు మా తప్పులెన్నేని సైరించి
గుబురు మీసములందు గ్రుచ్చువారు?
ఎవ్వారు మామేన జవ్వాది గంధమై
నిండు కౌగిలి చాపుచుండువారు?

ఒక్క చెఱువు వారె, ఒక్క చెఱువు వారె,
దక్క లేదు మాకు దక్క లేదు
ఉక్కు పాదమూనె దిక్కుమాలిన చావు
గుడిని బోలు వారి గుండె మీద! 9

* * *

ఎల్లా ఉంటివి స్వర్గలోకమున ఈ ఏడాదిలో ఎన్ని శ్లో
కాల్లాగించితివయ్య? తారమొగుడింకా అక్కడున్నాడ? నీ
కల్లోలానికి రోడ్డుపట్టుకొని చక్కా పారిపొయ్యాడ? నీ
కిల్లీ కక్కడ లోటు లేదు గద? బైంకే దొర్కుతోందా? సరే
అల్లా ఉండని; దేవలోకమున ఈ అష్టావధానాలు ప
ద్యాల్లాజేస్తర? పద్యగద్యముల యుద్ధాలక్కడున్నాయ? ఈ
ఉల్లోమల్లెనె సాహితీసభలు ఎన్నో ఉంటయా? లేక ను

వ్వెల్లాకైనను పెట్టుకోర? అవునెంతిస్తారు మాట్లాడితే?
ఇల్లా ఎంతగ మొత్తుకొన్న మరి నీకేం కోపమో గాని మా
కల్లో కైనను రావు గాదె! ఒక లోకల్‌కాలు చైకూడదా?
పోల్లే చెయ్యకు నేనె చేస్త - మరి - నీ ఫోన్నెంబరెంతయ్యా? ఊః
హల్లో నైనను మాటలాడు చెలువా! హల్లో...హల్లో... కటైపోయెగా! 10

(ఈ పద్యాలను పంపిన మిత్రులు శ్రీ బి.ఎస్. నెహ్రూగారికి
కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను - తంగిరాల)



# కానుక

- కీ.శే. గుంటూరు శేషేంద్రశర్మ

శా. శ్రీకారుణ్యమగణ్యమై, కవి జగజ్జేగీయ సోద్గుణ్యమై
లోకాలోక పరీత రాజ్యరమణీలుంటాక పంటాన్వయా
నీకఖ్యాతి శరణ్యమై వెలయు వన్నెల్ పొన్నలూర్వంశపుం
బ్రాకారంబులఁ బచ్చతోరణములై భాసించు నశ్రాంతమున్. 1

శా. నాకుంగల్గిన భూరి హర్షమునకున్ దార్కాణగా మిత్రమా!
నీకుం దెచ్చితి మెచ్చి యీ యపరవాణీ మంజు మంజీరముల్
నీ కల్యాణ సభాంతరాళ కలకంఠీ కంఠ ఘంటాపథ
వ్యాకీర్ణస్వర మాధురీభరములై వాసించు తద్వైఖరుల్. 2

మ. అవురా! యెవ్వరికేనియుం గలదె? రాకా శీకరాంశు ప్రభా
నివహ క్షీర పటీర గంగలహరీ నీహార హారావళీ
శివ సంకాశ యశః ప్రకాశయుతుఁడౌ శ్రీ కోటరెడ్డి ప్రభుం
డవిలంఘ్య ప్రతిభా సముద్భట లుఠత్ ద్యావా మహీమండలీ
భవితవ్యుండగు వీరరాఘవ మహాభాగుం డఖండస్థితిన్
దివిషద్వీథికి చంద్రసూర్యులవలెన్ తేజంబు వాటించుచున్
భవదభ్యున్నతి కండయౌ శుభపరీపాకంబు లోకంబునన్
(అవురా! యెవ్వరి కేనియుం గలదె?) 3

ఉ. పున్నమనాటిరేయి విరబూచిన కన్నెగులాబి గిన్నెలో
వెన్నెల తూలికం దడిపి, విశ్వవిధాత దిగంతసీమలం
జెన్నగు మేలుబంతిగ వచించి రచించినయట్టి సర్వలో
కోన్నతమూర్తి మీ జనకుడో సుకుమార కుమార శేఖరా! 4

ఉ. ఆతఁ డజాత శత్రుఁడు, సమస్త సుధీజన మిత్రుఁ, డార్జవో
పేత చరిత్రుఁ, డగ్రపదవీ భరణైక సమగ్ర పాత్రుఁ, డీ
వాతని గర్భవాస జనితాంకురమన్న తెలంగెటింగి, తత్
చేతము పల్లవింప, నవజీవిత రంగమునన్ మెలంగుమా! 5

ఉ. ఓయి సఖా! సుఖింపు, మధురోహలు డోలికలై చలింప, చాం
పేయ లతావితానములు, వేణువులున్ విరబూయు కోనలో
తీయగ, నిర్ఘరీ పులిన తీర కుటీర పటీర శీతల
చ్ఛాయల కోయిలల్ సలుపు చక్కని గీతిక లాలకించుచున్. 6

చ. హసన కిసాలయమ్ము లధరాధర శీధు రసప్రసారముల్
గుసగుస పిల్లగాలు, లుపగూహన వల్లులు నుల్లసిల్లు మీ
యొసపరి ద్వంద్వజీవిత నవోజ్జ్వల సీమలఁ జందమామ యిం
పెసగ నిరంతరంబుఁ గురియించుత తన్మిహికా వికాసముల్. 7

క. హిమగిరి శిఖర వనాంతర
రమణీయ సరోవిరాజ రాజమరాళ
భ్రమగొల్పుత మీ మిథునము
విమలాయుత శ్రీనివాస! వినయ విలాసా! 8

(1960లో నెల్లూరు జిల్లాలోని గూడూరు పురపాలక సంఘాధ్యక్షులుగా పనిచేసిన పొన్నలూరు కోటారెడ్డిగారు వారి అన్నగారైన వీరరాఘవరెడ్డిగారు మహాకవి గుంటూరు శేషేంద్రశర్మగారికి మంచి మిత్రులు. అప్పుడు శేషేంద్రగారు గూడూరు మునిసిపల్ కమీషనర్‌గా పనిచేసేవారు. కోటారెడ్డిగారి కుమారుడు చి॥ శ్రీనివాసరెడ్డికి, నెల్లూరు వాస్తవ్యులైన రేబాల శంకరరెడ్డిగారి కుమార్తె చి॥సౌ॥ విమలతో 14-12-1960నాడు విక్రమసింహపురీ పురమందిరంలో వైభవోపేతంగా వివాహం జరిగింది. ఆ సందర్భంలో నెల్లూరు జిల్లాలోని ప్రసిద్ధ కవులైన గుంటూరు శేషేంద్రశర్మగారు, మల్లెమాల సుందరరామిరెడ్డిగారు, ముదివర్తి కొండమాచార్యులవారు ఆశీర్వజన పద్యాలు వ్రాశారు. ఈ ముగ్గురు కవుల పద్యాలను "కల్యాణ కింకణి" పేరుతో చిన్న పుస్తకంగా ముద్రించారు. శేషేంద్రగారి పద్యాలకు "కానుక" అనీ, ఎం.ఎస్. రెడ్డిగారి పద్యాలకు "ఆశీస్సు" అనీ, ముదివర్తివారి పద్యాలకు "మంగళాశాసనమ్" అనీ శీర్షికలు ఉంచారు.)

# చాటు పద్యాలు

## 1. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు

ఉ. దీవ్యదనేక కావ్య సముదీర్ణ మనోహర భావజాలమున్
నవ్యవిధాన మొప్పగ జనంబునకున్ బ్రకటించు సాహితీ
భవ్యసభాప్రభాకర! దివాకరవంశ సుధాకరా! పరా
ర్థవ్యవహార! వేంకటవధాని! మహోజ్జ్వల సాహితీఖనీ! 1

తే. సంస్కృతాంధ్రాంగ్ల ముఖ్య భాషా విశేష
పాండితీ మండనుఁడు, సాధు వర్తనుండు,
సరస రచనా చణుడు, కవివరుఁడు, వేంక
టావధానికివె నమస్సుమాంజలితతి! 2

– కీ.శే. వేముగంటి నరసింహాచార్యులు

* * *

## 2. డా॥ రాచకొండ నరసింహశర్మగారు

ఆ. బంధుమిత్రులనిన, భార్యామణియనిన
ఆదరాభిమాన మతిశయమ్ము,
అంకితమ్మునిచ్చె అన్నపూర్ణ సతికి
కావ్యకన్య నెలమి కవివరుండు.

తే. అమృత రస మొల్కునట్టి వితోధికముగ
కృతులు విరచించి ఆవిష్కరింప జేసి
రసిక జనసన్నుతుండయి వ్రాలుగాక
రాచకొండ నృసింహశర్మ కవివరుడు.

– డా॥ సుంకరి వెంకమాంబ

* * *

# 3. శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు

మ. అనిదంపూర్వ మహస్సు ధామనిధి నభ్యర్థించె నేమో తిథి
ప్రణి, మేల్మేల్ మెఱపించె నీ క్షణద నీ భాగ్యం బనూనంబుగాన్
అనిశంబాత్మ పవిత్రచింతనల ధిష్ణ్యంబౌ నరశ్రేష్ఠులన్
గనరే వెల్గుదొరల్ కృపన్? సకల రుగ్రమ్యా! నృసింహాన్వయా!

– చిటిప్రోలు కృష్ణమూర్తి

'దాన రాధేయ' శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారికి 2007 శ్రీరామనవమినాడు సహస్ర పూర్ణచంద్ర దర్శనోత్సవం జరిగింది. ఆ సందర్భంగా శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారు వ్రాసిన పద్యం. ఈ పద్యానికి ప్రాచార్య శలాక రఘునాథశర్మగారు ఈ క్రింది విధంగా తాత్పర్యం చెప్పారు:-

"అన్ని కళల కాంతులతో రమ్యమైనవాడా! "నరసింహ" అనే పేరుగల వాడా! నీ భాగ్యము అత్యధిక మగునట్లుగా సంతోషప్రదమయిన ఈ పున్నమరేయిని ప్రకాశింపజేస్తున్నారు సూర్యచంద్రులు. అయితే రాత్రి సూర్యుడు ఉండడుకదా అనే శంకకు సమాధానంగా, చంద్రుడు "నిరంతరమూ ఆత్మలో పవిత్రమైన భావనలు విహరిస్తూ ఉండే గృహమయిన నరసింహులుగారిని మనమిద్దరమూ చూడవద్దా!" అని పిలిస్తే, సూర్యుడు కూడా ఆ రాత్రి వచ్చాడు. ఆ వెలుగుల దొరలిద్దరూ కృపతో ఈ మహానుభావుని చూస్తున్నారు. ఎంతభాగ్యం!"

**కఠినపదాలకు అర్థాలు:**

1. ధామనిధి = సూర్యుడు; 2. తిథిప్రణి = చంద్రుడు;
3. క్షణద = సంతోషప్రదమైన రేయి–పున్నమ; 4. ధిష్ణ్యము = గృహము, స్థానము;
5. సకల రుక్ = (1) 'సకలా' వంశములో కీర్తికెక్కినవాడా!
(2) స+కల రుక్=అన్ని కళలకాంతులతో రమ్యమైన వాడా!

* * *

# 4. శ్రీ తంగిరాల భాస్కరరావుగారు

"అవధానిశేఖర" – "ఆశుకవి చక్రవర్తి" కీ.శే. బులుసు వేంకటరామమూర్తిగారు 2003లో శ్రీ తంగిరాల భాస్కరరావుగారిని దర్శించి ఈ క్రింది విధంగా ఆశీర్వదించారు:-

చ. తిరుపతి వేంకటేశ్వరుడు తేజము, సౌఖ్యము, సర్వసంపదల్
నిరుపమ లీలనిచ్చి, గణనీయ చిరాయు రనామయంబులన్

చిరుతర లీల గూర్చి, కడు తృప్తిగ నేలుత సర్వకాలమున్
వరల శకుంతలా సహిత భాస్కరరాయుని ప్రేమతోడుతన్ 1

తే. ఆయురారోగ్య భోగభాగ్యాలతోడ
పుత్ర పౌత్రాభివృద్ధితో పొలుపుమీర
రహి శకుంతల భాస్కరరాయ వర్య
పుణ్యదంపతులను హరి(బ్రోచుగాత! 2

– కీ.శే. బులుసు వేంకటరామమూర్తి

* * *

## 5. శ్రీ దుగ్గిరాల రామారావుగారు

శ్రీ దుగ్గిరాల రామారావుగారి "ప్రసంగాలు-పీఠికలు" అనే గ్రంథాన్ని చదివి ఆచార్య వి. రామచంద్రచౌదరిగారు చెప్పిన పద్యం:

ఆ. పలుకులందు కవన భంగిమల్ నర్తింప
వచనమేమి? కవుల పద్యమేమి?
వచన ఝరము సాగి పద్యసరస్సాయె
కమలమగుచు నేడు కావ్యములరె!

– ఆచార్య వి. రామచంద్రచౌదరి

* * *

## 6. ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు

29-2-2008నాడు పశ్చిమ గోదావరిజిల్లా పాలకొల్లులోని "రసధుని" సంస్థవారు తంగిరాల వారిని "పెద్దిభొట్ల బ్రహ్మయ్యస్మారక పురస్కారం"తో సత్కరించారు. ఆ సందర్భంగా తణుకు నన్నయభట్టారక పీఠం కార్యదర్శి అయిన శ్రీ సుశర్మగారు చెప్పిన పద్యం:

చ. స్థిరచిత్తుండును, జ్ఞానశీలి - ఘన సౌశీల్య స్వభావుండు - సా
దర హాసద్యుతి మంతుడున్ - సకల విద్యాసార చిద్రూపుడున్

పరరాష్ట్రంబున తెల్గు తేజమునకున్ ప్రాణంబు - చైతన్య ధీ
వరుడున్ శ్రీగురు తంగిరాలకుల సుబ్బారావుకున్ మా నతుల్!

- శ్రీ సుశర్మ

* * *

## 7. డా॥ రాచకొండ నరసింహశర్మగారు

*డా. రాచకొండ నరసింహ శర్మగారు రచించిన "అనురాగాలు - ఆత్మీయతలు" కావ్యావిష్కార సభలో (6-12-2006) వారి కవితా వైశిష్ట్యమును గూర్చి చెప్పిన పద్యము:*

మ. నును జిల్గుం దొలిప్రొద్దు మంచు జడి చిందుల్ వోవు క్రొంబూవులున్,
చనవుల్ మీటిన లోఁదలంపుఁ జలువన్, సాహిత్య సౌహిత్యముల్,
గొనబుల్ నిండిన రాచకొండ కవితాంకూర ప్రమోదమ్ము, లీ
యనురాగస్ఫురదిందు శారదిక రేఖార్ద్రమ్ము లాత్మీయతల్.

- కొండేపూడి సుబ్బారావు



తమిళపులుల విప్లవగీతాలు:

## శ్రీలంక తమిళ కవితలు

*("శ్రీలంకాద తమిళు కవనగళు" అనే కవితా సంకలనం ప్రొ॥ ఎస్. కార్లోస్‌గారి సంపాదకత్వంలో కన్నడంలో వెలువడింది. మూలంలోని తమిళ కవితలను శ్రీమతి తమిళ్ సెల్వి, శ్రీ నెల్లికుంట వెంకటేశ్, శ్రీ కె. నరసింహమూర్తి కన్నడంలోకి అనువదించారు. ఈ కన్నడ అనువాదక కవితలను శ్రీ గుత్తి జోళదరాశి చంద్రశేఖర రెడ్డిగారు తెలుగులో పెట్టారు. వీరందరికీ కృతజ్ఞులం - సంపాదకుడు).*

*(గత సంచిక తరువాయి)*

### 6. మే '86 - అమ్మకు

- న. సబేశన్

అమ్మా!
ఇంకా ఎదురుచూస్తూ వుండు

కళ్ళల్లోంచి జాలువారుతున్న
రెండు చుక్కల కన్నీటిని
తుడుచుకొంటూ ఎదురుచూస్తూ వుండు

నేను మరలి వస్తానని

నీ ముద్దుల కొడుకు
తన యువమిత్రులతో
చేతులతో పెనవేసుకొని మరలి వస్తాడని
ఆకాశాన్నే దిట్టించి చూస్తున్న కన్నుల్లో
నమ్మకాన్ని పొదిగి
ఎదురుచూస్తూ వుండు ...
అమ్మా! ఎదురుచూస్తూనే వుండు ...

ఇంకా కన్యలుగానే మిగిలిపోయిన
ఇద్దరు అక్కయ్యలను తలచుకొని
మనస్సు చితికిపోయిన
నిన్ను
నా చావువార్తతో
గాయపరచేందుకు ఇష్టపడను.

అమ్మా!
నేను గాయపరచేందుకు ఇష్టపడను.

నీ గారాబానికీ
కౌగిలికీ
కలలకూ కారణమైన కొడుకు
ఒక శత్రువు లాగ
వీథిలో నుండి మసైపోయాడు –
అనే సత్యాన్ని
నీవు నమ్మలేవు.

అయినా అమ్మా!
శత్రువులతో పోరాడను వెళ్ళిన

ధైర్యశాలియైన నీ కొడుకు
గాలి వీచే వీథుల్లో
బొమికలూ మిగలకుండా బూడిదైపోయాడు -
అనే వార్తనూ;
సందులో ఓ మూలదాగి
కాలుతున్నప్పుడు చూచిన ఇద్దరు బాలికలు
తెలివి తప్పి పడిపోయారు -
అనే వార్తనూ;
నీకు తెలుపమని
నేను గాలిని అభ్యర్థిస్తున్నాను.

ఎందుకంటే ... అమ్మా!
ఇక రాబోయే వారితో చెప్పు
నీ కొడుకు వీపు వెనుకా
తుపాకులుండినవని!

*(ఇప్పుడు లండన్‌లో వుంటున్న "సబేశన్" విద్యార్థి దశనుండే తమిళ సాహిత్యంలో, రాజకీయాల్లో బాగా పేరుమోశాడు. "ఇని వరుం కాలం" (ఇక వస్తుంది కాలం) అన్నది మొదటి కవితా సంకలనం. 1980లో ప్రకటితమైన "పుదుసు" (=క్రొత్తది) కృతి సంపాదకులలో ఈయన ఒకరు. కవి చేరన్‌గారి "ఇరండావదు సూర్యోదయం" కృతికి ముద్రాపకులు కూడ).*

* * *

## 7. మరోమారు

- నాగలింగ సబేశన్

మరోమారు
వెలుగు ప్రసరిస్తుండగా మెలకువ.

తుపాకులు చాపినందువల్ల
రక్తం చింది
రాలినవి కొన్ని పూలు.

నల్లని గగనం
తెలుపెక్కింది.
రాలిన పూలు
కనిపించాయి.

వెలుగు ప్రసరిస్తున్నవేళ
ఏ గువ్వా
సవ్వడి చేయలేదు.

గుండు శబ్దానికి
క్రొత్తగా కొన్ని
పూలు వికసించాయి.

అప్పుడే
ఆకాశంలోనూ
అగ్ని వ్యాపించింది.

ఈ మారు కూడా
మాలో కొందరు
నవ్వుతున్నట్లుగానే ....

* * *

## 8. కుక్క నాకిన వీధి

– చోలైక్కిళి (ఆతీకన్)

ఇది కుక్క నాకిన వీధి
ముందుకు సాగు
ఇంకా శవాల వాసన వేస్తూనే వుంది.

ముక్కు మూసుకొని మూసుకొని
తుది లావెక్కింది.
కాళ్ళ ముక్క, పక్కటెముక
వెన్నెముక .... అన్నీ

కనిపిస్తాయి, ఇంకా
దూరంగా సాగు.

దాపుగాలు వేయి
వీథిలో సీతాకోకచిలుకలూ, గువ్వలూ లేవు
యుద్ధపు రోజుల్లో
మంచిది కాదు ప్రయాణం
అయినా
బయటకొచ్చాం, అవసరం కలిగి
పరుగులెత్తు వేగంగా.

తెలియదు. వాడు తప్పించుకొనీ వుండవచ్చు
మాకు పరిచయం లేని ఆ ఆడుది మాత్రం
చచ్చిపోయింది.
నీ చెలి ఏమైనది?
నాకూ తెలియలేదు
బొటనవ్రేలు విరిగి
కుంటుకొంటూ వీస్తోంది గాలి
రాయబారం మోయను దానికీ సాధ్యం కాదు.
ఇది మనుషుల్లేని లోకం
చూడు
యుద్ధకాలపు సంధ్యాకాశాన్ని.

ఒకే ఒక్క పూవూ వికసించలేదు
వ్రాసి తుడిచి, వ్రాసి తుడిచి
నా ప్రియురాలి పేరును
చూపుతోంది ఆకాశం.
పెళ్ళాం చచ్చిన దుఃఖంతో
ఏడుస్తున్నవి పక్షులూ ...
చంద్రుని పైకి
ఎక్కి నుంచున్నది దిక్కు.

అరె! నువ్వు
శవాన్ని ఎడవుకొని పడబోకు
సాగిపో!

*[“చోలైక్కిళి”గారి అసలు పేరు “ఆతిక్”. తూర్పు శ్రీలంకాలోని “కల్మినై” వీరి జన్మస్థలం. “నానుం ఒరు పూనై” (= నేను ఒక పిల్లిని), “ఎట్టావదు నరకం” (= ఎనిమిదో నరకం) – మొదలైనవి వీరి కృతులు. శ్రీలంకా తమిళుల యుద్ధంపై అక్కడి ముస్లిముల ప్రతిక్రియలేమి వీరి కవితలు తెలియజేస్తాయి. “పనియల్ మోళి ఎళుదు” (= తల్లివేరు తెగిన నేను) లోంచి తీసికొన్నదీ కవిత).]*

* * *

# 9. 21మే 1986

– చేరన్

అర్ధరాత్రి
ఇల్లు కాలుతోంది.

నీ కళ్లముందే
నీ పెళ్ళాన్ని
బాకుతో పొడిచారు.

బాంబుల వానలు కురిపించే విమానాలు
దిగి, పైకెక్కేటప్పుడు
సూర్యకిరణాలు విరిగి అల్లాడుతాయి.
అన్ని దిక్కుల్లోనూ
పసిపిల్లల ఆక్రందన.

సందుగ పెట్టెలో దాక్కొనే అవసరంలో
పడి పగిలిన కళ్లద్దాలను
అవ్వ ఇప్పటికీ తడుముకుంటూనే వుంది.

నావద్ద నుండి రక్తం
స్వీకరించబోమని

విధేయంగా చెబుతారు
బ్లడ్‌బ్యాంకు వాళ్ళు
తుపాకుల సంఘర్షణలో
పోగొట్టుకొన్నదాన్ని వెదకబోయిన
మిత్రుడికోసం నేను వెదుక్కొంటున్నాను.
డెమోక్రాటిక్ విప్లవమా?
సోషలిస్ట్ విప్లవమా?
అని చర్చించుకొంటున్న వారిలో అనేకులు
తుపాకి గుళ్ళకు చిక్కి చచ్చిపోయారు.
రెండు విమానాల నుండి
ఇరవైయేడు హెలికాప్టర్ల ఆక్రమణ నుండి
తప్పించుకొని
కుక్కపిల్లను తొక్కి
లేతకాలు విరిచి
పరుపుమీద పడ్డప్పుడు
జెన్ బౌద్ధవాదం
మరియు మోటార్ సైకిల్ నడిపే కళ
అనే పుస్తకం
తెచ్చిచ్చాడు
మేధావి మిత్రుడు.

ఆస్పత్రి పై మిద్దె మీదనున్నవాళ్ళు
ఎఱ్ఱశిలువ ధరించినవాళ్ళు
హెలికాప్టర్ గుండు తాకి పడిపోతారు.

అయినా
కాకీ వుంది కాగితమూ వుంది
జతగా
మెషిన్‌గన్ ఆర్భాటం
ఇప్పుడూ మునుపటి లాగే
గాలిలో వినిపిస్తూనే వుంది.

*[జాఫ్నాలోని "అళవట్టు"లో 1960లో జన్మించిన ఈ కవి పూర్తిపేరు "రుద్రమూర్తి చేరన్". ఈయన తండ్రి "రుద్రమూర్తి" వెనుకటి రోజుల్లో మహాకవిగా ప్రసిద్ధి చెందినవాడు. కవి చేరన్ తొలి సంకలనం "ఇరండావదు సూర్యోదయం" (= రెండవ సూర్యోదయం). 1983లో వెలువడ్డ ఈ ప్రతి వర్గకలహాన్నీ, దాని సమస్యలనూ సమర్థంగా ప్రతిబింబిస్తుంది. విజ్ఞాన శాస్త్రంలో పట్టభద్రుడైన ఈయన ఇప్పుడు కెనడాలో సమాజ విజ్ఞానం బోధించే ప్రాధ్యాపకులుగా ఉన్నారు. "తమిళ ఈలం" పోరాటాన్ని సమర్థించే ఈయన ఇటీవల "వంద కవితలు" సంకలనాన్ని ప్రకటించారు.]*

* * *

# 10. నేడు కాకున్నా రేపైనా ...

– షణ్ముగ శివలింగం

మా కనుబొమలు వాలి వున్నాయి
మా కనురెప్పలు మూసివున్నాయి
మా పెదవులు బిగించి వున్నవి
మా పళ్ళు బిరుసెక్కాయి
మేము వంగి వంగి నడుస్తున్నాము.

మమ్మల్ని మీరు జులుం చెలాయించి
మమ్మల్ని మీరు బళ్ళకు కట్టి
మమ్మల్ని కొరడాతో కొట్టండి
మా వీపుపై చర్మం అలానే వూడి రానీయండి.

వాలివున్న కనుబొమలు ఒకనాడు పైకి లేస్తాయి
మూసివున్న కనురెప్పలు తెరచుకొంటాయి
బిగుసుకున్న పెదవులు విచ్చుకొంటాయి
బిరుసెక్కిన పళ్ళు పటపటమంటాయి.

అంతవరకూ మీరు మాపై అధికారం చలాయిస్తారు
అంతవరకే మీ జులుం సాగనీయండి!

*(షణ్ముగ శివలింగం 1940లో జన్మించారు. తూర్పు శ్రీలంకకు చెందిన "పాండిరిపు"లో విజ్ఞాన శాస్త్రంలో పట్టభద్రులయ్యారు. ఉపాధ్యాయులుగా పనిచేస్తున్నారు. వీరి "మరణత్తుల్ వాళ్వోం" అనే కవితా సంకలనం నుండి ఈ కవిత స్వీకరింపబడింది.)* *(సశేషం)*

ఆధ్యాత్మిక ఆంగ్ల మహాకావ్యం:

# సావిత్రి

- మూలం: మహర్షి అరవిందయోగి

- అనుసృజన: ఆచార్య తంబిశెట్టి రామకృష్ణ

మొదటిభాగం: మొదటిపుస్తకం: ఆరంభగ్రంథం: ప్రథమాశ్వాసం:

## ఉదయం పుట్టుక

*(గత సంచిక తరువాయి)*

పరుగెందుకో తెలియని వేగం.
నరులు, తరులు దైనందిన వలయంలో చిక్కుకున్న వైనం.
నిమేషులను ప్రలోభ పెడుతున్న కాలం -
తొలగని ముసుగులో మొహం చాటేసిన భవిష్యత్తు -
ఐనా, అందరికీ అధినాయకుడైన నరుడు,
ఇంకా ప్రతిష్ఠించబడని బుద్ధిబలంతో -
విధి నిర్దేశిత బరువుల్ని, తలకెత్తుకుంటున్న వైచిత్రి.

క్షణ భంగుర సౌఖ్యాల కోసం అశ్రులు చాస్తూ,
అస్థిర సౌందర్యాల ముందు దాసోహమంటున్న -
సామాన్య జనజీవనం మధ్య,
నిదుర లేచిన సావిత్రి,
నరుల మధ్య అసామాన్యంగా కనిపించింది.
అమరత్వాన్ని నిర్జించిన మృత్యువు - తిష్ఠవేసిన -
నరుడి దుస్థితి, ఆమెకు హృదయాఘాతం.
ఐనా, ఆనందం ఆమె సహజస్థితి.
అనశ్వరం కాని భూ భౌతికంలో -
ఆనందపు పసిడి ఛాయల వన్నె తగ్గినవి.
మనుజ జన్మకు ఉపహారంగా,
ఆమె తెచ్చిన నిశ్చలానందం -
భౌతిక, అధిభౌతికాల సందిగ్ధంలో ఊగిసలాడింది.

సుఖ దుఃఖాల సమతుల్యాల సారంలో కాని,
ఎదగని పాంచ భౌతిక శరీరం,
పారమార్థిక శాశ్వత సౌఖ్యాల్ని – త్రోసి రాజన్నది.
ఆమె, దివినుండి భువికి దిగివచ్చిన దేవత –
నరుడి అమరత్వ సిద్ధికి తన దివ్యశక్తుల్ని
ధారపోస్తున్న మహిమాన్విత.
మానవత్వపు మట్టిలోంచి దైవత్వపు మాణిక్యం –
వెలుగు చూస్తుందన్న –
ఆమె ఆశ, అడియాస కాదు గదా?
పరిమితులకు బద్ధమైన ప్రకృతి,
పరిణామం చెంది,
తన సహజ శృంఖలాలను ఛేదించుకోవటం,
దుర్లభమనిపించింది.
శోకానికి అతీతంగా ఉన్న –
దివ్య లోకాల్నించి వస్తున్న వెలుగుల్ని
దుఖభాజనమైన భూలోకం
భరించలేకపోయింది.
సత్యలోకాల్నించి వస్తున్న
దివ్యశక్తులు తాకగానే, భూలోకం వణికి పోయింది.
లోతులు ముట్టిన అరాచకత్వం
ఎత్తుల్ని పడగొట్టింది.
వైకుంఠపు వైతాళికులకు, భూలోకపు మసి అంటుకున్నది.
పావనమగు అభయహస్తాలకు,
పతిత హృదయ కంటకాలు, అడ్డుగా నిలిచినవి.
అమర సందేశం తెచ్చిన, దేవతా సుతులకు,
జరామరణ శోకార్తి, స్వాగత గీతి పలికింది.
ప్రకృతి సహజమగు సరిహద్దుల్ని అధిగమించి,
భుక్తికి పరిమితమైన నరుడి ముక్తి, ధ్యేయంగా –
ఆమె అవతరించింది.
నిమేషుల భారం, అనిమేషులు పంచుకున్నట్టయ్యింది.
ఆమె ఆంతర్యపు భారం తగిలి,

లోకాల శోకాల కొండచరియలు విరిగిపడ్డాయి.
దుఃఖం పక్కన నిలబడి,
మరణంతో యుద్ధానికి ఆమె సిద్ధమయ్యింది.

దివ్య చీనాంబరాలు త్యజించి,
అతి సామాన్యపు వలువల ధరించి, విధి శాసితయ్యై,
ఆమె వసుధపై నడయాడినది.
రానున్న, విధి వైపరీత్యపు విషాదచ్ఛాయలు
అలముకున్న విషణ్ణ వదనంతో,
బరువెక్కిన గుండెలతో,
అనురాగం పంచుకున్న వారికి సైతం దూరంగా నిలబడింది.
అజ్ఞాతంగా, అసహాయంగా, రానున్న విపత్తును
ఏకాకిగా, ఎదుర్కోవటానికి నడుం కట్టింది.
ఎప్పటిలాగా - అది ఒక సూర్యోదయం.
ఆ తరువాత ఒక అపరాహ్ణ వేళ -
పూర్వ లిఖిత మరణ శాసనాన్ని వెంటబెట్టుకుని వచ్చిన వేళ.
కాలసర్ప దష్టుల్నీ, భవరోగగ్రస్తుల్నీ,
వెనుతిరిగి చూడదు - కాలం.
కారణం - తన మార్గం ఎప్పుడూ సుగమం.
గాయాల్ని దాచుకున్న మది,
మూగవోయిన మనసు,
సాయం కోరని స్థైర్యం,
మరొకరితో పంచుకోనని విషాదం
బాహ్యపు గాయాలకు చెక్కుచెదరని ఆత్మశక్తి,
ఆమెది - దైవత్వం పుణికి పుచ్చుకున్న మనుజత్వం.
ఆమె సర్వజ్ఞ, స్థితప్రజ్ఞ, సమధీర
ఆమె ఆత్మచైతన్యం సర్వవ్యాపి -
తన చైతన్యంతో, ఆమె జగత్తును నింపగలదు -
చతుర్దశ భువనాలను, తనలో ఇముడ్చుకోగలదు.
ఆమె ప్రేమస్వరూపిణి, సమస్త భవరోగ సంజీవని.
ఆమె ఆర్ద్రత, నిమేషుల ఎడ - అనిమేషుల ఆర్ద్రత.

ఆమె శక్తులు, అనిమేషుల అసామాన్య అంతశ్శక్తులు.
బాధాతప్త హృదయంలోంచి కఠోర తపస్సు.
దివ్యకరవాలంగా మారిన తపశ్శక్తి,
రానున్న పోరాటానికి ఆమెను సిద్ధం చేశాయి.
భూతలాన్ని, ఇంకా వీడని మత్తు నిద్ర,
స్థాణువులా పడివున్న జగతి సహజస్థితి,
ప్రజ్ఞా పాటవాలు లోపించిన పృథ్వి -
విషాదాన్ని స్మృతుల పొరల్లో దాచివుంచింది.
ఇంతలో, బరువైన జ్ఞాపకాల నీడ,
లీలగా కదలిన జాడ -
గుండెను తాకిన చేయికి తగిలిన ఆవేదన.
కార్య కారణాలు బోధపడని వ్యథ
ఇంద్రియ సాయం ఇంకా అందని ప్రాణం
ఇంకా మేలుకొనని మేధ
గతాన్ని అందుకోలేని అశక్తత -
ఇంతలో, ఆమె కదలింది. వినబడని గొంతుక లేవో
ఆమెను పిలుస్తున్నాయి.
స్వాప్నిక జగత్తులోకి నడిపిస్తున్నాయి.
మర్త్యలోకపు మాయల్ని, కాయకష్టాల్ని -
ఆమె గుర్తుకు తెచ్చుకుంటోంది.
సృష్టి స్థితి లయల వలయం ఆమె కళ్ళకు కట్టింది.
గతం నిర్దేశించిన చట్రంలో
ఆమె చిక్కుకున్నట్టనిపించింది.

నిశీథంలో మల్లయుద్ధం చేస్తున్న యోధుల్లా
ప్రజ్ఞాలబ్ధికోసం పాటుపడుతున్న మర్త్యులు,
మర్త్యలోకాల విషాదాన్ని వారసత్వంగా మూటగట్టుకుని
ముక్తి కోసం ఊర్ధ్వలోకాల వైపు
దృష్టి సారించిన ఆమెకు
అసలు గమ్యం ఆవలి తీరం కనిపించలేదు.
కనిపించినదంతా విషాదపు అగాధాలు,
సింహాసనం దిగిరాని సృష్టికర్త,

అశ్రుధారల అభిషేకం సైతం కరిగించని కాఠిన్యం,
కోర్కెలు తెచ్చిన బాధలు సమిధలుగా,
మళ్ళీ మొదలైన భూతల వాసుల యాగం -
యాగాన్ని నడిపిస్తున్న ఆమె యోగం -
అన్నింటి మధ్య సమయం రాసిన శాసనాన్ని
ధిక్కరించడానికి సర్వసన్నద్ధమైన సాధ్వి సావిత్రి.
ఆ దినం సత్యవంతుడు మరణించవలసిన దినం!

*(ప్రథమగ్రంథంలో ప్రథమాశ్వాసం సంపూర్ణం)*

'జన్మాంతర వైరమ్'-ఒక చిన్న వ్యాఖ్య:- ఈ సంచికలో డా॥ బోయి భీమన్నగారి "జన్మాంతర వైరమ్" కావ్యాన్ని గురించి డా॥ కె. సంజీవరావు ('శిఖామణి')గారు వ్రాసిన వ్యాసంలో ఒక చోట "దళితులు ఉత్పత్తి కులాలు; బ్రాహ్మణులు పరాన్నజీవులు" - అని అన్నారు. ఈ అభిప్రాయం సరికాదు. హిందూ సమాజంలో ప్రతికులానికీ ఒక వృత్తి నిర్దేశించబడి ఉంది. వృత్తిలేని కులం అంటూ ఏదీ ఉండదు. వేదాల అధ్యయనం (చదవడం), అధ్యాపనం (చదివించడం), పౌరోహిత్యం (పుట్టుకనుండి చనిపోయేవరకు వివిధ సందర్భాలలో కర్మకాండలు జరిపించడం) బ్రాహణ కులానికి విధింపబడిన వృత్తి. అలిఖితములైన వేదాలు నాలుగింటినీ, కొన్ని వేల సంవత్సరాలుగా, స్వరసహితంగా, మౌఖిక సంప్రదాయంలో కాపాడుకుంటూ వచ్చినవారు బ్రాహ్మణులు. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు - ఒకటేమిటి? సమస్త భారతీయ సంస్కృతినీ భద్రపరచినవారు బ్రాహ్మణులు. పూర్వం రాజులు, చక్రవర్తులు, తరువాతి కాలంలో జమిందారులు, బ్రాహ్మణులకు అగ్రహారాలు దానం చేసింది "పరాన్న జీవులు"గా పడి తినడం కోసం కాదు. మన సంస్కృతికి మూలమైన వేదాలను రక్షించడం కోసం; మన సంస్కృతిని సజీవంగా ఉంచడం కోసం - వారు బ్రాహ్మణులను పోషించారు. పూర్వం బ్రాహ్మణులు పరాన్నజీవులైతే, ఈనాడు పాఠశాలల్లోను, విద్యాలయాల్లోను పనిచేస్తున్న అన్ని కులాలవారూ ('శిఖామణి'గారితో సహా) పరాన్నజీవులే అవుతారు. వీరు చెమటోడ్చి పొలాలు దున్ని పంటలు పండించటం లేదు కదా! పైగా బ్రాహ్మణులందరూ ఖచ్చితంగా అస్పృశ్యతను పాటించి ఉంటే, ఈనాడు విద్యావంతులైన దళితులందరూ ఎవరి దగ్గర చదువుకొని అభివృద్ధిలోకి రాగలిగారు? బ్రాహ్మణుల దగ్గర చదువుకొని, తిరిగి వారినే పనికట్టుకొని తిట్టడం సమంజసం కాదు. "డా ॥ బోయి భీమన్నగారు, ఆయన ఆరాధ్యదైవమైన డా॥ బి.ఆర్. అంబేద్కర్‌గారు, బ్రాహ్మణ స్త్రీలను ప్రేమించి పెండ్లి చేసుకున్న సంగతి కూడా, బ్రాహ్మణులను దూషించే దళితులు మరచిపోకూడదు!

- సంపాదకుడు

# మూడు ఫ్రెంచి కవితలు

అనువాదం: -డా॥ వారణాసి రామబ్రహ్మం

## 1.

ప్రేమ ఆటపాటలు పుస్తకాలు
సంగీతం పట్టణం పల్లె
అన్నిటినీ అభిమానిస్తాను నేను

నన్ను సార్వభౌమునిగా చేయలేని
ఇవి నాకేమీ కావు

విచారగ్రస్తమైన హృదయం యొక్క
గాఢానుభవాన్ని నేను అభిమానించ గలిగేవరకు

*మూలం: లా ఫాంటెయిన్ (1621-1695)*

* * *

## 2. ప్రణయిని నిండిన చూపు

ఎదురుగా చూశాను
జనం మధ్యలో నిన్ను చూశాను
గోధుమ కంకులలో చూశాను
ఆ చెట్టు కింద నిన్ను చూశాను 1

పడవపై నా ప్రయాణాలలో నిన్ను చూశాను
నా సలుపుల అడుగున నిన్ను చూశాను
నవ్వుల ఒంపులలో నిన్ను చూశాను
నీటి పరుగులలో ఎగసే మంటలలో నిన్ను చూశాను. 2

వేసవిలో చలికాలంలో నిన్ను చూశాను
నా ఇంటిలో నిన్ను చూశాను

నా బాహువుల మధ్య నిన్ను చూశాను
నా కలలలో నిన్ను చూశాను 3

ఎన్నటికీ నిన్ను నేను విడిచిపోను 4

*మూలం: పాల్ ఎల్యార్డ్*

* * *

## 3. ప్రేమానందం

ప్రేమను పొందిన ఆనందం నిలువదు క్షణమైనా
ప్రేమ తిరస్కరింపబడిన వ్యథ పోదు జీవితమే ముగిసినా

నేను సర్వస్వం వదిలేసుకున్నాను
కృతఘ్నురాలైన సెల్వీ కోసం
ఆమె నన్ను విడిచి పెట్టి
జత కలిపింది మరొకనితో

ఈ సన్నటి నీటిజాలు
పచ్చికబయళ్ళ నానుకొని ఉన్న
నదివైపు ప్రవహిస్తున్నంత వరకు
నేను నిన్ను ప్రేమిస్తూనే ఉంటాను
అని పదేపదే సెల్వీ నాతో అంది.

ఆ సన్నిటి నీటిజాలు ప్రవహిస్తూనే ఉంది
ఆమె మనసు మాత్రం మారిపోయింది

ప్రేమను పొందిన ఆనందం నిలువదు క్షణమైనా
ప్రేమ తిరస్కరింపబడిన వ్యథపోదు జీవితమే ముగిసినా

*మూలం: "ఫ్లోరియన్" రచించిన "ప్రయిసిర్ డిమోర్" అనే కవిత*



# AFRICAN POETRY

## 1. Your Pain

**- Armando Guebuza**

Your pain
yet more my pain
shall suffocate oppression

Your eyes
yet more my eyes
shall be speaking of revolt

Your scars
yet more my scars
will be remembering the whip

My hands
yet more your hands
will be lifted fully armed

My strength
yet more your strength
shall overcome imperialism

My blood
yet more your blood
shall irrigate our victory

* * *

## 2. Manifesto

**- Jose 'Craveirinha**

Oh!
My short and beautiful crisp hair
my balck eyes

wide moons of amazement in the most beautiful
of the most beautiful and irresistable Zambezi nights

Like timid birds
soaring uncorrupted on star-encrusted wings
my eyes are wide with nightmares and strange
industrialised dreams
and my hands are dark as the roots of the cosmos,

nostalgic for initiation rites
hard from the well worn route of the tibe's canoes
and beautiful like coals of mica in the quizumba nights.

any my mouth with broad lips
full of the black man's superb and impious virility
biting the brazen nudity of a loaf
to the sounds of the city insects' revels
rotting the new morning
with the futile creek-croak of the fat cicadas.

Oh, my white teeth of ivory
gleaming pure in the reincarnation of my proud black head.
And, in the maternal stomach of the fields of our meagre
maize crop
-the hot, savage incantation of my tropical skin.

Ah
My body flexible as the fatal lightning of the hunting arrow
and my smooth shoulders of the black Guinean
and my tense muscles burnished in the hot sun of harvest
and hard labour
in the astral capulana* of an intangible sky
while sea shells trumpet the old cabalistic sounds of Africa.

Ah,
the fire, the moon, the sweat ripening the maize
the river's welcome water
and the purple dawn on the blue edge of the mountains'
breast.

Oh, Mother Africa in my dark face of diamond
with the beautiful and wide masculine nostrils
quivering as they drink in the forest smells
and the tattooed makonde dancers
naked
and the wild rhythmic wonder of black and sensual hips
and the pounding of bare feet in unison.

Oh, and my chest, a richer colour than the black of pitch
and in the baobab tree of my unheard hopes, graven on the
totem of the world,
in my stentorian voice of the man from Tanganyika,
from the Congo, Angola, Mozambique and Senegal.
Ah - I, once a zulu chief
a bantu spearman
a caster of maledictions on the voracious locusts' plagues
I, a drum, I, blood, I, a black swahili
I, Chaka
I, Mahuzal and Dingana
I, Zichacha with the secret of Tinlholo's magic bones
I, the tree of Munhuana
I, player of presages on the keys of Chope timbillas
I, hunter of leopards
I, batuque
and on the watery frontiers from the Rovuma to the
Incomati
I am citizen among the spirits of old moons
laden with the anathemas of Mozambique.

**Capulana, a cloth worn by women in Mozambique, similar to a kanga.*

(Selected from the book "When bullets begin to flower",
Edited by Margaret Dickinson and
Published by East African Publishing House.)

*(Courtesy: Sri Chitiprolu Subba Rao)*



గీటురాయి-1:

# పురుషోత్తముడు

- డా॥ మల్లెల గురవయ్య

*(గత సంచిక తరువాయి)*

'పురుషోత్తముడు' కావ్యములో తృతీయ చతుర్థ ఖండములు నాయక మణుల వంటివి. ఇందు చిటిప్రోలు కృష్ణమూర్తిగారి కవిత్వము, అట్లే కావ్యనాయకుడైన పురుషోత్తముని వ్యక్తిత్వము మహోదాత్తములై కావ్యకళా ప్రౌఢిమను, తద్ధ్యేయమును తురీయస్థితికి గొనిపోయినవి. తృతీయ ఖండములో తన అన్న అంభిని, జన్మభూమియైన తక్షశిలను వీడి భారతదేశ హితమునే పరమార్థముగా భావించిన ప్రార్థనాకుమారి పాంచాలపురమును చేరినది. కాని అంభి భారత కీర్తి వైభవములకు భంగము కలిగించు అహితబుద్ధితో గ్రీకురాజును చేరినాడు. ఇచట కవి ఆ యిరువురి మనస్తత్త్వములను, వారు చేరిన ఆయాపురాధీశ్వరుల లక్ష్య లక్షణములను సూత్రప్రాయముగా వ్యంజింపజేసిన విధానము అనుపమానము. ఏ అనుభవములేని అబల మలినమంటని వెలుగుబాటలలో పయనింపగా, అన్ని అనుభవములున్న అన్న అంభి గాఢాంధకారమునే వెలుగులని భ్రమించినట్లు కవి తెల్పిన పోలిక ఉభయపాత్రల అంతరాంతరములను చక్కగా ఆవిష్కరింప జేసినది. ఇరువురొక్క గర్భమున పుట్టినను వారి దారులే వేరైనవి. యవనవిభు నెప్పుడు చూతునాయన్న తమకములో వాయువేగ మనోవేగములవలె హయవేగమును పెంచినాడు. దివాంధమువంటి తక్షశిలరాజు యవనవిభుని చేరి స్వాగతములు పలికి, అటుపై తాను వివరింపదలచినవి వరుసగా పురుషోత్తముని గూర్చి యిట్లు నివేదించినాడు. పురుషోత్తముని నిందతోనే ప్రారంభించుచు ఎవడో మూర్ఖుడు కారణజన్ములైన మిమ్ము నిరోధింప తలపెట్టినాడు. మీ విస్తార చమూసమూహమును చూచినవారి కన్నులు ధన్యములు. మీ జగజ్జయవిశేషములు చిరస్థిరములు. మీ శౌర్యానలజ్వాలాలీలలు అద్భుతములు. ఇవిగో ఏ కొఱతలు లేక మీకు వలయు సర్వద్రవ్యసంచయముల సంచులు కాన్కలుగా మీ పదములకడ నుంతునని మిఱుమిట్లు గొలుపు మణులు ఆతని ముందు క్రుమ్మరించినాడు. తనకుతానుగా వలచి భరతభాగ్యలక్ష్మి పాదములకడ చేరినదని తలచి గ్రీకుఱేడు పొంగిపోయినాడు. అంత ఎంతో అడకువతో తన యెదుట చేతులు కట్టుకొని నిలిచిన అంభి వాలకమునకు యవనవిభుడు తనలోతాను నవ్వుకొనినాడు. వెంటనే దగ్గఱకు వచ్చి భుజముపై

చేయివేసి, మేము వచ్చుచున్నామని విని, దూరము నుండియే స్వాగతములు తెలుపు నీ సౌహిత్యము మరువరానిది. భేరీభాంకారములతో కర్ణభేరులు పగులునట్లు భారతమును భయంకరముగా భావించితిని. కాని ఇంతగా స్వాగతాలాప హృద్యవాద్య స్వరములలో అమృతములు చిలుకునని నేనెంచనైతిని. పిడికిలి బిగించి కడు బెడిదముగా ఎదురు పడునని యూహించితిని గాని ఇంత స్నేహపూర్వక మధురహస్తసంస్పర్శతో కరసంచాలన మొనరించునని కలనైన తలపలేదు. పీనుగుల కుప్పల బాటలలో పదములు పెట్టవలెనేమో అనుకొంటిని గాని ఇట్లు పూగుత్తులు పరచిన మెత్తని దారులలో నడతునని తలపనైతిని. భారత ముఖ ద్వారబంధములో పచ్చి నెత్తుటి మరకల భీకర కార్యమునకు పూనుకొనకుండ ఇట్టి శుభయోగమున కానుకూల్యము కలిగించు నీ మెలకువ నిజముగా సంభావనీయము. ఈర్ష్యలకు తావీయక, మంచిచెడ్డలరసి రాజులందఱు నీవలె సమయానుకూల సౌజన్యమును పాటించినచో వృథావ్యథా కారకములైన యుద్ధములు సంభవింపవు కదా! నీవిప్పుడు నా యెదుట క్రుమ్మరించిన మణుల చూచితివి. అవి నీ హృదయము నందలి నిత్యాభిమాన సారమునకు నిదర్శనము. సువర్ణాక్షరణములతో లిఖింపదగు మా జైత్రయాత్రలో నీ చరిత్ర నిశ్చయముగా నిలిచితీరును. ఎంతో పరిణతి చెంది, పరిపక్వ రాజనీతితో సరసఫలము నందించు దృక్పథము కలిగిన తక్కినరాజు లందఱు నిన్ననుసరించి మైత్రీపూర్వక కరస్పర్శ కావించినచో అంతకంటె కావలసినదేమి! అట్లుగాక గర్వోన్నతితో ఎదిరించు విరోధులు విపన్నులై నశింతురు. శత్రుసంతాప కారకమ్మైన మా ప్రతాపాగ్నికి నీ సహకారము తప్పక ఆజ్యము కాగలదని మేము నమ్మవచ్చును గదా! అని గ్రీకు ప్రభువు పలికిన చతుర సంభాషణలోని వ్యంగ్య వైచిత్రిని అంభి గుర్తింపక, తన మైత్రీఘనతనే వినుతించుచున్నాడని భావించి పొంగిపోయినాడు. తమకనుకూలించు అర్థమునే గ్రహించు స్వార్థపరులు పరుల మాటల ఆంతర్యమును గ్రహింతురా! అని కవి యిచ్చట కల్పించుకొని కావించిన సమర్థన ఎంతో విలువైనది. ఇట్టి సంవాదపూర్వక కథాకథన విధానములో మంచి చెడ్డలరసిన కవి తనకు తానై చేయు నిర్ణయములు కావ్యసృష్టిలో కవితాన్యాయపుష్టికి సత్యసిద్ధాంత నిరూపణలు. అంభి అతివినయమును ధూర్తలక్షణముగా యవన విభుడు గుర్తించినాడు.

సమష్టి శ్రేయస్సునుద్దేశించి గ్రీకుప్రభువు తెలిపిన విషయములన్నియు కేవల వ్యక్తిగత పరిమితిగనే ఆకళించుకొన్న అంభి, చిట్టచివరి సంవాదములో తాను వచ్చిన పని తనకనుకూలమ్మైనదని భావించి, తనలోని కుళ్ళునెల్ల వెళ్ళగ్రక్కినాడు. నేను మిము చూచుటకై వచ్చిన విశేషమును తెలుపవచ్చునా? అని తన తెలివి

తక్కువతనమును బయట పెట్టినాడు. ఏ పురాసుకృతమో మీకు మొట్టమొదట స్వాగతము పలుకు అదృష్టము నన్ను వరించినది. ఎవ్వడో పరమనీచుడుతప్ప గుణ పక్షపాతి యెవ్వడైనను మీయెడ భక్తితాత్పర్యములు తప్పక ప్రకటించునని ప్రారంభించి, మెల్లమెల్లగా పురుషోత్తముని గూర్చి చర్చించుటకై ఒక్కొక్క మెట్టుగా అంభి సాగించు సంభాషణక్రమమునకు కవి చక్కని సందర్భమును కల్పించెను. మొదటిగా మీ వంటివారు ప్రశాంతముగా చల్లని నవ్వులతో ఉన్న హైందవమును రక్తమయము గావించు అపనిందకు పాల్పడరు. తనక్షేమము లోకక్షేమము ప్రధానము. లోకభద్రతకు తన క్షేమమునైన మానుకొనుట మాన్యము. తనకు లోకమునకు హాని కలిగించు హీనుని యోచనాశూన్యునిగా ఉన్మత్తునిగా విబుధులు భావించి, వారినొక లెక్కలోనికి తీసికొనరు. ఎక్కడనో ఒక్కడు-అటు చెనటులు, పెడకొయ్యలు ఉన్నంత మాత్రమున నేమగును? చాలవరకు వినయవివేకములుగల దొరలే ఇచట ఉన్నారు. మీ రాకను విన్నంతనే ఏయే రాజులు వచ్చి పేరిమికి పాత్రులై కూరిమి మీయెడ చూపుదురో కొంత ఓరిమితో ఎదురు చూడవలసియున్నది. మీ సన్నిధికి రాని అభిమానధనులైన భూజానులెవరైన ఉన్నచో, మీ రాకను తెలిపినచో తెలిసికొని పెక్కుమంది వత్తురని నా నమ్మకము. కాని ఒకేఒక్కడు మీరాకతో మహోగ్రుడై మిట్టిపడు దురహంకారియున్నాడు. అట్టివానినిగూర్చి మీకు తప్పక తెలుపవలసి యున్నదన్నాడు. ఆ మాటతో గ్రీకురాజు ఎవ్వడాఘనుడు? మాపై లంఘించు ధైర్యసాహసోపేతుడు? అంతటి ఉక్కుగుండెలుగల అతని పేరేమి? మాకు కొంత తెలుపుమని ఆసక్తిని కనబఱచినాడు. యవనవిభుడడుగకయే తాను చెప్పుట సమంజసము కాదు. అతడడిగిన యనంతరము ఎంత విస్తరించియైన వివరింప వచ్చును. ముందుగా అతనిలో ఆసక్తిని రగుల్కొల్పుట ముఖ్యమని అంభి భావించి, పురుషోత్తముని పేరును తెలుపుటలోనే ఎంతో వైముఖ్యమును ప్రదర్శించినాడు. ఏరికోరి ఆ శఠునికి వాని తల్లిదండ్రులు పెద్దపేరే పెట్టిరి. పురుషోత్తముడను ఆ పేరుతో వాడు పొంగిపోవుచున్నాడు. ఇకవాని తీరుతెన్నులు సావధానముగా కూర్చుండి చెప్పుకొందము. మీరు మాత్రము మా పురమును మీ పాదస్పర్శతో పునీతము చేయుడు. మా వినతి త్రోసిపుచ్చక మా వెనువెంటనే మీరు విజయంచేసి, మా సేవలు స్వీకరించి కరుణింపుడని అర్థించినాడు.

అందుకు యవనభూపతి సరియని తన సమ్మతి తెలిపినాడు. ఎప్పుడు మెల్లన నవ్వుచు వల్లెయని యనెనో లేదో యుద్ధసేన సంసిద్ధమైనది. అప్పటి అంభి రాజస మంతింతకాదు. భుజము లెగురవేయుచు తానెక్కిన గుఱ్ఱపు హొయలును ఉరుకులతో చాటుచు, యవనసేనకు ముందు నడచు గౌరవము కల్గెనని దర్పమును

చూపినాడు. అది యెంత హేయమో, తన చరిత్ర కెంత కళంకమో తెలియక గ్రీకురాయని అడుగులకు మడుగులొత్తుచు పయనమయినాడు. అప్పుడతనిని గ్రీకురాజు సునిశితముగా గ్రహించి, ఇతడేదో గొప్పపదవియొక్క ఆశతో ఉన్నాడనుకొన్నాడు. ఇటు ఇరువురును స్వలాభపరులే, విషపూరితులే అని తెలిపిన కవి అటుపై వారి భోజనాదులు ముగించినట్లు సూచించినాడు. అంత తీరికగా పురుషోత్తమ ప్రసక్తి యిరువురి సంభాషణలో ప్రాముఖ్యమును సంతరించుకొన్నది. ముందుగా యవనభూపతియే సంభాషణకుపక్రమించి "అతని పేరులోనే విలక్షణ గుణమున్న దంటివికదా! మఱి అతని వృత్తాంతమేమిటో ఇసుమంతయు దాపక తెల్పినచో అతని నెట్లణపవలెనో అందుకు తగునేర్పాట్లు చేసికొందు"మనినాడు. ఇది అంభికి పరమోత్సాహము కలిగించినది. "ఇప్పటికి నాకు తెలిసిన సంగతులేకాక, ఎప్పటివో మఱచిన అంశములను కూడ జ్ఞప్తికి తెచ్చుకొని చెప్పుమందువా?" అని మఱికొంత ఆసక్తిని పెంచి వివరింపదలచినాడు. "సరి వినుడు. ఆతనికా పేరే గొప్ప గర్వకారణము. పెద్దలేదో వేడుకలో పేర్లు పెట్టెదరు. ఆ పేరుకు సార్థకత కూర్చుటకదా ప్రధానము. పేరు రమ్యము కాకపోయినను, తీరు రమ్యమైన వారిని లోకమాదరించును. అట్లు కానివారిని లోకము గర్హించి తీరును" అని అంభి పలుకగనే యవనప్రభువు "అవును! నీ మాటలలో ఎంతో వాస్తవమున్నది" అన్నాడు. ఇట్లు పురుషోత్తముని పేరు అతని తీరును గూర్చియే విపులచర్చ జరిగినది. ఇట్టి సన్నివేశ కల్పనముతోనే కవి అన్ని పాత్రల మనస్తత్త్వమును అద్భుతముగా చిత్రించెను. చిటిప్రోలు కృష్ణమూర్తిగారి సంవాదాత్మక శైలిలో ఇమిడియున్న రహస్యమిదే!

ఇట స్వల్పవ్యవధిలో మఱల పురుషోత్తముని చర్చ మఱికొంత ఊపునందు కొన్నది. "వాని గుణములలో ఔన్నత్యము లేకున్నను ఆకారము మాత్రము తాళవృక్షము వలె ఉన్నది. అదికూడ వానికి అతిశయమును కూర్చినది. ఇక ఆతని కన్నులు తామరలనలేముకాని చక్రములవలె కదలును. ముక్కు సంపెగ కాకపోయినను కోటేరుతో పోటీచేయును. మొగము చందురుడు కాదుకాని దినరాజు పీట వేసినాడు. తొండము దంతములు లేవుగాని వాని తల విఘ్నేశ్వరుని తలదన్నును. వాని వక్షస్థలము శ్రీవిహారము కాదుకాని శ్మశానమనక తప్పదు. వాని కాళ్ళు కయ్యమునకు చాచును. తానేదో గొప్ప వివేకవంతుడనని ఎప్పుడును ఏదో మాటాడుచుందును. ఎక్కడ తన్ను వాచాలుడనియందురోయని ఎవ్వరు వానితో వాదింపరు." తీవ్ర వేగముగల వాగు సాగునట్లు మిక్కిలిగా వాగుచున్న ఆతని మాటలలోని ఆంతర్యమును కొంతసేపు కన్నులు మూసికొని గ్రహించిన గ్రీకురాజు వాస్తవమైన ఆతని అక్షయతేజోమహత్తరమూర్తిని తనలో నిలుపుకొనినాడు. వస్త్రముతో

కప్పబడిన మణి కాంతివిలువ సామాన్యులకేమి యెఱుకయని భావించినాడు. అంభి తన మాటలకు గ్రీకు ప్రభువు సంతృప్తి చెందెనని తలచినాడు. అటుపై మఱల ప్రారంభించినాడు. "వాడు పెద్ద రాక్షసుడు. యుద్ధములో వాని అఱపులకు అంతులేదు. వాడు తన మదమునకు తగినట్లే మదోత్కట మాతంగముపై యుద్ధమునకు వెడలును. వానికి జంగమ స్థావరములని రెండు కోటలు. లక్షల ప్రజలు కూటికి లేక కుములుచుండగా వీడు గజపోషణలో నిమగ్నుడు. వానికి అమర సమరులని ఇరువురు కొమరులు. పెద్దవాడు కొంత అనుకూలుడే కాని రెండవవాడు మ్రింగరాని కడి. ఉక్కు పిండము. ఆ పురుషోత్తముడు పట్టువిడుపు లెఱుగని మొండి. చిన్న చిన్న రాజులలో వానికి పేరున్నది. కాని వాడు మీ ముందెంత! అతని సైన్యము కూడ మితమే. మీ అశ్వబలముముందు వానిబలము అత్యల్పము" అన్నాడు. అప్పుడా గ్రీకుభూపతి "మరేమైన విశేషములున్నవా!" అని అడిగినాడు. "ఆఁ ఉన్నవి. వానికి వాని ప్రజలకుగల ఆత్మాభిమానము చెప్పనలవి కానిది. చుట్టుప్రక్కల రాజుల మందఱము కలిసి ఎవరు మనపై దండెత్తుదురో వారిని చుట్టు ముట్టుదమన్న గట్టి పట్టుదలతో ముందుగా తన కుమారుని పంపియున్నాడని విన్నాను" అని అంభి అనగానే గ్రీకురాజు "ఇంతకీ మన కర్తవ్యమిదే కదా!" అన్నడు.

అటుపై పురపరిస్థితులను పరిశీలించుటకై గ్రీకుప్రభువు తన ప్రధాన మంత్రితో బయలుదేరి సత్యనారాయణపురము చేరినాడు. అచ్చట ఇరువురు కృషీవలులలో పొలమమ్మిన వానికి, పొలము కొన్నవానికి మధ్య కలిగిన వాదము సాగుచుండగా విని, సావధానముగా దానిని గూర్చి ఆలోచింపదొడగినాడు. కొన్నవాని పొలములో నిధులు లభించినవి. అవి తనవి కావు. అమ్మినవానివే అని తెచ్చియిచ్చుటలో జరిగిన వాదోపవాదములు గ్రీకురాజును ఆశ్చర్యచకితుని జేసినవి. చిట్టచివరకు ఇరువురి సంతానము దానిననుభవింపవచ్చునన్న తీర్పు ఎంతో రసవత్తరఘట్టముగా సాగినది. దీనిని గ్రహించి ఆ యిరువురు హాలికుల సత్యసంధతకు లోలోపల ఆనందపరవశుడై, అందలి సత్యము ఆ ఊరి పేరునకు తగినట్లేయున్నదని తలచెను. అలెగ్జాండర్ భారత దేశాగమనములో ఇది చాల ప్రసిద్ధమైన సంఘటన కాన, దీనిని చిటిప్రోలు కృ ష్ణమూర్తిగారు 150వ పద్యము నుండి 200వ పద్యము వరకు ఉత్కంఠావహముగా రచించిరి.

అమర సమరులు, అంభి సహోదరి ప్రార్థనాకుమారి, పురుషోత్తముడు కలసి యవనదండయాత్రను గూర్చి చర్చించు సన్నివేశముతో చతుర్థ ఖండము సాగినది. చర్చ జరుగు సందర్భముననే ఇరాను రాకుమారి రుక్సానా విచ్చేసినది. ఆమెను

"సోదరీ!" అని సాదరముగా సత్కారముతో పురుషోత్తముడు ఆహ్వానించినాడు. ఆమె ఆ సంబోధనకు మహానంద మొందినది. రాజు సొంతచెల్లెలివలెనే స్వాంతము నందెంచగా ఆమె మెల్లగా వచ్చి పురుషోత్తముని దక్షిణ హస్తమునకు రక్ష కట్టినది. ఇది తన జీవితములో ఒక గొప్ప పర్వదినమని అతడు భావించినాడు. ఒక సామాన్య వ్యక్తికి ఒక మహాప్రభువుతో సోదరస్నేహము పాదుకొనుట కలలోనైన ఊహింపని విషయము కదా! అపుడు పురుషోత్తముడు "మనకిది జన్మదినోత్సవము వంటిది. నీ అభిమతమేదో జంకు గొంకు లేకుండ తెలుపు"మనినాడు. ఆమె తన హైన్య దైన్యములు వివరించుచు "నీవు లోకశాంతి కోరువాడవని విని వచ్చితిని. లోకకల్లోలమునకు తలపడి, ఈరానుపై దండెత్తి, యిపుడు వీరభారతముపై అలెగ్జాండరు కాలుమోపనున్నాడు. అతని అడుగులెన్ని యీ పుడమిపై పడునో అన్ని పిడుగులీ పడతి గుండెలో పడినవి"అని తన దీనగాథ తెలిపి ఆదుకొమ్మని అర్థించినది. ఆమె పరజాతి నాతి. వ్యక్తిగతమ్మైన ఉన్నతికన్న జాతి గౌరవము ముఖ్యము. ఈమెను నిరాదరించినచో ఇచ్చిన మాట తప్పెనను నింద తనపై పడును. ఆమె కోర్కె తప్పక తీర్చుటయే కర్తవ్యము. ఆమె కన్నీరు తుడుచుటయే లక్ష్యము కావలెను. కట్టిన రక్షాబంధమునకు ప్రయోజనము కూడినది. ఆమెకు ఎంతో సంతోషము కలిగినది. ఒకరికొకరు పరస్పర ముఖావలోకన మగ్నులై కల్లోలపడినారు. ఇట ఇంట మెట్టినది అభాగ్యదేవతయే అని తలచినాడు. అపుడు అమరుడు "ఇది ఏదో విధివైపరీత్యము. మీది రామబాణము. గ్రీకు నరాధముని సుబాహునివలె తునుముడు" అని తమ్ముడు పలుకగా, అన్న "గ్రీకురాజే ఈ రమణిని పంపియుండుననిపించుచున్నది. కలలో కూడ ఊహింపని సంఘటనలు జరుగుచున్నవి. భారత జనయిత్రి భాగ్యరేఖ ఏమి కానున్నదో" అని సమరుడనగా, రుక్సానా "భారతక్షోణికి కీడు కలిగించు కన్యకారూప రాక్షసిని నేను కాను. మీ మనస్సును నొప్పించినదాననైనచో మీరు కట్టిన రక్షాబంధము నిపుడే విప్పి నా దారిని నేను పోవుదును" అన్నది. అపుడు రాజు "ఎంత పిచ్చిదానవమ్మా! ఈ బంధమంతలో అంతరించిపోవునది కాదు. చెదరిన రెండు హృదయములను ఒకటి చేయు మేల్మి చుట్టజికము ఒక్క నూలుపోగులో ఉన్నది తల్లీ!" అని ఆమె కలతను పోగొట్టి, తన కుమారుని వైపు చూచి, "మీలో కల్గిన అనుమానము అహేతుకము. అందోళన చెందినప్పుడిట్టి క్లిష్ట సమస్యలు వచ్చుట పరిపాటి. మంచి చెడ్డలు, ముందు వెనుకలు, ఆలోచించి ఒక నిర్ణయమునకు రావలెను. ధర్మము కడు సూక్ష్మతరమ్మైనది. ఒక్కొక్కప్పుడు ధర్మమే అధర్మముగా, అధర్మమే ధర్మముగా కన్పట్టును. ఒక ధర్మము మఱియొక ధర్మమునకు హాని కలిగించు తరుణములో కర్తవ్య మూఢులగు చుందురు. ఏమమ్మా! ప్రార్థనాదేవీ! ఏల

మౌనము పూనినావు. నీ ఉద్దేశ్యమేమిటో చెప్పు తల్లీ!" అన్నాడు. అటుపై అందఱి నుద్దేశించి "ఏది ఎట్లైనను భారతోర్వీ ప్రతిష్ఠకు కళంకము కలుగకుండ మెలగుటయే మన లక్ష్యము. విబుధులు ఒక ధర్మతేజో మహత్తకు తప్ప పై పై మెఱుగులకు ఆసపడరు. ఈరాను రాజ్యలక్ష్మి వికాసముతో నిలిచి వెలుగునట్లు మనమీ తరుణమున తోడ్పడవలెను. ఎంతో దైన్యముతో 'రక్షాందేహి' అని అర్థించిన రాచకన్నియకే ఆనందప్రఫుల్ల చక్షుస్సులదరగా చూడకపోవుట శోభాకరమా! ధర్మదీక్షా కంకణుడైన ప్రతివీరు డొక రామభద్రుడే! రక్తమును వర్షించి హర్షించు ప్రతి రాక్షసుడొక సుబాహువే! రక్తదాహముతో ఇంత దురంత దురాగతమునకు పాల్పడిన గ్రీకురాజు సుబాహుని వలె కాకుండ రుక్సానా చెలిమిని నోచుకొననిండు" అని చెప్పిన సమాధానమునకు ఆ ముగ్గురు తృప్తిపడినారు. భారతమాతకు జయమని జయజయధ్వానములు పలుకగా ఈరాను రాకుమార్తె కూడ ఎంతో సంతోషించినది. "ఇది నిజమా! కలయా! నాకు చూడగా వాస్తవ స్వప్నమువలె తోచుచున్నది" అని పురుషోత్తముడు అన్నాడు. అంతదాక అంతయు ఆలకించుచున్న అనిలుడు ఆత్మలో ఆనందము నెలకొనగా తన పేరు సార్థకముగా కదలినాడు.

*(సశేషము)*



గీటుఱాయి-2:

## త్రయీ

- డా॥ మల్లేల గురవయ్య

క. త్వత్కవితారామము మ
ధూత్కర్ష రసిక జనాళికుల్లాసమ్మున్
హృత్కవితామోదము శ
శ్వత్కమనీయముగ గూర్చు శాంతసుఖములన్. 1

క. సుమనస్సులు రాఘవ శత
కము కవితారామ మింతెకాదు మహాగ్రం
థములెన్నో వెలువరచి ము
దము గూర్పుము తేటతెనుగు దనము దనరగన్. 2

క. ఉల్లి యొనరించు మేలును
తల్లి యొనర్పదను మాట దబ్బఱసేయన్
తల్లి సరస్వతయైనది
ఉల్లము రంజిల్లఁ గూర్పు ముత్తమ కృతులన్. 3

*(శ్రీ ఉల్లి రామసుబ్బయ్య గారి 'కవితారామ' ప్రశంస)*



గీటుఱాయి-3:

# పంచరత్నములు

– డా॥ మల్లేల గురవయ్య

క. చలసాని వసుమతీ! కుం
తల అమరప్రేమ తుదకు తాదాత్మ్యరసో
జ్జ్వల మయ్యెన్ ద్వత్ప్రతిభా
విలసన పారమ్య రమ్యవిధి మాధవమై! 1

క. మఱి యాదమఱచి పువ్వుల
మరందమును గ్రోలు భ్రమర మధుర సుగీత
మ్మరయగ బృందావనమే
సరస మెలసినటుల దనరె సాహిత్యమ్మై. 2

క. ప్రతి సహృదయ పాఠకుడున్
బ్రతి గోపిక తానెయగుచు భాషించినటుల్
ప్రతిపాదించితివమ్మా!
ప్రతిలేనిది నీదు ప్రతిభ వసుమతి సుకృతిన్. 3

శా. హిందీభాష పఠించి తెన్గునకు సాహిత్యమ్ము సంధించి మీ
రందింపన్ గలభాషిణుల్ మెరసె నౌరా! సూరనాంధ్రమ్ము లీ
చందం బెందును గాన మింతవరకున్ సాహిత్య రత్నమ్మునై
చిందింపన్వలె నీదు రమ్య కవితా శిల్పం బనల్ప శ్రుతుల్. 4

మ. ఎదలో మీకును నాకు నేర్పడెను సాహిత్యంపు సౌరభ్య సం
పద యాదృచ్ఛికమై రసోల్బణమునన్ వాసిల్లి సౌదర్య స
మ్ముదమై మల్లెల సౌమనస్యమున నింపుల్ నింపి నిత్యమ్ము సౌ
హృద మాధుర్యము ధుర్యమై యెసగు స్ఫూర్తిన్ గీర్తి (న) వర్తిల్లగన్

*(శ్రీమతి చలసాని వసుమతి గారి "భ్రమర గీతము-కుంతల" పఠనామోదము)*



# చైతన్య లేఖలు

## 1

**మాన్యులు ప్రొఫెసర్ తంగిరాల సుబ్బారావుగారికి**
**నమస్కారపూర్వకముగా వ్రాయునది.**

ఆర్యా!

మీరు నాయెడ చూపిన ప్రేమానురాగాలకు సర్వదా కృతజ్ఞుణ్ణి. మిమ్మల్నెంత కాలంగానో ఎరుగుదును కాని, మీ అన్నగారు కూర్చిన పద్యాల సంకలనానికి, వారు చెప్పినట్లుగా వ్రాసిన, మీ అమ్మగారిని గూర్చిన, మీ జీవిత ప్రస్థానాన్ని వివరించిన, ముందుమాటతో మీ మహోన్నత వ్యక్తిత్వం నాకు సాక్షాత్కరించింది. మీరు పసితనం నుండీ జీవనసంగ్రామం చేసిన మహానుభావులు. అన్ని కష్టాల కడలినుండి వచ్చినా తెల్లని మల్లెపూవు లాంటి నవ్వుతో జీవతమంటే శరత్కాలచంద్రిక అన్నట్లు కన్పించే మీలాంటివారు లోకంలో మరీ మరీ అరుదు. మీ వ్యక్తిత్వం నిర్మలమైనది.

"నా ముద్దబంతి పువ్వును" చదివినాను. చైతన్య కవితలో ప్రచురింపబడిన భాగాన్నీ, మీరు పంపించిన తరువాతి భాగాన్నీ చదివినాను. మీరు నాకంటె ఐదేళ్ళు (5) పెద్దవారు. జీవితాన్ని సమగ్రంగా తెలిసికొన్నవారు. మీకు నేను చెప్పగలవాణ్ణా? శోకమంటే కాల్చేదని కూడా అర్థం కదా? హృదయంలో కుంపటిని దాచుకున్నట్లు. మీరు విషాదగీతిలో వ్రాసిన వాక్యాలు కొన్ని ఎంతో మననం చేయడానికి యోగ్యంగా ఉన్నాయి.

**నీ పచ్చని దబ్బపండు శరీరం ఆయుస్సు**
**పితృవన హోమకుండంలో హవిస్సు!**

నా శరీరంలో సగం చచ్చుబడింది
ఎడమకంటి చూపులో చిచ్చుపడింది ...?
ఇక మీదట
నా ఏకపాత్రాభినయాన్విత పంచమాంకం ప్రారంభం ...
రేపు ఒంటెద్దు బండి పయనం
చూపు శుక్రాచార్య నయనం
మారణ రావణ కరవాలంతో
రెక్కలు నరకబడి నేలకూలినవాణ్ణి ...
అలనాటి జటాయువు తమ్ముణ్ణి
నీవు నాకు బహూకరించిన
ఈ సంసార సుందర నందనవనంలో
నిత్యం నాకు కనబడుతూనే ఉన్నావు ...
అహోరాత్రాలు నాకు దర్శనమిస్తూనే ఉన్నావు.

* * *

నీ ప్రాణహంసతో పాటే
నా కవితాశక్తి కూడా ఎగిరిపోయిందని
పాపం తెలియదు వారికి!
తల్లిలేని పిల్లవాడికి భోజనం దొరకదు
పెళ్ళాంలేని పెద్దవాడికీ భోజనం దొరకదు
తల్లిలేని పిల్లాడు అనాథ
పెళ్ళాంలేని మొగుడూ అనాథే!!
నువ్వులేని నేను
ఇంచుమించు మంచం పట్టిన రోగిని
దేనిమీదా ఆసక్తిలేని యోగిని.
ఇవి నీ జ్ఞాపకాల మూకుడులో
నవధాన్యాల లేతమొక్కలు

'నా ముద్దబంతి పువ్వు' సమార్ద్రమైన గీతిక. ఎద కలిగిన ప్రతివాణ్ణీ కదిలిస్తుంది. కన్నీరొలికిస్తుంది.

మీరు చైతన్యకవితను ఎంతో ఓర్పుతో ప్రచురిస్తున్నారు. సాహితీ పత్రికను నడపడం అతిక్లిష్టమైన పని.

ఇంతకాలం నడపడం అంటే ఎన్ని కష్టనష్టాలకు ఓర్చుకోవాలి? చైతన్య కవిత విశిష్టంగా ఉన్నది. సుందరంగా ఉన్నది. పఠాభి సంచికను చదివినాను, (పఠాభి, శేషేంద్ర సంయుక్త సంచిక). పండితులకీ, విమర్శకులకీ, భావనా బలమున్న కవులకి చక్కని వేదికగా రూపొందింది. మీ వ్యాసాలను చదివినాను. బాగున్నాయి.మీ స్వభావం స్పష్టంగా తెలుస్తుంది. డా॥ రాజేశ్వరీ దివాకర్లగారి కవితలు ప్రతిభా సంపన్నంగా, ఉక్తి విచిత్రంగా ఉన్నాయి. (తన పేరుకు పొట్టలో చుక్కమొలిపించుకున్నవాడు) (కసిగా వాగర్థ సంచయంలో తాత్పర్యాన్ని కాటేసింది). బిర్నీది విజయదత్ స్వర్గావతరణం అద్భుతంగా ఉన్నది. ఇంత చక్కని పద్యరచన క్వాచిత్కంగా ఉంటుంది. ఈ పద్యాలని ప్రచురించి ఒక మహోన్నత కృతిని రక్షించినారు. రామకృష్ణగారి సావిత్రి అనువాదం గొప్పగా ఉన్నది. అనువాదం ఆ కావ్యానికి చేయడమే ఒక గొప్ప సాహసం. సావుకీ బతుక్కీ మద్దెన (వేంపల్లి అబ్దుల్ ఖాదర్) శక్తిమంతమైన కవిత.

స్మృతి సంచికగా పఠాభి, శేషేంద్రల ప్రాముఖ్యాన్ని చక్కగా ఆవిష్కరించినారు. రిఫరెన్స్ జర్నల్‌గా నిలుస్తుంది.

ప్రొఫెసర్ కవన శర్మగారితో ఏలూరులో అజో-విభో-కందాళం వారి సభా సందర్భంగా పరిచయమైంది. వారిది గొప్ప వ్యక్తిత్వం.

ఈసారి బెంగుళూరు రావడం తటస్థిస్తే మిమ్మల్నందరినీ కలుస్తాను.

నమస్కారములతో

భవదీయుడు

**- శ్రీ లక్ష్మణ మూర్తి**

**ప్రొఫెసర్ ఎస్. లక్ష్మణమూర్తి**
5-11-674, విద్యారణ్యపురి, వరంగల్లు - 506 009
ఫోన్: 0870 - 2439252,
మొబైల్: 9959876675

* * *

## 2

**'చైతన్య కవిత' సంపాదకులు**

**మాన్యశ్రీ తంగిరాల వెంకట సుబ్బారావుగారికి**

**డా॥ వి.వి.ఎల్. నరసింహారావు నమస్కారములు.**

ఆర్యా!

మీరు సాదరంగా పంపిన చైతన్య కవిత 43, 44, 45 & 46 సంపుటి కృతజ్ఞతతో స్వీకరించాను.

గ్రంథ ఆద్యంతం సావధానంగా చదువుకొన్నాను.

"నా ముద్దబంతి పువ్వు" అంటూ మీరు వ్రాసిన కవిత నా గుండెలో విషాదపు పొంగులు పొంగించింది. దీనికి హేతువు నేను కూడా ఇటువంటి విషాదానికి లోనైయున్నవాణ్ణికావటమే. 23-5-2005న, నా శ్రీమతి అనసూయగారు నిర్యాణం చెందారు. ముగ్గురు కుమారులను, ఇద్దరు కొమార్తలను ప్రసాదించి కన్నుమూసింది.

**"అనసూయన్ ప్రియపత్ని నత్యకలుషాత్మానందసంసేవధిన్**
**మనమందే పదిలంబు చేసితి మహాత్మా! తంగిరాలాన్వయా!"**

మీరూ శ్రీమతి శకుంతలాదేవిగారికి చైతన్య కవితను అంకితం చేస్తూ -

**"ఉన్నట్టుండి నడినెత్తిన పిడుగుపడింది! మిన్ను విరిగి మీదపడింది**
**హంస ఎగిరిపోయింది; అహోరాత్రాలు నాకు దర్శనమిస్తూనే ఉన్నావు!**
**మనశ్శాంతిని ప్రసాదిస్తూనే ఉన్నావు!!"** అన్నారు.

ఈ రచన మాత్రమే కాక, మీ సంపాదకీయాలు 1 & 2, పఠాభిగారితో పరిచయం, వెన్నెల జెండా, గర్వకారణమైన ఒక అనుభూతి, అక్షరాక్షతలు, సాహిత్య డైరీ అన్నీ మీరు చేస్తున్న అపూర్వ సాహిత్య కృషికి నిదర్శనాలు. మీకు కృతజ్ఞతలు.

అంబికాఅనంత్‌గారి ఆంగ్లరచనలు కూడా ఎంతో హృదయంగమంగా ఉన్నాయి. శేషేంద్ర కవితా వైభవాన్ని కన్నులమందు సాక్షాత్కరింపజేశారు.

'చైతన్య కవిత'లో తమ రచనలను ప్రచురించుకొన్న రచయితలందరూ దాదాపు నాకు బాగా పరిచితులే.వారి రచనలకు నా అభిప్రాయాలను అందించినవాణ్ణే. మాన్యశ్రీ గుత్తి (జోళదరాశి) చంద్రశేఖరరెడ్డిగారి ద్వారా మనం బాగా సన్నిహితులమైనాము.

"వ్యయ వసంతం - సర్వజిత్తు శరత్తు - ఏప్రిల్ 2006 - అక్టోబరు 2007 చైతన్య కవిత 43, 44, 45 & 46 సంపుటి"ని నాకు సాదరంగా బహూకరించి నందుకు మీకు హార్దికమైన నా కృతజ్ఞతాభివందనములను అందజేస్తున్నాను.

దయతో స్వీకరింప ప్రార్థన.

ఇట్లు

హైదరాబాద్ భవదీయుడు

26-5-2008 వాసిలి వేంకటలక్ష్మీనరసింహారావు

* * *

3

May 20, 2008

Dear Dr. T.V. Subbar Rao,

I received "Chaitanya Kavitha" in which the poem written by you was published in an abridged form. I read it and was very much moved to tears. I also read it out to Mrs. Kumar.

Subsequently, I received the manuscript sent by you on 28-4-2008, wherein you have written not only about your dear wife, but a brief autobiographical sketch of your life with her from the time you got married to her in 1954 till September 2006.

To say the least the poem which you wrote not only reflected your innermost thoughts; the wonderful years you spent with her - all expressed in poetic beauty, elegance and grace, surpassing all human emotions.I can understand how your irreparable loss came in poetic waves and took the shape of "Na Mudda Banthi Puvvu".

I hope many persons will have the opportunity of reading it not only in Telugu but in other languages.

Kindly accept not only my condolences, though belated on this irreparable loss but the beautiful way you paid a tribute in her memory.

With kind regards,

Yours sincerely,

**- B.V. Kumar**

**B.V. Kumar,** M.A. B.L., I.R.S.
Member, Central Board of Excise & Customs
and Additional Secretary to the
Government of India, Ministry of Finance (Retd.)
No. 103, 17 'C' Main Road, 5th Block, Koramangala
BANGALORE - 560 095 Phone: (080) 25530293, 25532967,
Fax: (080) 25520641 e.mail: Kumar_bv@dataone.in

* * *

**4**

వరంగల్లు
5-4-2008

ఆప్తమిత్రులు

ఆచార్య టి.వి. సుబ్బారావుగారికి

నమస్కారాలు

ఉగాది శుభాకాంక్షలతో -

ఈ సారి చైతన్య కవితలో మీ స్మృతి గీతం కన్నీళ్ళు పెట్టించింది.

ముస్లిం ఉగ్రవాదం గూర్చిన మీ సంపాదకీయం - 2 చాలా బాగున్నది. సమయోచితమైంది.

మందేశ్వరరావు, మన్నవ భాస్కరనాయుడు వ్యాసాలు, సంగనభట్లవారి కల్పవృక్ష పద్యాల వ్యాఖ్య ఎన్నో బాగున్నాయి. ఈ సారి చైతన్య కవిత ప్రత్యేకంగా ఉన్నది.

అభినందనలతో ...

భవదీయుడు

- సుప్రసన్నాచార్య

కోవెల సుప్రసన్నాచార్య
9-1-190, గిర్మాజీ పేట
వరంగల్లు - 506 002

* * *

## 5

హైదరాబాద్
20-5-2008

మాన్యశ్రీ సుబ్బారావుగారికి
నమస్కారము చేసి వ్రాయునది.

మీరు దయతో పంపించిన 'చైతన్య కవిత' (43, 44, 45 & 46) ఏప్రిల్ 2006 - అక్టోబర్ 2007' అందినది. ధన్యవాదములు. ఈ సంపుటిని దివంగత మీ సతీమణి శకుంతలాదేవి దివ్యస్మృతికి అంకితం ఇవ్వడం హృదయాన్ని స్పృశించింది.

మహనీయులు, బంధుమిత్రులు, కవులు ఇంకా అనేక సుప్రసిద్ధులు వెలిబుచ్చిన స్మృతులు, సంతాపము చదివితే మీ మంచితనం, స్నేహసంపద తెలుస్తూంది. సంచికలోని పద్యములు, వ్యాసములు చాలా బాగున్నాయి.

అభినందనలు.

- ఐ.వి. చలపతిరావు

ప్రొఫెసర్ ఐ.వి. చలపతిరావు
ఎడిటర్, త్రివేణి
207, సుమాంజలి అపార్ట్‌మెంట్స్, స్ట్రీట్ నం. 2,
గాంధీనగర్, హైదరాబాదు - 500 080
ఫోన్: 2766 4682

* * *

## 6

గామాలపాడు
24-6-2008

మనస్వి మండనులు
ఆచార్య శ్రీ తంగిరాల వేంకట సుబ్బరాయ మహాశయులకు,
నమస్సులు.

మీరు దయతో పంపిన విషాదకవిత 'నా ముద్ద బంతిపువ్వు' చేరి చాలరోజులయింది.

హృదయం కరిగి పెల్లుబికిన కన్నీటితో వ్రాసిన మూడువందల పైచిలుకు పాదాల కవితకు కదలని గుండెలుండవు. పదపదాన ఆర్తి! చదివిన ప్రతిపాఠకుడు వేడి నిట్టూర్పు విడుస్తాడు.

కర్మాదికం 13 రోజులు గదా! మీ హృదయ వ్యథ 13 ఖండాలుగా వెలువడింది. రచనలో ఇదీ ఒక శిల్పమే అనుకొంటాను.

చిరంజీవి స్కందుడి 'నాయనమ్మకు ఫోనివ్వండి! మాట్లాడాలి' అన్నమాట గుండెలను పిండి వేస్తుంది. ఎవరికైనా కళ్ళు చెమ్మగిల్లుతాయి. మర్మజ్ఞులు మాత్రమే యిటువంటి ముక్కలను కవిత్వంలో చేర్చగలరు.

మీ అంతరంగంలో మీ అర్థాంగికి మహోన్నత స్థానం ఉండడం విశేషం. ఎంత మంచివారైనా ఎంత అనురాగమూర్తులయినా భార్యపట్ల ఆధిపత్య ధోరణి ప్రదర్శించని పురుషులరుదు.

"నీవు pure diamond!
నేను damn scoundrel!!"
లోకంలో ఏ మగవాడి నోటనయినా ఈ మాటలు వెలువడగలవా?

మీరు శకుంతలమ్మగారికి నమస్కరించడం అవిస్మరణీయమైన అంశం.

మహాత్ముని ఆస్థానకవి తుమ్మల సీతారామమూర్తిగారు తులసి పూజ చేసి నిలుచున్న జీవితేశ్వరిలో విశ్వేశ్వరిని దర్శించి చేతులు జోడించేవారట. మహిష శతకం అంకితం పద్యాలలో ఈ అంశం ప్రస్తావించాను.

11వ ఖండంలో మంచి తత్త్వచింతన ఉన్నది. నిస్సార సంసార విస్తార సరోవరం - సాగరం అనకుండా సరోవరం అనడం విశేషం. ఆ మహాసాధ్వి మీకు సహధర్మచారిణిగా లభించడం మీ అదృష్టం.

అంతరంగంలో అనన్య సామాన్యమైన ప్రేమాదరాలు తొణికిసలాడే అమృత మూర్తులు మీరు ఆత్మేశ్వరులు కాగలిగిన శకుంతలమ్మగారు శతధా ధన్యురాలు.

మీ
- కృష్ణమూర్తి

చిటిప్రోలు కృష్ణమూర్తి
గామాలపాడు (వయా) దాచేపల్లి, గుంటూరు జిల్లా
మొబైల్: 9866579402

# 'శ్రీరస' సాహిత్య సభలు

*(2008వ సంవత్సరం జనవరి నుండి డిసెంబరు వరకు 'శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య' వారు జరిపిన 28 సాహిత్యసభల వివరాలు - సంక్షిప్తంగా)*

## 1

త్రిమతాచార్య జయంతి : (ఫిబ్రవరి 2, 3, 4 తేదీలు, 2008)
శ్రీ వద్దిపర్తి పద్మాకర్‌గారిచే మూడు ఉపన్యాసాలు
వేదిక: శ్రీ వేణుగోపాల కృష్ణస్వామివారి దేవాలయ సభామందిరం, మల్లేశ్వరం, బెంగుళూరు-560 003

(1) 2-2-2008: జగద్గురు శ్రీ శంకరాచార్య స్మారక పురాణ ప్రవచనం
(శనివారం) "శ్రీహనుమద్వైభవం"-1
సౌజన్యం: శ్రీమతి సత్యవతి - శ్రీ బి.ఎం. రెడ్డి దంపతులు

(2) 3-2-2008: జగద్గురు శ్రీ రామానుజాచార్య స్మారక పురాణ ప్రవచనం
(ఆదివారం) "శ్రీహనుమద్వైభవం"-2
సౌజన్యం: శ్రీమతి గీతా డి. రాజు - శ్రీకె. దొరస్వామిరాజు దంపతులు

(3) 4-2-2008: జగద్గురు శ్రీమధ్వాచార్య స్మారక పురాణ ప్రవచనం
(సోమవారం) "శ్రీ అక్రూర స్తవం" (పోతన భాగవతం నుండి)
సౌజన్యం: శ్రీమతి ప్రేమకుమారి - శ్రీ ఉమాపతి రాజు దంపతులు

ప్రత్యేక కృతజ్ఞతలు: ఎంతగానో శ్రమించి ఈ త్రిమతాచార్య జయంతిని మూడు దినముల పాటు ఏర్పాటు చేయించిన ప్రియమిత్రులు శ్రీ పి. కృష్ణంరాజు గారికి 'శ్రీరస' ప్రత్యేక కృతజ్ఞతలు.

## 2

*"చైతన్య కవిత" (43-46) ఆవిష్కరణ సభ*
(వేదిక: గాంధీసాహిత్య సంఘం, సిద్ధనహళ్ళి కృష్ణశర్మ హైస్కూలు హాలు, మల్లేశ్వరం, బెంగుళూరు - 560 003)
24-2-2008 ఆదివారం, సాయంకాలం 5-30గంటలకు

ఆవిష్కర్త : శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావుగారు
(అధ్యక్షులు, 'అరసం' బెంగుళూరు శాఖ)

ఉపన్యాసకులు : (1) ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య
(విశ్రాంత ఆచార్యులు,హైదరాబాద్ విశ్వవిద్యాలయం)
(2) డా॥ దివాకర్ల రాజేశ్వరి
(3) శ్రీమతి అంబికా అనంత్
(4) ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

ప్రథమ ప్రతి స్వీకరణ: ఆచార్య రత్నాకరం శంకరనారాయణరాజు:
శ్రీ డి.ఎల్.వి.వి. ప్రసాదరావు పంతులు

3

## స్వర్గీయ విద్వాన్ వి. చెంగల్వరాయనాయుడుగారి స్మారక సాహిత్యోపన్యాసాలు

వక్త : 'త్రిభాషా మహాసహస్రావధాని' – 'సరస్వతీపుత్ర' – 'అభినవశుక'

శ్రీ వద్దిపర్తి పద్మాకర్‌గారు, ఎం.ఏ.
ప్రణవపీఠం, ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా.

**17-4-2008,** గురువారం, సాయంకాలం 5.30 గంటలకు
"శివలీలలు"

**19-4-2008,** శనివారం, సాయంకాలం, 5.30 గంటలకు
"తెనాలి రామకృష్ణుని కవితా వైభవం"

వేదిక : గాంధీ సాహిత్య సంఘం, 8వ క్రాస్,
3వ మెయిన్ (మార్గోసా రోడ్డు)కు – 4వ మెయిన్‌కు మధ్య
మల్లేశ్వరం, బెంగుళూరు – 560 003.

సౌజన్యం: విద్వాన్ వి. చెంగల్వరాయనాయుడుగారి శిష్యబృందం, బెంగుళూరు.

## 4

## స్వర్గీయ తంగిరాల శకుంతలాదేవి (భళ్ళమూడివారి చిట్టి)గారి 68వ జయంతి స్మారక సాహిత్యోపన్యాసాలు

వక్త : 'రామాయణ ప్రవచన సుధాకర' - 'రామాయణ సుధానిధి' -

డా॥ మైలవరపు శ్రీనివాసరావుగారు (గుంటూరు)

**29-4-2008,** మంగళవారం, సాయంకాలం **5.30** గంటలకు

"సుందరకాండ సౌందర్యం - I"

**30-4-2008,** బుధవారం, సాయంకాలం, **5.30** గంటలకు

"సుందరకాండ సౌందర్యం - II"

వేదిక : గాంధీ సాహిత్య సంఘం,

సౌజన్యం : తంగిరాల శకుంతలాదేవి-తంగిరాల సుబ్బారావు దంపతుల సంతానం చిరంజీవులు: కాళి-రాము-సీత-శీను-శశి.

## 5

## కీ.శే. నల్లూరి అప్పలరాజుగారి స్మారక సాహిత్యోపన్యాసాలు

వక్త : 'మహాసహస్రావధాని' - 'ధారణా బ్రహ్మరాక్షసుడు' -

డా॥ గరికిపాటి నరసింహారావుగారు (కాకినాడ)

**28-5-2008,** బుధవారం, సాయంకాలం **5.30** గంటలకు

(1) "శ్రీకృష్ణదేవరాయలవారి ఆముక్తమాల్యదా సౌందర్యం - 1"
(వర్ణనలు)

**29-5-2008,** గురువారం, సాయంకాలం **5.30** గంటలకు

(2) "శ్రీకృష్ణదేవరాయలవారి ఆముక్తమాల్యదా సౌందర్యం - 2"
(మాలదాసరి కథ)

వేదిక : గాంధీ సాహిత్య సంఘం

సౌజన్యం : శ్రీమతి సుజాత - శ్రీ నల్లూరి సుబ్బరాజు దంపతులు

## 6

## కీ.శే. అగ్రహారం కృష్ణారెడ్డిగారి స్మారక సాహిత్యోపన్యాసం

డా॥ గరికిపాటి నరసింహారావుగారిచే

"తెలుగు పద్యం - హాస్యం"

**30-5-2008,** శుక్రవారం, సాయంకాలం **5.30** గంటలకు

వేదిక : గాంధీ సాహిత్య సంఘం

సౌజన్యం : శ్రీమతి రాధిక - శ్రీ ఎ.కె. జయచంద్రారెడ్డి దంపతులు.

## 7

## శ్రీ మహాభారత సప్తాహం (వ్యాసుని పాత్రచిత్రణ కౌశలం)

వక్త : 'ఆర్షవిద్యాసాగర' - 'రామాయణ రసభారతి' -

'ఉపన్యాస కళానిధి' - 'సాహితీ బృహస్పతి'

శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి

జిల్లెళ్ళమూడి, గుంటూరుజిల్లా.

**7-6-2008,** శనివారం : "ధృతరాష్ట్ర-విదుర-సంజయులు"

**8-6-2008,** ఆదివారం : "భీష్మ-ద్రోణ-అశ్వత్థామలు"

**9-6-2008,** సోమవారం : "కర్ణ-దుర్యోధనులు"

**10-6-2008,** మంగళవారం: "ధర్మజ-భీమ-అర్జునులు"

**11-6-2008,** బుధవారం : "కుంతి-ద్రౌపది"

**12-6-2008,** గురువారం : "శ్రీకృష్ణుడు"

**13-6-2008,** శుక్రవారం : "వ్యాస మహర్షి"

ప్రతిదినం సాయంకాలం **5.30** గంటలకు

వేదిక : గాంధీ సాహిత్య సంఘం

సౌజన్యం : 'ధానరాధేయ' శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు
శ్రీమతి భారతి - శ్రీ కలవచర్ల గోపాల కృష్ణమూర్తి దంపతులు
శ్రీమతి శ్యామల - డా॥ ఆకెళ్ళ సత్యసుబ్రహ్మణ్యకుమార్ దంపతులు
శ్రీమతి పాప-ప్రొ॥డి.హెచ్.శాస్త్రి దంపతులు
శ్రీమతి రుక్మిణి - శ్రీ వి. రాజేంద్రనాయుడు దంపతులు

శ్రీమతి వనజాక్షి - శ్రీ ఒ.ఎల్. సూర్యనారాయణ దంపతులు
శ్రీమతి జలజాక్షి - డా॥ ఎం. రుక్మాంగదనాయుడు దంపతులు
శ్రీమతి సత్యామునిరెడ్డి - ప్రొ॥ వి. రామనరసింహారెడ్డి దంపతులు
శ్రీమతి లక్ష్మీకామత్ - శ్రీ మధుకర కామత్ దంపతులు
శ్రీమతి లలిత - డా॥ పి.హెచ్ ప్రసాద్ దంపతులు
శ్రీ లంక చంద్రశేఖరంగారు, శ్రీ తాడిమేటి రాధాకృష్ణగారు.

## 8

కీ.శే. బుచ్చిబాబుగారి 92వ జయంతి
వక్త: శ్రీ దాసరి అమరేంద్ర
అధ్యక్షులు: శ్రీ కవన శర్మగారు
**14-6-2008,** శనివారం, సాయంకాలం **5.30** గంటలకు

వేదిక : గాంధీ సాహిత్య సంఘం

సౌజన్యం : శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మిగారు (బుచ్చిబాబు ధర్మపత్ని)

## 9

సౌందర్య లహరి ఉపన్యాసవములు
వక్త: శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారు
(1) **27-8-2008,** బుధవారం, సాయంకాలం **5.30** గంటలకు
కీ.శే. వోలేటి విజయలక్ష్మి (రాణి) స్మారక సాహిత్యోపన్యాసం
"సౌందర్య లహరి-1"
(2) **28-8-2008,** గురువారం, సాయంకాలం **5.30** గంటలకు
"సౌందర్య లహరి-2"
(3) **29-8-2008,** శుక్రవారం, సాయంకాలం **5.30** గంటలకు
"సౌందర్య లహరి-3"

వేదిక : గాంధీ సాహిత్య సంఘం

సౌజన్యం : (i) శ్రీమతి వి. శ్రీ లలితాంబిక ('అంబికా అనంత్')-
శ్రీ పి.ఎస్.వి. అనంతనారాయణ దంపతులు

(ii) కర్నల్ వి.యస్. రామానందంగారు
(iii) శ్రీరస వార్షిక సభ్యులు

## 10

## "చందనం" - ప్రొ॥ ఆర్వీయస్. సుందరంగారి

## అభినందన గ్రంథం ఆవిష్కరణ సభ

**31-8-2008,** ఆదివారం, సాయంకాలం **5.30** గంటలకు

ఆచార్య దేవళ్ళ చిన్నికృష్ణయ్య, ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు, ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు, ఆచార్య ఆర్వీయస్. సుందరం, డా॥ దివాకర్ల రాజేశ్వరి, శ్రీమతి అంబికా అనంత్, డా॥ పి.ఆర్.హరినాథ్ ఈ గ్రంథావిష్కరణ సభలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావుగారు రచించిన "కల్పవృక్షం-సుందరీకాండ విమర్శ"; ఆచార్య ఆర్వీయస్. సుందరం రచించిన "Folk Intelligence and other Essays"; ఆచార్య జి.యస్. మోహన్ రచించిన "Papers on Comparative Studies" అనే గ్రంథాలు కూడా ఆవిష్కరింపబడ్డాయి.

వేదిక : గాంధీ సాహిత్య సంఘం
సౌజన్యం : శ్రీ పరుచూరి సురేంద్రకుమార్‌గారు,
పరుచూరి గ్లోబల్ ఫౌండేషన్, బెంగుళూరు.

## 11

## ఆధునికాంధ్ర సాహిత్యోపన్యాసాలు

**26-10-2008,** ఆదివారం,

సాయంకాలం **5.30** గంటల నుండి రాత్రి **8**గంటల వరకు

(1) "గురజాడవారి కన్యాశుల్కం - **19**వ శతాబ్ది భారతీయ నాటకాలు: తులనాత్మక పరిశీలన"
- డా॥ యు.ఏ. నరసింహమూర్తి, విజయనగరం

(2) "దేవరకొండ బాలగంగాధర తిలక్ కవితావైభవం"
- డా॥రెంటాల శ్రీవెంకటేశ్వరరావు, శృంగవరపు కోట,విజయనగరం

ముఖ్యఅతిథి : ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు

అధ్యక్షులు : ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

వేదిక : గాంధీ సాహిత్య సంఘం

సౌజన్యం : కేంద్ర సాహిత్య అకాడెమీ మరియు 'శ్రీరస' వార్షిక సభ్యులు

## 12

## ఆచార్య రత్నాకరం శంకరనారాయణరాజుగారి
## 89వ జన్మదిన మహోత్సవ సాహిత్యోపన్యాసాలు

నవంబరు 12, 13, 14 మరియు 15, 2008

ప్రతి దినము సాయంకాలం 5.30 గంటల నుండి రాత్రి 8గంటల వరకు

**12.11.2008**,బుధవారం: తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము-I

**13.11.2008**,గురువారం:తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము-II

**14.11.2008**,శుక్రవారం:తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము-III

వక్త: డా॥ గరికిపాటి నరసింహారావుగారు, కాకినాడ

**15.11.2008**,శనివారం: "మహర్షి అరవిందయోగి సావిత్రి - పరిచయం"

వక్త: ప్రొ॥ తంబిశెట్టి రామకృష్ణగారు, బెంగుళూరు

వేదిక : గాంధీ సాహిత్య సంఘం

సౌజన్యం : (1) శ్రీమతి చక్రావధానుల పద్మగారు
(2) శ్రీ భాస్కర్, ఎన్. రాజుగారు
(3) ప్రొ॥ తంబిశెట్టి రామకృష్ణగారు
(4) శ్రీ పి. కృష్ణంరాజుగారు
(5) 'శ్రీరస' వార్షిక సభ్యులు

మనవి: 'శ్రీరస' వార్షిక సభ్యత్వం: రూ. 1000/- అందరూ సభ్యులుగా చేరవలసిందిగా మనవి. మీరు సంవత్సరానికి వేయిరూపాయిలిస్తే, నేను నెలకి ఒక సాహిత్య సభ ఏర్పాటు చేస్తాను - తంగిరాల



# తంగిరాల సాహిత్య డైరీ (2008)

## (1) 27-1-2008 (ఆదివారం):

హైదరాబాద్ రవీంద్ర భారతిలో కీ.శే. దేవరకొండ బాలగంగాధర తిలక్ 87వ జయంత్యుత్సవ సభలో డా॥ సి. నారాయణ రెడ్డిగారిచే సత్కారం. తిలక్ కొడుకులు డా॥ డి.ఎస్.ఎన్ మూర్తి (U.K.), డా॥ డి. సుబ్రహ్మణ్యం (U.S.A.), కూతురు శ్రీమతి యనమండ్ర చంద్రలేఖ (U.S.A.) సాధన సాహితీ సమితి సహకారంతో ఈ సభలను ఏర్పాటు చేశారు. ఈ సందర్భంగా తిలక్ స్మారక సంచికను ఆవిష్కరించారు. అందులో తంగిరాలగారు "తిలక్ వచన కవిత-భాష" అనే వ్యాసాన్ని వ్రాశారు.

## (2) 29-2-2008 (శుక్రవారం):

పశ్చిమ గోదావరి జిల్లా పాలకొల్లులోని "రసధుని" సాహిత్యసంస్థలో సభ. పెద్దిభొట్ల బ్రహ్మయ్యస్మారక రసధుని సాహితీపురస్కారాన్ని ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావుగారికి ఇచ్చారు (రూ. 5116=00, శాలువా, సన్మాపత్రం, జ్ఞాపిక). 'రసధుని' గౌరవాధ్యక్షులు శ్రీ పెద్దిభొట్ల లక్ష్మీనారాయణగారు ఈ పురస్కారాన్ని ఏర్పాటు చేశారు. తణుకు నన్నయభట్టారక పీఠం అధ్యక్షులు డా॥ జియస్వీ ప్రసాద్‌గారు, కార్యదర్శి శ్రీ సుశర్మగారు, శ్రీగమిని రాజాగారు, శ్రీరాధారమణ గుప్తాగారు కూడా తంగిరాలవారిని సత్కరించారు.

## (3) 5-3-2008 (బుధవారం):

విశాఖపట్టణం "సహృదయ సాహితి"లో "దేవరకొండ బాలగంగాధర తిలక్ వ్యక్తిత్వం - కవిత్వం" అనే అంశాన్ని గురించి ప్రసంగించారు. రావిశాస్త్రిగారి తమ్ముడు డా॥ రాచకొండ నరసింహశర్మగారు ఈ సభను ఏర్పాటు చేసి, ఆచార్య తంగిరాలను సత్కరించారు.

## (4) 6-3-2008 (గురువారం)(మహాశివరాత్రి):

అనకాపల్లి Indian Haiku Club లో "ఏటిన ముత్యాలు" ప్రసంగం. అనకాపల్లి R.T.O. శ్రీమతి బి. శ్రీ కృష్ణవేణి ఈ సభను ఏర్పాటు చేశారు.

**(5) 9-3-2008 (ఆదివారం):**

రాజమండ్రి "కళాగౌతమి" లో "శేషేంద్ర కవితా వైభవం" ప్రసంగం. కళాగౌతమి వ్యవస్థాపకులు డా॥ బి.వి.ఎస్. మూర్తిగారు ఈ సభను ఏర్పాటు చేశారు. రాజమండ్రి రచయితల సంఘం అధ్యక్షులు శ్రీ జగన్నాథం వెంకటరెడ్డి, కార్యదర్శి శ్రీ మహీధర రామశాస్త్రి, కళాగౌతమి కార్యదర్శి శ్రీ గ్రంథి రామచంద్రరావు తంగిరాలవారిని సత్కరించారు.

**(6) 26-3-2008 (బుధవారం):**

బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో "శేషేంద్ర కవితా వైభవం" ప్రసంగం.

**(7) 7-4-2008 (సోమవారం) (ఉగాది):**

బెంగుళూరులోని "మా తెలుగు తల్లి" సంస్థలో ప్రసంగం ("ఏఱిన ముత్యాలు")

**(8) 25-4-2008:**

బెంగుళూరులోని తెలుగు విజ్ఞానసమితిచే శ్రీకృష్ణదేవరాయ కళాపురస్కారం (ఉగాది పురస్కారం).

**(9) 29-4-2008 (మంగళవారం):**

బెంగుళూరులోని 'శ్రీరస'లో ప్రసంగం.

**(10) 25-6-2008 (బుధవారం):**

పుట్టపర్తిలో భగవాన్ శ్రీ సత్యసాయి బాబాగారి ప్రశాంతి నిలయంలో శ్రీవారి సమక్షంలో "వాల్మీకి రామాయణం-కిష్కింధాకాండ"ను గురించి ప్రసంగం. ("రామాయణ సప్తాహం 22 నుండి 28 వరకు, జూన్ 2008).

**(11) 26-10-2008 (ఆదివారం):**

కేంద్ర సాహిత్య అకాడెమీ బెంగుళూరులో ఏర్పాటు చేసిన ఆధునికాంధ్ర సాహిత్యోపన్యాసాల సభకు అధ్యక్షత.

**(12) 25-11-2008 (మంగళవారం):**

కేంద్ర సాహిత్య అకాడెమీ విజయవాడలో ఏర్పాటు చేసిన బహుభాషా కవితాగోష్ఠికి కన్వీనరుగా వ్యవహరించారు.

**(13) 26-11-2008 (బుధవారం):**

కేంద్ర సాహిత్య అకాడెమీ విజయవాడలో ఏర్పాటు చేసిన సభలో "నా దృష్టిలో తిలక్"(Through My Window) అనే అంశంపై ప్రసంగించారు.

**- రాజేశ్వరి - అంబిక**

'శ్రీరస' సంస్థాపక కార్యదర్శులు



# సాహిత్యవార్తలు

**సాహిత్యవార్త-1:**

## తైదల అంజయ్య - 'పునాస'కు ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు

రెండు దశాబ్దాల ప్రతిష్ఠాత్మక పురస్కారం "ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు - 2007" కోసం తైదల అంజయ్య కవితా సంపుటి 'పునాస' ఎంపికైనట్లు అవార్డు వ్యవస్థాపకులు రాధేయ ఒక ప్రకటనలో తెలియజేశారు.

ఈ అవార్డు న్యాయనిర్ణేతలుగా -

హెచ్చార్కె, పాపినేని శివశంకర్, రామాచంద్రమౌళి ... గార్లు వ్యవహరించారు. అవార్డు పొందిన కవి తైదల అంజయ్య కరీంనగర్‌జిల్లా, కోహెడ మండలం, నాగసముద్రాల గ్రామానికి చెందినవారు. వృత్తిరీత్యా ఉపాధ్యాయులు. సమకాలీన వర్తమాన కవిగా జీవితాన్ని దగ్గరగా స్పృశించినవారు. అన్ని వాదాల సత్యాల్ని స్వీకరించి వెన్నెల కన్నీరును కూడా స్వచ్ఛంగా చూపిన కవిత్వమే - 'పునాస' అని న్యాయనిర్ణేతలు పేర్కొన్నారు.

'పునాస' వీరి తొలి కవితా సంపుటి. ఈ అవార్డు పొందినవారిలో ఈ కవి 20వ వారని రాధేయ అన్నారు.

**- రాధేయ**

సాహిత్యవార్త-2:

## శ్రీ మునిపల్లె రాజుగారికి తిలక్ అవార్డు (2008)

పశ్చిమ గోదావరి జిల్లా తణుకులో 75 సంవత్సరాల క్రిందట స్థాపింపబడిన సాహిత్య సంస్థ "నన్నయ భట్టారక పీఠము". ఈ పీఠంవారు ప్రతి సంవత్సరం ఇచ్చే "దేవరకొండ బాలగంగాధర తిలక్ స్మారక సాహిత్య పురస్కారం" 2008వ సంవత్సరానికి ప్రముఖ కథకులు శ్రీ మునిపల్లె రాజుగారికి ఇచ్చారు. ఇంతవరకూ కవులకు మాత్రమే (వచన కవులకు, పద్యకవులకు) ఇస్తూ వచ్చిన ఈ పురస్కారం మొట్టమొదటిసారిగా ఒక కథకునికి ఇచ్చారు. తిలక్ గొప్ప గొప్ప కథలు కూడా వ్రాయడమే దీనికి కారణం. తిలక్ నాటకాలు - నాటికలు వ్రాసి ప్రదర్శింపజేశారు కాబట్టి 2009లో ఒక నాటక రచయితకు తిలక్ అవార్డు ఇవ్వాలని భావిస్తున్నారు. ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు డా॥ శ్రీపాద కృష్ణమూర్తి (ఇద్దరూ తిలక్‌గారికి ప్రియశిష్యులు) 20వేల రూపాయలతో ఈ పురస్కారాన్ని ఏర్పాటు చేశారు. ఈ సంవత్సరం తిలక్‌గారి సంతానం డా॥ దేవరకొండ సత్యనారాయణ మూర్తి, డా॥ దేవరకొండ సుబ్రహ్మణ్యం, శ్రీమతి యనమండ్ర చంద్రలేఖ ఈ పురస్కార నిధికి 30వేల రూపాయలు జత చేశారు. దీనితో ఈ నిధికి ఇప్పుడు 50వేల రూపాయలు సమకూరాయి.

**- తంగిరాల**

* * *

సాహిత్యవార్త-3:

## నన్నయ భట్టారక పీఠము - తణుకు (పశ్చిమ గోదావరి జిల్లా) తిలక్ అవార్డులు పొందినవారు

1997 డా॥ గుంటూరు శేషేంద్రశర్మ, హైదరాబాద్.

1998 మహమ్మద్ ఇస్మాయిల్, కాకినాడ.

1999 డా॥ ఆవంత్స సోమసుందర్, పిఠాపురం (తూర్పు గోదావరి జిల్లా)

2000 శ్రీ కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ, రాజమండ్రి.

2001 శ్రీ కె. శివారెడ్డి, హైదరాబాద్.

2002 డా॥ ఎన్. గోపి, హైదరాబాద్.

2003 డా॥ అద్దేపల్లి రామమోహనరావు, కాకినాడ

2004 శ్రీ రంగినేని సత్యనారాయణరాజు (రసరాజు), తణుకు.

2005 డా॥ ఉత్పల సత్యనారాయణాచార్య, హైదరాబాద్.

2006 శ్రీ దుగ్గిరాల రామారావు, హైదరాబాద్.

2007 డా॥ ఎండ్లూరి సుధాకర్, రాజమండ్రి.

2008 శ్రీ మునిపల్లె రాజు, హైదరాబాద్.

* * *

**సాహిత్యవార్త-4:**

## కవి రాధేయకు పిహెచ్.డి. ప్రదానం

ప్రముఖ కవి, ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు వ్యవస్థాపకులు శ్రీ రాధేయకు శ్రీ వెంకటేశ్వరావిశ్వవిద్యాలయం తెలుగు విభాగం పిహెచ్.డి. ప్రదానం చేసింది. ఆచార్య యస్.జి.డి. చంద్రశేఖర్‌గారి పర్యవేక్షణలో "ఆధునిక ఆంధ్రకవిత్వానికి సీమకవుల దోహదం" అనే అంశం మీద పరిశోధన గ్రంథాన్ని సమర్పించినందుకుగాను విశ్వవిద్యాలయం వీరికి డాక్టరేటును ప్రకటించింది.

రాధేయ ప్రముఖ జాతీయకవిగా సాహితీలోకానికి సుపరిచితులే. వీరు 7 కవితా సంపుటాలను రచించారు. అంతేకాక 25 కథలు, 75 సాహిత్యవ్యాసాలు వివిధ పత్రికల్లో వచ్చాయి. ఉత్తమ కవిత్వం కోసం ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు 1988లో స్థాపించి గత రెండు దశాబ్దాలుగా ఈ అవార్డును అత్యంత ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తూ ఉన్నారు. వీరు ఇటీవల చేనేత కార్మికుల జీవితాలపై "మగ్గంబతుకు" అనే దీర్ఘ కావ్యాన్ని రాశారు. ఇది చేనేత రంగం మీద వచ్చిన తొలి దీర్ఘకావ్యంగా సాహితీ విమర్శకులు పేర్కొన్నారు. ఈ కావ్యానికి రాష్ట్రవ్యాప్తంగా విశేష స్పందన లభించింది. అంతేకాకుండా ఈ కావ్యంమీద యం.ఫిల్. కూడా వెలువడినది.

రాధేయ అసలు పేరు వి.యన్.సుబ్బన్న. వీరు ప్రస్తుతం ప్రభుత్వ జూనియర్ కళాశాల పామిడిలో తెలుగు లెక్చరర్‌గా పనిచేస్తున్నారు. రాయలసీమ ఆధునిక కవిత్వంపై సమగ్ర పరిశోధన జరిపి ఈ సీమ కవిత్వానికి ఒక ప్రత్యేక గుర్తింపును గౌరవాన్ని తెచ్చినందుకు గాను వీరిని పలువురు మేధావులు, సాహిత్యాభిమానులు, కళాశాల అధ్యాపకులు, విద్యార్థులు ఎంతగానో అభినందించారు.



విచిత్రవార్త:

# పాట మరచిన పిట్టలు

బ్రిటన్‌లో పిట్టలు పాటలు పాడటం మరచిపోతున్నాయట. ఇందుకు ట్రాఫిక్ రణగొణధ్వనులే కారణమని నిపుణులు విచారిస్తున్నారు. ఎవరూ పెద్దగా పట్టించుకోరు గానీ ట్రాఫిక్ ధ్వనుల ప్రభావం పిట్టలపై మూడు కిలోమీటర్ల వరకు ఉంటుందిట. ఒకప్పుడు గొంతెత్తి మైమరిచి పాడిన పిట్టల గొంతు నుండి ఇప్పుడు మామూలు అరుపులు తప్ప ఇంకేం వెలువడటం లేదట. తల్లిపిట్టకు పాట వస్తేనే కదా పిల్లపిట్టకు పాట నేర్పేది. నిత్యం ట్రాఫిక్ హోరుతో చెవులు చిల్లులు పడిపోయిన పిట్టలు తమ సంతానానికి కూడా అవే ధ్వనులు నేర్పుతున్నాయట. ఈ దారుణ పరిస్థితిని ఎలా చక్కదిద్దాలో తెలియడం లేదని రాయల్ సొసైటీలో పక్షుల సంరక్షణ విభాగం నిపుణులు వాపోతున్నారు!

పిట్టలు జతకట్టే కాలంలో తమ శ్రావ్యమైన పాటతో తోటిపిట్టలను ఆకర్షిస్తాయి. కానీ ఇప్పుడు ఆ పరిస్థితి కనిపించడం లేదని డచ్‌కు చెందిన పక్షిశాస్త్ర నిపుణులు పియెట్ బెర్జర్ అంటున్నారు.

కార్లు రివర్స్ తీసుకునేటప్పుడు, 'బివేర్, అయాం బాకింగ్' అన్న మాటలను, వాహనాల హారన్ మోతలను,మొబైల్ ఫోన్ ట్రింగ్, ట్రింగ్‌మని చేసే చప్పుళ్ళను పిట్టలు అనుకరిస్తున్నాయట!

*(ఆంధ్రప్రభ దినపత్రిక, 27 జనవరి 1999)*

**"నేటి మానవుడి చైతన్యానికి రెండు పార్శ్వాలైన సామాజిక స్పృహ, జీవన స్పృహ - అతని సుదీర్ఘ వికల స్వప్నజీవిత నిశిలో అంతర్ వ్యోమయానం చేస్తూనే ఉంటాయి. ఈ పరిభ్రమణాల రహస్య ప్రకంపనలను అభివ్యక్తీకరించే ప్రయత్నమే 'Magical Realism' (అద్భుత వాస్తవికత). ఈ ప్రక్రియ స్థలకాలపరిమితులను (Time and Space) అధిగమించగల శక్తి గలది... భారతీయ జానపద వాఙ్మయంలోనూ; రామాయణ, మహాభారత, భాగవత పురాణాలలోను దర్శనమిచ్చేది ఈ అద్భుత మాయావాద రసమే!"**

**- మునిపల్లె రాజు**

అనుబంధ కవితలు:

# మూలా సుబ్రహ్మణ్యం కవితలు

## ఆహా!

తొలిసంధ్యలో పూసే పూలకి
పురిటిస్నానం చేయించేది మంచు
మలిసంధ్యలో రాలే పూలకి
ఆఖరి స్నానం చేయించేదీ మంచే

రెండు సంధ్యల మధ్య
అనాదిగా అదే కావ్యం
ఎన్నిసార్లు చదివినా
విసుగనేదే రాదు

* * *

గుడ్డుని పగలగొట్టుకుని
లోకాన్ని తొలిసారి చూసే
పాముపిల్ల కళ్ళల్లో ఆశ్చర్యం

ఎన్ని స్మృతుల్ని నింపుకున్నా
నా కళ్ళలోనూ అదే ఆశ్చర్యం

* * *

నాతో పాటు కళ్ళు తెరిచి
నాతో పాటు కళ్ళు మూసే లోకం
నా కనురెప్పల వెనకే
అనంత విశ్వం!

నిద్రపోయే పసిపాప
కనురెప్పల వెనక
ఎన్ని అద్భుత లోకాలున్నాయో!

ఎప్పుడూ విస్మయంతో
పాపని నేనూ..
నన్ను పాపా..

* * *

సాయంత్రపు చలిమంట
ఎండుపుల్లలు చిటపటమంటుంటే
ఎర్రగా అటు ఇటు ఊగే
అగ్ని కీలలు

దట్టమైన అడవి
రాలిన ఆకుల మధ్యనుండి
జర జరా పాకే నాగుపాము

భయానకంలో సౌందర్యం
కళాకారుడి కళ్ళకో నమస్కారం!

* * *

కొండలకి జ్ఞానోదయాన్ని కలిగిస్తూ
ఏడు గుర్రాల వాడు
మూడో ప్రపంచ యుద్ధం వచ్చినా
వాడు మాత్రం ఆగడు

చీకటిని కప్పుకుని నిద్రపోయే చెట్లమీద
మంచు చిలకరించి మరీ లేపుతాడు
బరువుగా మూసిన కనురెప్పల్ని
కిరణాలతో గుచ్చి మరీ తెరుస్తాడు

గుండెని ..
నిండుగా తెరిచే
ఒకే ఒక్క కిరణం కోసం
జన్మ జన్మల నిరీక్షణ

* * *

భూమిని చీల్చుకు వచ్చి
లోకాన్ని ఆశ్చర్యంతో తిలకిస్తూ
పచ్చగడ్డి

నన్ను నేను చీల్చుకుని
అంతర్లోకాన్ని విస్మయంతో తిలకిస్తూ
నేను

నేను .. పచ్చగడ్డి..
పచ్చగడ్డి.. నేను..
ఈ మహాప్రకృతిముందు
నేనొక గడ్డిపోచను

* * *

ఉప్పు కరిగాకే
కూరంతా వ్యాపిస్తుంది

"నేను" కరిగిపోతే
విశ్వమంతా వ్యాపించనూ?

* * *

ఒకటి... రెండు... మూడు...
గడియారం క్షణాల్ని ..

ఒకటి... రెండు... మూడు...
నేల చినుకుల్ని ..

ఒకటి... రెండు... మూడు...
తీరం కెరటాల్ని ..

ఒకటి... రెండు... మూడు...
నేను నాలోని "నేను"ల్ని

* * *

"నేను" పెరిగేకొద్దీ
కన్నీరు కూడా..

ఆ నదిని దాటాలని
నిర్మించని వంతెన లేదు
మధ్యలోకి వెళ్ళగానే
కూలిపోని వంతెనా లేదు

దేన్ని దాటాలనుకుంటామో
దాంట్లోనే మునిగిపోతాం!

* * *

రైలు ప్రయాణించినంతసేపూ శబ్దమే
నీలోనే వెతుక్కోవాలి నిశ్శబ్దాన్ని ..

రైలు కిటికీలోంచి
అనంతంలోకి విసిరేసుకుంటూ ..
ప్రయాణంలో ..
మరొక ప్రయాణం

ఈ చిన్ని ప్రయాణంలో
ఎన్ని ప్రయాణాలో?

* * *

"అయ్యో నిన్న చెయ్యలేదే ..
పోనీ రేపు చేద్దాం"
"నిన్న" "రేపు"ల మధ్య
ఓడిపోతూ "నేడు"

కాలం జాలంలో పడి
గిలగిలలాడనివాడెవడు?

ఆలోచించి ఆలోచించి కాలం
అంతరంగానికి అద్దమేనని గ్రహించి
ఆ కాళ్ళకి నమస్కరిద్దామనుకునేసరికి
నాకు అందనంత దూరంలో..

* * *

కోటి ఆలోచనలతో
ఏటి ఒడ్డున

ఎక్కడనుంచో వచ్చి ఎక్కడికో వెళ్తోందా?
రావడం వెళ్ళడం అంతా అబద్ధమేనా?

దేహంతోనే సందేహం
రెండూ సహజాతాలేనా?

అన్ని ప్రశ్నలు
ఒకటే జవాబు
మృత్యువు

ఆమె తలుపులు మూయదనీ
భళ్ళున తెరుస్తుందనీ
ఎంతమందికి తెలుసు?

అన్నీ వదులుకుంటే ప్రతీదీ నీదవుతుంది
మృత్యువును ప్రేమించు
జీవించడం నేర్పుతుంది

* * *

విరహంతో పిలిచే చెట్లకీ
విహాయసాన విహరించే మేఘాలకీ
ఏనాటిదో చినుకుల బంధం

వర్షం కురిసిన ప్రతిసారీ
ఆమె గుర్తుకు రావడంలో
ఆశ్చర్యం ఏముంది?

కవిత్వానికి ఋణపడ్డాను
ప్రేమించడం నేర్పినందుకు.

* * *

కొలనులోనే ఉంది
కానీ కొలనులో లేదు
తామరాకు

ఆశించడంలోనే నాశనం ఉందా?

కవితాత్మకంగానే అయినా భగవద్గీతని
మళ్ళీ రాయడానికి మనసొప్పడం లేదు

కృష్ణ పరమాత్మా! ఈ
తృష్ణ తీర్చగ రావా?
మీరా రాయని కీర్తన.

"గోడో" ఎప్పటికీ రాడు నీ
గోడు ఎప్పటికీ వినడు

నచికేతా
కఠోపనిషత్
కఠినంగా ఉందా!

తరచి తరచి చూసాకా ..
దేనికీ అర్థంలేదని తెలిసాకా ..

నిఘంటువును చూస్తే
నవ్వొస్తోంది

* * *

ఆ సాయంత్రం
అదే ఏటి ఒడ్డున ..

సెలయేరు మీద
చీకటి వెలుగులు రాస్తున్న
చిత్ర లిపిని చదువుతూ

దేనికీ అర్థం లేదంటే ..

చిరు నవ్వు నవ్వుతూ
ఆమె అన్నది కదా ...

"నీకు అర్థం కానంత మాత్రాన
అర్థం లేనట్టేనా?"

* * *

గలగలమంటూ సెలయేరు
ఏవో రహస్యాలని గానం చేస్తుంటుంది

పసిపాప తప్పటడుగుల్లో
ప్రపంచాన్ని బంధించే
లయ వినిపిస్తుంది

పూలు రాలిపోతూ ఇంతే .. ఇంతే ..
అని నవ్వుతుంటాయి

విశాలమైన మైదానాల్లో
విశృంఖలంగా సంధ్య
నర్తిస్తునే ఉంటుంది

కడలితో సంగమించే నదిలో
ఆనందం సుళ్ళు తిరుగుతుంది

పిల్లనగ్రోవి రంధ్రాలు
ఏవో పురాతన సారంగాల్లోకి
తీసుకుపోతునే ఉంటాయి

అనంతంగా ఆకాశం
అధివాస్తవిక చిత్రాల్ని
గీస్తునే ఉంటుంది

ప్రకృతి తమలో నింపిన సంగీతాన్ని
తిరిగి ప్రకృతిలోనే ఐక్యం చేస్తూ
పక్షులు పాడుతుంటాయి

పువ్వులు.. పక్షులు..
సెలయేళ్ళు.. ఆకాశం..
ఆమె దగ్గర్లోనే ఉందని
నాకు చెప్పునే ఉంటాయి.

* * *

మలిసంధ్యలో రాలే పూలే
తొలిసంధ్యలో పూసే పూలు
సూర్యుడు ఇక్కడ అస్తమించేది
ఇంకెక్కడో ఉదయించడానికే

రెండు సంధ్యల నడుమ
అనంతంగా ఇదే కావ్యం
ఎక్కడెక్కడో వెతక్కు
సమాధానం ఇక్కడే ఉంది!

* * *

మొగ్గలో
అనంత విశ్వం ముడుచుకుంటుంది
పువ్వులో
విశ్వ నేత్రం తెరుచుకుంటుంది

యుగాలుగా దిగబడ్డ
ప్రశ్నార్థకాలన్నీ
పెకిలించాకా

చీకటి సముద్రపు లోతుల్లో
పాతిపెట్టబడిన సూర్యుడు
మెల్ల మెల్లగా .. పైకొస్తుంటే..

నా నోటి నుండి వెలువడే
చరమ వాక్యం ....

ఆహా!!!

# AMBICA ANANTH

## 1. WOUNDED

I was a glowing tree
With amber in my flowers
The red desire to live
emanated from me
But the hands of an unknown man
wounded my whole body
The wax of my tears
flows down to earth
to become one with it
to strengthen my resolve
not to crumble and crash
I am a flaming tree now
I flower only wounds
the red speaks a different story...
of contempt and hate
My heart awaits
a cool drizzle of love
to soak and nurture me
to heal and vivify me
to release the gasping
buds of passion and love
to spurt and bloom again
into flowers with fire of life
to put the life of spring
In my body and soul..
lest I perish
with bare branches...
A curse
for no fault of mine...

*(for rape victims solemnly)*

* * *

## 2. YOU ARE ....

You are the ageless sun
In the sun washed sky of my thoughts
Sending shining shafts of warmth
Melting the vast silence of dejection
In your enigmatic wordless language
I hear the messages of miracles
A tête-à-tête with my dreams
Turning the garden of falling leaves
Into glorious green of spring
Touching my very soul
Like destiny's soft fingertip
Tracing new designs of hope...

* * *

## 3. OPEN PRISON

The path leading to it
glows temptingly
in yellow and crimson
of turmeric and vermillion
the insides are painted
with the colours of
despair and dejection

Stifling sighs the walls
leaking roof of tears
over dreams' expanse
Tightening cords
around the heart
the only bonds...

Alone all day, alone all night
Life is full
With emptiness
Suspended, frozen
with beating restless wings
Pining to fly
into moments of self will
Feet are stuck
and the sky is missing
In this open prison...



# తంగిరాల కవితలు

## 1. ఉన్మత్త ప్రేమ రాక్షసులు

రావణుడు బ్రతిమాలాడు:
"నన్ను ప్రేమించు
నిన్ను పట్టపురాణిని చేస్తాను
నా భార్యలందరినీ నీకు దాసీల్ని చేస్తాను
నా అష్టైశ్వర్యాలూ హాయిగా అనుభవించు!"

గడ్డిపరక అడ్డుపెట్టుకుని సీత ధిక్కరించింది:
"ఓరీ మూర్ఖుడా!
ఇవన్నీ నాకు తృణప్రాయం
నా రాముడే నాకు దైవం!"

రావణుడు బెదిరించాడు:
'నెలరోజుల్లోగా నీ మనసు మార్చుకొని నన్ను ప్రేమించకపోతే
నిన్ను కూరగా వండించి తినేస్తాను"

నిజానికి రావణుడు:
చెల్లెలికి చేసిన అవమానానికి ప్రతీకారంగా
సీత ముక్కూ చెవులూ కోయలేదు!
ఉన్మత్త ప్రేమికుడై –
సీతను బాకుతో పొడవలేదు!
కత్తితో తల నరుకలేదు!
నాకు దక్కని అందం రాముడికి దక్కకూడదని
సీతమీద యాసిడ్ దాడి చేయలేదు!
ఆహా!
అలనాటి రావణుడు ఎంత మంచివాడు!
వర్తమాన ఉన్మత్త ప్రేమికుల కన్న
రాక్షస రావణుడు వేయిరెట్లు మిన్న!

## 2. కాలం బోనులో ముసలి పులి

మాఘమాసం చివరిరోజులు
మహాశివరాత్రికి ముందు ఓ సాయంకాలం
సికిందరాబాద్ సైనిక్‌పురిలో ఒక రోడ్డు
పడమటి కడలిలో మునుగుతున్న సూర్యుడు నెత్తుటి గుడ్డు
నీరెండ బంగరు చారల శాలువా కప్పుకొని
వీథిలో వృద్ధ దంపతుల నడక.
సతి - బాబ్‌కట్, పువ్వుల గౌను, ఆంగ్లో ఇండియన్ వింతశైలి
పతి - ముసలితనంలో కూడా మంచి చురుకుదనం నింపుకున్న సుడిగాలి
చేతిలో చిన్న స్టిక్, కాకీనిక్కరు, టీషర్టు, వేగంగా నడక,
ఆ వృద్ధవీరుని చూచి నా ప్రక్కనే ఉన్న
మాజీ వైమానికోద్యోగి మా మేనల్లుని వ్యాఖ్య:
"ఆయన Ex-Air Field Marshal పేరు Parker
అప్పుడు పాకీస్థాన్ యుద్ధంలో -
శత్రువుల Oil Tanks అన్నీ భస్మం చేసివేసిన మహావీరుడు
ఇప్పుడు వృద్ధాప్యం అంపశయ్యమీద పితామహుడు భీష్ముడు"
శైశవం - బాల్యం - యౌవనం - మధ్యవయస్సు - వృద్ధాప్యం - మరణం
వివిధ దశల్లోకి వేగంగా నెట్టివేస్తుంది కాలం,
విధి మనచుట్టూ పన్నిన మాయాజాలం!
నిన్న - యుద్ధ విమానంలో నింగికెగిరి, మబ్బుల్ని పిండి,
బాంబుల వర్షం కురిపించిన వీరుడు
అభినవ మహేంద్రుడు పల్నాటి బాలచంద్రుడు
నేడు - ముసలితనం మీదపడినా హుషారుగా నడుస్తున్నాడు
రేపు - చేతికర్ర ఊతంతో ఊగుతూ కదలుతాడు
ఎల్లుండి-మంచం పడతాడు-'గదిలో మంచమె యెల్ల లోకమగుచున్
కాలమ్ము వెళ్ళించు వృద్ధు'డుగా మిగులుతాడు
మరి కొన్నాళ్ళకు మట్టిలో కలుస్తాడు!
ఇలా ఆలోచనల గొడుగు తెరుచుకున్న నా తలలో -
Thomas Gray elegy జ్ఞప్తికి వచ్చింది ...
"All paths of glory lead but to the grave" ....



“పురుషోత్తముడు” కావ్యాన్ని ఆవిష్కరిస్తున్న శ్రీసకలా నరసింహులుశ్రేష్ఠిగారు
చిటిప్రోలు - తంగిరాల - సకలా , బెంగుళూరు, 9-4-2007



శ్రీచిటిప్రోలు కృష్ణమూర్తిగారి నుండి “పురుషోత్తముడు” కావ్యాన్ని అంకితం పుచ్చుకుంటున్న ఆచార్య తంగిరాల సుబ్బారావుగారు, బెంగుళూరు, 9-4-2007

